మాతృదేవోభవ । పితృదేవోభవ। ఆచార్యదేవోభవ।

మేము కొనసాగిస్తున్న సద్గ్రంథరత్న ప్రచురణ విశ్వవ్యాప్త ప్రచారానికి తాము సహకరించుటయే గాక తమ అనుచర, సహచర, శిష్య, ప్రశిష్యవర్గం ద్వారా కూడ భూరివిరాళాలను ఇప్పించి జన్మను చరితార్థం చేసికొని భువి నుండి దివికేగిన ధన్యాత్ములు : మేము ఏనాటికీ మరువజాలని మహామనీషి :



శ్రీశ్రీశ్రీ ఓం నారాయణ్‌జీ మహరాజ్ వారు

రాజమండ్రి భాగవతమందిర ప్రచురణ ప్రచారోద్యమానికీ, పూజాపారాయణలకు అన్నదానానికీ
గత 3 సంవత్సరాలుగా సహకరిస్తున్న ధన్యాత్ములు



డాక్టర్ శ్రీయుత **కె. సురేష్ రెడ్డి** & శ్రీమతి **రూపా రెడ్డి** దంపతులు
ఈ ఉదార పుణ్యదంపతుల చిరంజీవులు అరుణ్‌రెడ్డి, అమీత్‌రెడ్డి, పూజారెడ్డి

## 1997 జనవరి నుండి 1998 జనవరి వరకూ ప్రతి నెలా రాత్రి గల పూర్ణిమనాడు జరుగు విశేషార్చనలు

| | |
|---|---|
| జనవరి | 22వ తేదీ, బుధవారం |
| ఫిబ్రవరి | 21వ తేదీ, శుక్రవారం |
| మార్చి | 23వ తేదీ, ఆదివారం |
| ఏప్రియల్ | 22వ తేదీ, మంగళవారం |
| మే | 21వ తేదీ, బుధవారం |
| జూన్ | 20వ తేదీ, శుక్రవారం |
| జూలై | 19వ తేదీ, శనివారం |
| ఆగస్టు | 17వ తేదీ, ఆదివారం |
| సెప్టెంబర్ | 16వ తేదీ, మంగళవారం |
| అక్టోబర్ | 15వ తేదీ, బుధవారం |
| నవంబర్ | 13వ తేదీ, గురువారం |
| డిసెంబర్ | 13వ తేదీ, శనివారం |

దాతల గోత్రనామాలపై అఖండ కుంకుమార్చన చేసి పారాయణానంతరం ప్రసాద వితరణ పుస్తక వితరణ చేయ నిశ్చయించినాము. ఇందు నిమిత్తము రూ. 3,000=00 లు అందజేయువారికి త్రిలోహ నిర్మిత శ్రీచక్ర ధారణా యంత్రాన్నీ, పూజా యంత్రాన్నీ, నరఘోష నివారక యంత్రాన్నీ, సద్వినియోగార్థం శ్రీ లలితా సహస్రమ్ 108 ప్రతులనూ అందజేయ నిశ్చయించినాము.

వివరాలకు **పురాణపండ రాధాకృష్ణమూర్తి**

ఫోన్ : 62964 29-6-13 డి, సూర్యా హోటల్ దగ్గర, రాజమండ్రి - 4.

వీరాంజనేయా! రావయ్యా!
సర్వ భారమూ నీదే నయ్యా!




**శ్రీమతి & శ్రీయుత ధర్మాంజి**

**రవీంద్ర బాబు దంపతుల సౌజన్యంతో.**

# హనుమత్ప్రభ

సుందరకాండ సారాంశ, పూజావిధాన స్తోత్రాలతో

## హనుమద్ధ్యానమ్ :

అతులిత బలధామం స్వర్ణ శైలాభదేహం
దనుజవనకృశానుం జ్ఞానినా మగ్రగణ్యామ్
సకల గుణ నిధానం వానరాణా మధీశం
రఘుపతి ప్రియభక్తం వాత జాతం నమామి.

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
సుదార్ఢ్యం వాక్పటుత్వం చ హనుమత్స్మరణాద్భవేత్.


------------------ వివరాలకు : ఫోన్ : 62964 ------------------

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

**భాగవతమందిరం - రాజమండ్రి - 4**

# హనుమత్ప్రభ

ఆఫ్‌సెట్ ముద్రణ



ప్రథమ ముద్రణ

ది 11-2-1997



వెల :

రూ. 33-00




ముద్రణా నిర్వహణ :

భరద్వాజా బైండింగ్ వర్క్స్, రాజమండ్రి - 4





ప్రతులకు :

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

జయశ్రీ టాకీస్ రోడ్ : సూర్యా హోటల్ దగ్గర

రాజమండ్రి - 4, ఫోన్ : 62964

# హనుమత్ప్రభ

**సమీక్షకులు : శ్రీ ముట్నూరి సంగమేశం**

ఈ గ్రంథము హనుమత్ భక్తులకు, ఉపాసకులకు మిక్కిలి ఉపయోగమైనది. ఇందులో హనుమంతుని గూర్చి శ్రీ శృంగేరీ పీఠాధిపతులు, శ్రీ ద్వారకా శారదా పీఠాధిపతులు, శ్రీ పూరీ గోవర్ధన పీఠాధీశ్వరులు, శ్రీ బదరీ పీఠాధీశ్వరులు, బ్రహ్మవన కాశీ పీఠాధీశ్వర, జగద్గురు శంకరాచార్య శ్రీ మహేశ్వరానంద సరస్వతి, శ్రీ అనంత శ్రీనివాస స్వామి, శ్రీ కరపాత్రీజీ మహారాజ్ వంటి మహామహులు హనుమంతుని మాహాత్మ్యాదికాన్ని తెలియజేయుచూ వ్రాసిన వ్యాసాలూ తెలుగులో చక్కగా అనువదించి సంగ్రహింపబడ్డాయి. ఉపనిషత్ పురాణేతిహాసాలలోని హనుమంతుని కథలు కొన్ని జోడించబడ్డాయి. సరళమైన భాషలో సుందరకాండ, కథ సంపూర్ణంగా వ్రాసి చేర్చబడింది. ఇది పిన్న పెద్దలందరకూ సుబోధకమై వెలసింది.

గ్రంథంలో హనుమంతుని గూర్చి చెప్పిన స్తోత్రాలు స్తుతులు, దండకాలు, కవచాలు, హెూమాది వివరణలతో హనుమత్ మంత్రరాజము, అష్టోత్తరశతనామ స్తోత్రమ్ సవివరంగా హనుమత్ పూజా విధానం వగైరాలెన్నో ఆస్తిక జనులకొకే చోట దొరికేలా చేర్చి ముద్రించ బడ్డాయి.

గ్రంథం చివర శ్రీరామరక్షాస్తోత్రం పూర్తిగా, మాహాత్మ్యపూర్వకంగా ధ్యానాది విధానాలతో కూడ చేర్చబడింది.

సంపాదకులు దైవోపాసనాపరులు ఆస్తికతా ప్రబోధకులు. వీరీ రీతి గ్రంథాలెన్నో ప్రచురించుచూ ఆస్తికులకు ఎంతో సహాయపడు చున్నారు.

కవరు మీద హనుమంతుని త్రివర్ణ చిత్రం ఆకర్షణీయంగా ఉన్నది. ఆస్తికులందరూ ఆదరించదగిన పుస్తకం.

# హనుమత్ప్రభ

## లక్షప్రతుల ప్రచురణ విశేష ప్రచారోద్యమం.

ఆత్మ కళ్యాణంతో లోక కళ్యాణాన్ని సాధించే నిమిత్తం శ్రీహనుమత్ప్రభ - లక్షప్రతులు ప్రచురించి దాతల ద్వారా వితరణ చేయించదలచినాము. ఇందు నిమిత్తం 108 ప్రతుల వంతున వితరణ చేసికోదలచిన ధన్యాత్ములను సాదరంగా వేయిమందిని ఆహ్వానిస్తున్నాము. తమ వంశ పరిచయంతో కుటుంబపు ఫోటోతో రు. 2000=00 లు అందజేయు వారికి ద్రవ్యం అందిన 21 రోజులు దాటకుండ స్వయంగా వచ్చి తీసుకువెళ్ళే యేర్పాటులో కానీ దగ్గరలో గల వారి సూచానానుసారం లారీ పార్శిల్ ద్వారా గానీ ఈ ప్రతులు అందజేయగలము. స్వయంగా సహకరించ జాలని వారు సమర్థులను ప్రోత్సహించి ఈ పావనోద్యమానికి సకాలంలో సహకరించగోరు చున్నాము.

**ఆత్మీయుల దివ్య సంస్మరణగా వారి ఫోటోతో అయినా ఈ ప్రచురణకు సహకరించ వచ్చును.**

ఎన్.బి. : ఈ క్రింది చిరునామాకే ద్రవ్యం అందాలి


**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

జయశ్రీ టాకీస్ రోడ్ - సూర్యాహోటల్ దగ్గర.

29-6-13డి, రాజమండ్రి - 4

# లక్షప్రతుల ప్రచురణ
# విశేష ప్రచారాలు నా ప్రధాన లక్ష్యం

ధర్మాత్ములైన ధన్యాత్ములారా!

అతులిత బలధాముడు, అష్టసిద్ధులనూ, నవనిధులనూ ప్రసాదించు కరుణా సముద్రుడునూ అయిన శ్రీ ఆంజనేయ స్వామి వారి విశేష కరుణ ప్రేరణలు లభించినాయి. లక్షప్రతులు ప్రచురించి దాతల ద్వారా వితరణ చేయించదలచినాము.

కోటి జన్మల పుణ్యఫలంగా భావించి సుఖశాంతులనూ, రక్షణనూ ప్రసాదించునట్టీ, ఆచంద్రతారార్కమైన సత్కీర్తిని చేకూర్చునట్టీ ఈ పరమ పవిత్ర గ్రంధరత్న ప్రచురణకు నిండు హృదయంతో సకాలంలో సహకరించి జన్మను చరితార్థం చేసి కొందురు గాక!

11-2-1977

ప్రకాశకుడు, ప్రచారకుడు
పురాణపండ రాధాకృష్ణమూర్తి

# శ్రీమంతులైన హనుమద్భక్తులకు సాదరాహ్వానము

లక్ష్యసాధనకు రు. 20,000=00ల వంతున అందజేయగల మహారాజ పోషకులూ హనుమద్భక్తులూ అయిన ధన్యాత్ములను సాదరంగా నూరుమందిని ఆహ్వానిస్తున్నాను. దాతవంశ పరిచయంతో కుటుంబపు ఫోటోతో ఈ గ్రంథ రత్నం యొక్క వేయి ప్రతులు ముద్రించి ద్రవ్యం అందిన మండలదీక్షా కాలంలో ... ప్రతులనూ, అత్యంత ప్రభావసంపన్నమైన శ్రీ ఆంజనేయ స్వామి వారి పూజాయంత్ర, ధారణా యంత్రాలనూ అందజేసెదను. ఈ సదవకాశాన్ని సమర్థులైన వారు మహానందంగా వినియోగించుకోమని గోరుచున్నాను.

వివరాలకు :———————— ఫోన్ : 62964

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

భాగవతమందిరం - రాజమండ్రి - 4.

# వి ష యా ను క్ర మ ణి క

ఓం – శ్రీ గణేశాయ నమః

# సుందర కాండ

మూలం :- పరమ పూజ్య శ్రీ శ్రీ శ్రీ మురారీ బాపూజీ మహరాజ్ వారు
సద్విచార్ పరివార్ : అహమ్మదాబాద్ (గుజరాత్)

తులసీదాస మహాకవి పరమాత్మ ప్రార్థనతో సుందరకాండ రచనకు శ్రీకారం చుడతాడు. ప్రథమ మంత్రంలో ప్రభువు యొక్క నిర్వాణప్రద, శాంతి ప్రద శాశ్వత స్వరూప వందనం జరిగింది. ద్వితీయ మంత్రంలో గోస్వామి ప్రభువును యాచిస్తాడు.

శ్లో॥ నాన్యాస్పృహా రఘుపతే హృదయేఽస్మదీయే-
సత్యం వదామి చ భవానఖిలాంతరాత్మా,
భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ నిర్భరాం మే
కామాది దోషరహితం కురు మానసంచ.

"ప్రభూ! నువ్వు అఖిల బ్రహ్మాండాలకూ అంతరాత్మవు. సర్వుల హృదయ భావాలనూ నువ్వెరుగుదువు. హే రఘుపుంగవా! నాకు నీ దృఢభక్తిని ప్రదానం చెయ్యి, నా అంతరంగం నుండి కామాది వికారాలను దూరం చెయ్యి.

తృతీయ శ్లోకంలో హనుమద్వందనం జరిగింది. గోస్వామి హనుమంతుని సద్గుణాలను స్మరించ నారంభిస్తాడు. మారుతి అనంతగుణాగారుడని ఆయనకు తెలుస్తుంది. కనుక "సకలగుణ నిధానం" అని వందనం సంపూర్ణం చేసి సుందరకాండ కథను ఆరంభిస్తాడు.

"జామవన్తకే వచన సుహాఏ సుని హనుమంత హృదయ అతి భాఏ తబ లగి మోహి పరిఖేహు తుమభాయీ. సహి దుఃఖ కందమూల ఫల ఖాఈ.

జాంబవంతుని సుందర కథనం హనుమంతునికి విశేషంగా నచ్చుతుంది. అతడు తోటి వానరులతో అంటాడు. "సోదరులారా! నేను సీతామాతను అన్వేషించ వెడుతున్నాను. నేను మరలి వచ్చే వరకూ మీరు కందమూలాలను భక్షిస్తూ నాకై ప్రతీక్షిస్తూ ఉండండి. నేను అవశ్యం మరలి వస్తానని మీకు విశ్వాస పూర్వకంగా చెబుతున్నాను మరలి వచ్చే కాలపరిమితిని గురించి మాత్రం నేనిప్పుడు చెప్పలేక పోతున్నాను. కానీ ఒక విషయం మాత్రం నిశ్చయం – ప్రభువులు నాకు వప్పగించిన పనిని మాత్రం నేను పూర్తి చేసుకునియే వస్తాను.

## 2

తన అనుచర సహచర వర్గంతో తాను తప్పక మరలి వస్తానని హనుమంతుడు యెందుకు చెప్పాడన్న ప్రశ్న ఉదయిస్తుంది. మరలి వచ్చే అవధి నిశ్చయం కాకుంటే సర్వులనూ శ్రీరామ సన్నిధికి పంపి ఉండేవాడు. సాగరాన్నే లంఘించ లేని వీరు లంకలో నాకేమైనా ఆపద వస్తే యెట్టి సహకారాన్నీ అందించ లేరని కూడ అతనికి తెలుసు. అయినా తన సహచరులందరినీ అతడు తన రాకకై నిరీక్షించుడనియే చెబుతాడు.

ఈ యోచనలో హనుమంతునికి ఓ దృఢమైన అభిప్రాయం ఉంది. పరోపకారంలో లేదా భగవత్కార్యంలో సర్వులూ యీ దృష్టినే కలిగి ఉండాలి.

సర్వులనూ పంపివేసి ఆ పై స్వయంగా తాను కార్య సిద్ధి సందేశంతో హనుమంతుడు పురోగమించి ఉంటే శ్రేయస్సు యేక మాత్రుడైన హనుమంతునకు మాత్రమే దక్కుతుంది. కాని భగవత్కార్య సంపాదనా యశస్సును ఆ మహాత్ముడు సర్వులకూ అందించా లనుకున్నాడు. అందులకే అతడు వారితో – "మీరు సాగర తీరాన్ని విడనాడి నేను మరలి వచ్చేవరకూ యెక్కడకూ పోవద్దని కూడ చెప్పాడు. రామకార్యాన్ని సాధించుకుని నేను మరలి వచ్చిన తరువాతనే మన మందరం కలిసి ప్రభుసన్నిధికి వెడదాము" అన్నాడు. తద్వారా కార్యసాధన వల్ల లభించిన ప్రశంశలు సర్వ విధాలా తన సమాజానికంతకూ లభిస్తాయి కదా!.

కీర్తి ప్రాప్తిలో సర్వులూ భాగస్వాములై ఉండాలన్నది హనుమంతుని దృష్టి, సత్కార్యంలో సర్వులనూ పాల్గొన జెయ్యాలి..

సాగర తీరంలో ఓ పర్వతం ఉంది. ఒక్క గెంతు గెంతి మారుతి దానిపైకి యెక్కాడు. రామ కార్య సంబంధితమైన సంపూర్ణ యాత్రలో అతడు మూడు పర్వతాలను అధిరోహించాడు. ప్రథమ పర్వతం యెక్కి దాహంగా ఉన్న వానరులకు అతడు సరోవరాన్ని గురించి చెప్పాడు. ద్వితీయ పర్వతం యెక్కి సాగరోల్లంఘున చేశాడు. తృతీయ పర్వతం లంకలో వుంది.

పర్వత త్రయాన్ని అధిరోహించడ మంటే సాధకుడు పరమాత్మ సంధానంలో మనసా, వాచా, కర్మణా చాంచల్య, కంపనాలు రానట్టి దృఢమైన భూమికపై స్థిరుడై ఉంటాడు.

గోస్వామి భావానానుసారం – పర్వతం ధైర్య అచలత్వాలకు ప్రతీక. భగవత్కార్యానికి ధైర్య, స్థైర్య అచలత్వాలు లేకుంటే అది నెరవేరదు.

లంకా ప్రయాణ వేళలో మారుతి సహచరులతో అంటాడు. 'సోదరులారా! నేను బయలు దేరుతున్నాను. నన్ను ఆశీర్వదించండి'

భగవత్ కార్యసిద్ధికి సాధకుడు నిరహంకారి కావడము అత్యంతా వశ్యకమైనది. సత్కార్యం చేసినా మౌనంగా వుండగల్గడం అత్యంతా వశ్యకమైనది.

సీతాన్వేషణార్థం బయలు దేరిన వానర భల్లూక దళాలతో భగవత్కార్యాన్ని నెరవేర్చగల శక్తిశాలి హనుమంతుడు మాత్రమే అయినా అతడు నిరహంకారిగా మౌనిగా వుండిపోయాడు. పవనాత్మజుడు సర్వులకూ వినయంగా ప్రణమిల్లాడు. భక్తి వర్ధిల్లడంతో సర్వులకు ప్రణమిల్లాలన్న భావం జాగృత మవుతుంది. అహంకార భారమే శిరస్సుపై తాండవ మాడుతుంటే శిరస్సును అవనతం చేయడంలో ఆటంకాన్ని కలుగ జేస్తుంది. జ్ఞాన, అహంకార భారాలనూ పుస్తక జ్ఞాన భావాలనూ మోసే వాడు నమస్కరించ జాలడు. యదార్థ జ్ఞానం, కలిగిన మీదటనే అహంకారం నశిస్తుంది.

హనుమంతునిలో "నమత్వం" అనే యీ మహత్తర గుణాన్ని యిక్కడ తిలకిస్తాము."

## 3

## శ్రేయాంసి బహు విఘ్నాని.

పదే పదే రఘురాముని శ్రీచరణారవిందాలను స్మరించి మారుతి పైకి యెగిరాడు.? అతడు ఆకాశ మార్గంలో యెగురుతూన్నాడు.

సాగర దేవుని హృదయం హర్షోల్లసితమయింది. నేడు ఓ రామ భక్తుడు వస్తూన్నాడు కదా! ఇది నాకు మహాదృష్టమే. సాగర

గర్భంలో మైనాక నామక పర్వత రాజు ఉంటూన్నాడు. అతనికి రెక్కలున్నాయి.

పురాణాలను అనుసరించి ఆదికాలంలో పర్వతా లన్నింటికీ రెక్కలుండేవి. ఆ పర్వతాలు యెగిరి అహంకార వశాన యోచించకుండ యెక్కడ పడితే అక్కడ వాలుతూండేవి. దీని వల్ల గ్రామాలకు గ్రామాలు అణగి పోయేవి. కనుక లోకకళ్యాణార్థం మహేంద్రుడు వజ్రాయుధంతో వాటి రెక్కలను నరికేశాడు. కానీ మైనాకునకు మాత్రం సాగర గర్భంలో ఆశ్రయం లభించడం వల్ల అతడు సురక్షితంగా ఉండిపోయాడు.

నిజాశ్రితుడైన మైనాకునితో సాగరుడు "మైనాకా? నువ్వు పైకి లేచి భగవద్భక్తుడైన హనుమంతునకు విశ్రాంతిని ప్రసాదించు" అన్నాడు

మైనాకుని శిఖరాలు స్వర్ణమయాలు. సాగరతలం నుండి అతడు బయటకు లేచాడు. చేతులు జోడించి అతడు మారుతిని ప్రార్థిస్తూ "హనుమా! నా ఆతిథ్యాన్ని స్వీకరించు, కొంతసేపైనా నాపై విశ్రమించు, మార్గం సుదీర్ఘంగా ఉంది కదా!" అంటాడు.

ఈ ప్రసంగంలో తులసీదాస భక్తుని భావాన్ని గ్రహించండి, జీవితంలో భగవత్ ప్రాప్తికై యాత్ర కొన సాగేవేళలో స్వర్ణశిఖర సదృశమైన అనేక విశ్రామస్థలాలు వస్తాయి. వైభవ లోభాలు ఆకర్షిస్తాయి. సుఖ సాధనల బాహుళ్యం యెదురుగా వచ్చి ఆహ్వానిస్తుంది. సంపత్తుల ఆధిక్యత విపత్తి అనీ, సుఖాధిక్యత దుఃఖమనీ గోస్వామి అంటాడు.

హనుమంతుడు అత్యంత సావధానంగా వున్నాడు. అతడు

యోచించి "స్వర్ణం మానవునికి విశ్రాంతి నివ్వదు కానీ దానిని తిరస్కరించనూ రాదు". అనుకుంటూ మైనాక శిఖరాలను స్పృశించి మాత్రం అతనికి కృతజ్ఞతలు తెలియ జేస్తూ "మైనాకా! రామకాజకీన్హే బిను మోహి కహా విశ్రామ్"! అంటాడు.

యాత్రసాగుతున్నది. దేవతలు హనుమంతుని బుద్ధిబలాన్ని పరీక్షించ గోరారు. నాగ మాత అయిన సురసతో వారు "అమ్మా! నీలో విశేష గమనశక్తి వుంది. మారుతి మార్గానికి విఘ్నాన్ని కలిగించి నువ్వు అతని బుద్ధిబలాన్ని పరీక్షించు". అంటారు.ఆకాశ మార్గం నుండి సురస హనుమంతుని యాత్రా మార్గానికి అవరోధంగా వచ్చి "నేడు దేవతలు నాకు ఆహారాన్ని సమర్పించారు. నేను నిన్ను భక్షిస్తాను" అంటుంది.

హనుమంతుడు చేతులు జోడించి "మాతా!నన్ను భక్షించడం వల్ల నీ ఆకలి తీరుతుంది - అంటే అలాగే కానీ. నా ప్రార్థన ఒకటి ఆలకించు. నేను రామకార్యార్థినై యాత్ర చేస్తూన్నాను. శ్రీరామ సందేశాన్ని జానకీ దేవికీ, ఆ దేవి సందేశాన్ని రామచంద్రులకూ వినిపించి అప్పుడు నేను నీ దగ్గరకు వస్తాను. ఆపై నీ ఆకలిని తీర్చుకొందువు కానీ ప్రస్తుతం నా పురోగమనానికి విఘ్నం కలిగించకు," అన్నాడు

సురస- "నేను నాగమాతను, ఆకలి వేసిన క్షణంలో నేను నా గ్రుడ్లనైనా భక్షించి వేస్తాను. అట్టి దశలో నిన్ను విడిచి పెడతానా? పైగా నువ్వు మరలి వస్తావనడానికి నమ్మక మేమిటి? ఇప్పుడే నేను నిన్ను మింగివేస్తాను".

హనుమంతుడు- "మరలివస్తానని నేను వాగ్దానం చేస్తూన్నాను.

నువ్వు స్త్రీవి. నేను ఓ నారీమణిని ఉద్ధరించే కార్యంలో నిమగ్నుడనై వెడుతున్నాను. సీతాదేవి రావణుని బందీలో ఉంది. పరాధీనురాలైన ఓ నారీ మణి సందేశాన్ని నేను శ్రీరామచంద్రులకు అంద జెయ్యాలి. ఇందులకు నాకు నువ్వు సహకరించ వలసినదే".

సురస అంగీకరించక పోవడంతో– సురసను తనను మ్రింగడానికి రమ్మంటాడు.

సురస యోజన విశాలంగా తన నోటిని తెరుస్తుంది. మనసా రామ చంద్రుని స్మరించి మారుతి తన శరీరాన్ని రెండు యోజనాలు పెంచుతాడు. సురస నాలుగు యోజనాలు తన వదనాన్ని విస్తృతం చేస్తుంది, హనుమంతుడు యెనిమిది యోజనాల శరీరాన్ని ధరిస్తాడు. చివరకు!

"సత జోజన తేహి ఆననకీన్హా అతిలఘురూపనా పవన సుత లీన్హా."

సురస శతయోజనాల వైశ్యాలంలో తన నోటిని విస్తరిల జేయగా శ్రీమారుతి అతి సూక్ష్మ రూపాన్ని ధరించి యుక్తిగా కార్యాన్ని సాధించ దలచి సురస నోట ప్రవేశించి ఆమె నోటిని మూసుకునే లోపల బయటకు వచ్చేస్తాడు. "అమ్మా!నువ్వు నన్ను భక్షించాలి కదా! నేను నీనోట ప్రవేశించి బయటకు వచ్చేశాను. నువ్వు నన్ను భక్షించినట్లే అయినది. ఇక నువ్వు నాకు మార్గాన్ని ప్రసాదించు". అనగా హనుమంతుని బుద్ధి బలానికి అత్యంత ప్రసన్నురాలైన సురస అతణ్ణి ఆశీర్వదిస్తూ– "హనుమా! అవశ్యం నీ రామ కార్యం సిద్ధిస్తుంది". సురస వెళ్ళగానే మారుతి పురోగమించాడు.

సురసను శిక్షించగల శక్తి సంపన్నుడైనా హనుమంతుడు ఆమెకు నమస్కరించాడన్న ప్రశ్న వస్తుంది.

దైవకార్యాన్ని సాధించడానికి పురోగమించనున్న వాని సమక్షంలో దర్పపూర్ణమైన వ్యక్తిత్వం యెదైనా యెదురయితే సాధకుడు దానిని యెదుర్కోవడానికి ప్రయత్నించ రాదు. దానికి విపరీతంగా తన గరిమను వర్ధిల జెయ్యాలి, తద్వారా ప్రతిద్వంద్వి స్వయంగా లొంగిపోతాడు. తల వంచి వేస్తాడు. రెండవ విషయం–విపరీతంగా, వర్ధిల్లితే అనంతర కాలంలో అది తగ్గడం చాల కష్ట మవుతుంది. భక్తి మార్గంలో అధికార దర్పాన్ని జీర్ణం చేసుకుంటూ వినయంగా వినమ్రంగా కార్యాన్ని సాధించ ప్రయత్నించే వాడు సఫలత్వాన్ని పొందుతాడు. భగవత్కార్యయాత్రలో స్పర్ధకలిగి ఉండడమే ప్రథమ విఘ్నమవుతుంది భక్తితో ప్రతి ద్వందిత్వ వృత్తి లేని వానికి శత్రువులు కూడ తలలు వంచేస్తారు. అంతేకాదు. శుభ కామనలను వ్యక్తం చేస్తారు. అతని మార్గంలో వచ్చే అవరోధాలు కూడ ఆశీర్వాదాలుగా మారుతాయి. స్పర్ధను నివారించి మారుతి తనను సంఘర్షం నుంచి రక్షించుకున్నాడు. సురసా రూపమైన అవరోధం నుండి ఆశీర్వాదం పొందాడు.

సంత మహాత్ములు సురసను వాసనలకు ప్రతీకగా భావిస్తారు. వాసనలు సర్వదా అధికాధికంగా ముఖాన్ని నోటిని–వ్యావృతం చేస్తూంటాయి. వాసనలకు యెన్నడూ తృప్తి అనేది కలుగదు. వాసనల నుండి విశ్వంలో యె మూలా కూడ రక్షణ పొందలేదు.

యావత్ సాగరం మీదా సురస వ్యాపించి పోయింది. భావమేమంటే సంసార సాగరం వాసనావృతమై ఉంది. అందుకే దాని బారినుండి యెవరూ తప్పించుకో జాలరు.

కంటకాన్ని కంటకంతోనే తొలగించుకో, సాంసారిక వాసనలన్నిటినీ జయించడానికి భగవద్భావాలను జాగృతం చేసుకోవాలంటాడు తులసీదాసు.

సురసను తిరస్కరించి మారుతి పురోగమిస్తాడు. కానీ అతని గమనం అకస్మాత్తుగా ఆగిపోతుంటే, తన ఛాయను యెవరో బంధిస్తూన్నట్లు అతనికి అనుభవం కలిగింది, నాలుగు దిక్కులూ అతడు చూసినా అతనికెవరూ కనబడ లేదు. క్రిందకు చూడగా సాగర గర్భంలో కూర్చుని ఓ రాక్షసి తన ఛాయను స్తంభింప జేస్తూన్నది. ఆ రాకాసి పేరు సింహిక.

భక్తి మార్గంలో ప్రథమ విఘ్నం పై నుంచి వచ్చింది. రెండవ విఘ్నం సాగర గర్భం నుండి వచ్చింది, ఇది దాని ప్రథమ విచిత్రత, రెండవ విచిత్ర మేమంటే–అది జలజంతువులను విడనాడి ఆకాశ జీవులను ఆకర్షించి భక్షించి వేస్తుంది.

పరమాత్మ ప్రాప్తి మార్గంలో యీర్ష్య కలిగి ఉండడం అత్యంత బాధాకర విషయమే, దీని పట్ల సాధకుడు పూర్ణ సావధానుడై చరించాలి.

సాగరంలో సింహిక ఉండడ మంటే మానవహృదయం సాగరసదృశ విశాలమైనదే. అయితే అందులో యెక్కడో అక్కడ యీర్ష్యా బీజం ఉంటుంది. సింహిక జలచరాలను భక్షించదు, యీర్ష్యా స్వభావం అంతే. అది తనతో సమానులను వేధించదు, తనకన్న వున్నతులైన వారిని సర్వదా క్రిందకు పడగొట్టాలని ప్రయత్నం చేస్తుంది.

మానవుడు యెవరిమీదనైనా ప్రత్యక్షంగా దెబ్బ కొట్ట కపోతే అతడు వాని ఛాయను పట్టుకుంటాడు. ఛాయ నల్లగా వుంటుంది. భావ మేమంటే యీర్ష్యా గ్రస్థుడైన వాడు పరుల శీలోజ్జ్వల చరిత్రను దర్శించ జాలక వాని ధూమల పక్షాన్ని పట్టుకుంటాడు.

హనుమంతుని ఛాయా శ్యామత్వంలో కూడ కళంక మన్నది యేదీ లేదు. ఈ శ్యామత్వం–అతని రోమ రోమంలోను వ్యాపించి ఉన్న శ్రీరామచంద్రుని శ్యామ వర్ణస్వరూపమే.

సింహిక మారుతి ఛాయను స్తంభింప జేయడంతో అతడు ముష్టి ప్రహారం చేసి పురోగమించాడు.

భగవద్యాత్రా మార్గంలో వాసన, యీర్ష్యా రూపమైన విఘ్నాలను రెండింటిని అధిగమించి మారుతి లంకా సాగర తీరం చేరాడు. తీరంలో ఉన్న పర్వతాన్ని అధిరోహించి లంకా నగరాన్ని దర్శించ సాగాడు. సువర్ణ నిర్మితమైన కోటను చూశాడు. అతడెన్నడూ రావణుణ్ణి చూడలేదు. అయినా అతడు మనసా రావణుణ్ణి ప్రశంసించాడు. కారణం? అతడు పాషాణ లోహ నిర్మితమైన కోటను గాక సువర్ణ నిర్మితమైన కోటనే యేర్పాటు చేశాడు.

తులసీ దర్శనంలో బంగరుకోట మోహానికి ప్రతీకయే. ప్రపంచంలో మహామహా త్యాగులను కున్న వారు కూడ మోహ ముక్తులు కాలేదు. మోహగ్రంధి విచ్ఛేదనం కానంతవరకు భక్తి సన్నిధికి చేరడం కష్టతరమే.

లంకలో ఆరామాలూ, ఉపవనాలూ వాటికలూ ఉన్నాయి. మునులను సహితం మోహింపజేశే సుందరాంగనలు వసిస్తూన్నారు. మదిరాపాన, మాంస భక్షణలు అక్కడ విశేషంగా కొనసాగుతూన్నాయి,

ఆ భోగనగరంలోని రమణీయ బీభత్స దృశ్యాలను హనుమంతుడు తిలకించాడు.

లంకానగరం యొక్క కోట నలువైపుల నుండి రక్షక భటులచే ఆవరించబడి, సురక్షితంగా వుంది. అయోధ్యలో కాపలావాళ్ళు లేరు. అయోధ్యలో మహత్వం స్వర్ణానికి కాదు, సమర్పణకు వుంది. ఏ సంపదలో సమర్పణ భావం లేకుండ అపహరణ భావం వుంటుందో? అక్కడ కాపలాదారుల అవసరం వుంటుంది. త్యాగ సమర్పణలు వున్న సంపదకు కాపలాదారుల అవసరం వుండదు.

రావణుని భావ సర్వస్వం అపహరణకు సంబంధించినదే. స్వర్ణ లంకకు ప్రభువే అయినా అతడు తులం బంగారమైనా దానం చెయ్యలేదు. ఈ విషయమై రామాయణంలో యెక్కాడా ఉల్లే ఖించబడ లేదు.

నలువైపులా వున్న రక్షకభటులను తిలకించి మారుతి రాత్రివేళ లంకలో ప్రవేశించాలనుకున్నాడు. కారణం? మానవ మాత్రుని యదార్థ స్వరూపం రాత్రి వేళలోనే స్పష్టమవుతుంది. పగటి వేళ మానవుడు కృత్రిమ వ్యవహార, కపట రూపాదులతో తన చరిత్రను కప్పి పుచ్చుకుంటాడు. హనుమంతుడు లంకయొక్క వాస్తవిక రూపాన్ని దర్శించ దలచాడు. అందులకే అతడు తత్కార్యార్థం రాత్రి సమయాన్ని యెన్నుకున్నాడు.

రెండవ విచిత్రం– హనుమంతుడు అత్యంత సూక్ష్మ రూపాన్ని ధరించడంలోని ఆంతర్యం, మానవుడు ఓ సారి వున్నత స్థానాన్ని పొందిన తరువాత పొంగడం అతని స్వభావానికి వ్యతిరేకమైనది. భక్తిభావం విశేషంగా గలవారే సంతమహాత్ముల కృపకు పాత్రులు

కాగలిగినవారే లఘుత్వాన్ని స్వీకరించ గలుగుతారు. భగవత్కార్య సాధకులైన వారి జీవితాలలో ప్రభుచరణాలయందు అనన్యభావం వుండడం అత్యంతావశ్యకమనీ గ్రహించాలి.

తెరచిన పుస్తక సదృశంగా వున్న వారికి కాపలా అవసరం లేదు. రహస్యమున్న చోట రక్షణార్థం కాపలాదారులు కావాలి. భేదదృష్టి వున్నవాడు కనుక రావణుని జీవితానికి ఆవరణ, రక్షణలు కావాలి.

మారుతి సూక్ష్మరూపాన్నే ధరించినా రావణుని సంరక్షా వ్యవస్థలో బంధింప బడ్డాడు. లంకిణి హనుమంతునితో అంటుంది.

"జానేహి నహీ మరము సఠ మోరా! మోరాహార జహా లగి చోరా?"

"అరే మూర్ఖుడా ! నువ్వు నన్ను గుర్తించడం లేదా? లంకా చోరుడా! నాకు ఆహారంగా రా." అనడంతో కుపితుడైన హను మంతు-డు

"ముఠికా ఏక మహాకపి హనీ, రుధిర బమత ధరనీ ఠన మనీ".

"లంకిణీ ! నువ్వు నన్ను దొంగ అంటావా ? కానీ రావణుని మించిన దొంగ విశ్వంలోనే మరి వొకడు లేడు. నీ రక్షణలో వున్న అతడు సీతాదేవిని అపహరించాడు. నీలో భేదబుద్ధి వుంది". భేదబుద్ధిని అభేదబుద్ధిగా మార్చాలనియే హనుమంతుడు లంకిణీ మస్తకం మీద కొట్టాడు. ఆ దెబ్బకు అది రక్తం కక్కుకుంటూ నే కూలింది.

భగవత్కార్యంలో తృతీయ విఘ్నం భేదబుద్ధియే.

లంకిణి అంటుంది. "మారుతీ ! నువ్వు రామదూతవు. బ్రహ్మ

దేవుడు రావణునకు వరా లిచ్చి మరలే సమయంలో మార్గంలో నేను ఆయనను కలిశాను. "రావణునికి మృత్యువు యెప్పుడు వస్తుంది? అని నే నాయనను అడుగగా "– ఓ వానరుని ముష్టిప్రహారంచే నేను వ్యాకుల నైన కొద్దికాలానికే రాక్షస కుల మంతా నశిస్తుందని ఆయన చెప్పాడు.

"ఆంజనేయా ! రాక్షసుల వినాశ కాలం సమీపించినదని నాకు అవగత మవుతున్నది. ఆ కార్యాన్ని నాతోటే నువ్వు ఆరంభించావు. నీ దర్శనం కలగడం వల్ల నేను భాగ్యశాలి నయ్యాను".

క్షణకాలం క్రితం మారుతిని చోరుడన్న లంకిణి యిప్పుడతణ్ణి సంతమహాత్మునిగా ప్రకటించింది. ఆదిలో ఉన్నట్లే హనుమంతుడు యిప్పుడూ ఉన్నాడు. చోర సంతభావాలు దృష్టి భేదం వల్ల యేర్పడుతాయి. రామభక్తుని ప్రహార మాత్రంచే బుద్ధి బాగుపడు తుంది.

సంత లేదా సత్సంగ మాత్రంచే జీవుని బేధబుద్ధి నాశన మవుతుంది.

ఇప్పుడు హనుమంతుని విఘ్నాలన్నీ దూరమైపోతాయి. సూక్ష్మ రూపంలో అతడు లంకలో ప్రవేశించాడు. గోస్వామి వర్ణిస్తాడు. మందిర్ మందిర్ ప్రతికర్ సోధా, దేఖే జహం తహం అనగినత జోధా.

హనుమంతునికి ప్రత్యేక భవనము మందిరంలా గోచరమవుతుంది. ప్రతి భవనంలోకీ అతడు వెళ్ళి అసంఖ్యాక యోధులను చూస్తాడు.

లంకలోని భవనాలు మందిరాలా? లేక హనుమంతునిలో భేదబుద్ధి ఉన్నదా? మందిర భావనతో హనుమంతుడు లోపలకు

ప్రవేశిస్తున్నాడు, కానీ లోపల భోగవిలాస మగ్నులయిన రాక్షసులను చూస్తున్నాడు. బాహ్యరూపం మందిరాలు–అంతరంలో భోగవిలాసాల తాండవాలు. రావణీయ విచారధార యిదియే.

రావణాంతఃపురంలో మారుతి ప్రవేశించాడు. అక్కడ భోగాధిక్యతను చూశాడు. ఇక్కడ భక్తి అసంభవ మనుకున్నాడు. బయటకు వచ్చాడు.

లంకానగర మంతా పరిభ్రమించాడు. ఓ భవనం వైపు చూశాడు.

భవన్ ఏక్ పుని దీఖ్ సుహావా హరి మందిర్ తహం భిన్న బసావా,

పార్శ్వ భాగంలో పృథగ్రూపేణా నిర్మించ బడ్డ మందిరాన్ని తిలకించాడు. ఆ మందిర ద్వారం మీద రామాయుధాలైన ధనుర్బాణాలు చిత్రించబడి ఉన్నాయి. ప్రాంగణంలో తులసి మొక్క ఉంది. విధిగా యిది భగవద్భక్తుని ఆవాసమై ఉంటుందని హనుమంతునికి అభిప్రాయం కలిగింది. లంకానగరంలో రామ భక్తుని అవసరం యేమున్న దన్న శంక వెంటనే కలిగింది. తులసీదాసు అంటాడు.

"లంకా నిసిచర నికర నివాసా, ఇహాకహా సజ్జనకర బాసా"

"మన మహుఃతరక్ కరై కలాగా, తేహి సమయవిభీషణ్ జాగా"

హనుమంతుడు మనసా తర్కవితర్కాలు కొనసాగిస్తూండగానే విభీషణుడు మేలుకొన్నాడు. లేస్తూనే ఆతడు 'రామ నామస్మరణ' ఆరంభించసాగాడు. ఓ సజ్జనుణ్ణి కలిసే మహావకాశం లభించినదని హనుమంతుడు మహానందం చెందాడు.

హనుమదాగమన–విభీషణ జాగరణలు ఓ సుందరమైన యోగమనే

చెప్పాలి. హనుమంతుని వంటి సంత మహాత్ముడు ప్రవేశించనంత వరకు జీవితంలో యదార్థమైన జాగరణ జరగదని గ్రహించాలి. విభీషణుడు నామ జపం బాగానే చేస్తాడు, కానీ రామ కార్యాన్ని యీ షణ్మాత్రం చెయ్యడు. అతని భక్తి సుషుప్తమై ఉంది. అందుకే రావణుడు సీతాపహరణం చేసి వచ్చిన తరువాత అతడు నిండు కొలువులో రావణుని నిందించ లేదు.

ఇది సుషుప్త భక్తి. సంతమహాత్ముని ఉపదేశం వల్ల జీవితంలో యదార్థమైన జాగృతి కలుగుతుంది.

ఇతడు రామభక్తుడే నన్న భావం విభీషణుని విషయంలో హనమంతునికి కలిగింది. ఇతనితో పరిచయం చేసుకోవాలి. సజ్జన సాంగత్యం యెన్నడూ వ్యర్థం కాదు.

హనుమంతుడు విప్రవేషంలో విభీషణుని దగ్గరకు వెళ్ళాడు. "తమరెవరు?" అని విభీషణుడు ప్రశ్నిస్తూ "మీ దర్శన మాత్రంచే నాకు శాంతి కలుగుతున్నది. తమరు భగవత్సేవకులా? మీ పట్ల నా హృదయంలో తీవ్రమైన ప్రేమ ఉప్పొంగుతున్నది. దీనులపై దయచూపునట్టి శ్రీరామ ప్రభువులు నన్ను కృతకృత్యుని చేయ మిమ్మల్ని పంపాడా?" అన్నాడు.

ఆ ప్రశ్నలకు హనుమంతుడు మహానందం చెందాడు. అవశ్యం యితడు సత్పురుషుడే అనుకున్నాడు. ఇక అతని దగ్గర దాపరిక మవసరం లేదని భావించి అతడు స్వస్వరూపంలో సాక్షాత్కరించి ప్రత్యుత్త రంగా ప్రథమంలో రామకథను చెప్పి ప్రభుచరిత్రను గానం చేసిన తరువాత –"నేను రామదూతను" అంటాడు.

సంత మహాత్ములు తమ పరిచయాన్ని ఆరంభంలో ప్రభునామంతో చేస్తారు. అవసరమైతేనే తమకు సంబంధించిన పరిచయాన్ని చేసుకుంటారు. సాంసారికులు ఆదిలో స్వపరిచయం చేసుకుంటారే కానీ దైవనామగుణ కీర్తనలు చెయ్యరు.

సంత జనులు స్వప్రభావాన్ని గుప్తంగా ఉంచుకుంటారు. సాంసారికులు తమ ప్రభావాన్ని మాత్రం చాటుకుంటారు,

హనుమంతుడు స్వనామాన్ని వ్యక్తం చేయడంతో విభీషణుడు అతని శ్రీచరణాలపై వాలి పోయాడు.

మారుతి అతణ్ణి హృదయానికి హత్తుకుంటాడు. భక్తులిద్దరి సమాగమం జరగుతుంది. విభీషణుడు–; "మారుతీ! నీ రాక కారణంగా ప్రభువులు నాపై దయ చూపా రనిపిస్తున్నది, అచిర కాలంలోనే నాకు రామ ప్రభు దర్శన మవుతుందన్న విశ్వాసం కలుగుతున్నది. హనుమంతుడు! "విభీషణా! యీ రాక్షస నగరంలో నువ్వు యెలా భక్తి సాధన చెయ్య గలుగుతున్నావు ! విభీషణుడు! మారుతీ! "ముప్పైరెండు దంతాల మధ్య నున్న నాలుక వలె నేనిక్కడే ఉంటున్నాను".

జిహ్వ కోమలమైనది. శూలాలవలె గ్రుచ్చుకునే ముప్పైరెండు దంతాలమధ్య దానిని రక్షించు కోవలసి వస్తున్నది. రాక్షస నిలయమైన లంకలో విభీషణుని స్థితి అలా ఉంది. హనుమంతుడు "విభీషణా! నీకిట్టి యోగం లభించినదంటే శ్రీరామ ప్రభు కృప నీపై సంపూర్ణంగా ఉన్నట్లే".

"నువ్వనే దేమిటి?"

"నేను యదార్ధమే చెబుతున్నాను. శరీరంలో ముందుగా రాలిపోయేవి దంతాలా? నాలుకా?"

"దంతాలే హనుమా! "

"అయితే విను. మాసం కాలవ్యవధిలో రామబాణాల వల్ల దంతాల వలె ఉన్న రాక్షసులు అంతమై పోతారు. జిహ్వ వలె ఉన్న నువ్వు మాత్రం శాశ్వతంగా ఉండడ మన్నది సంతత్వానికి ప్రతీక.

దంతాలు దుర్జనులు, జిహ్వ సంత జనులు. దుర్జనుల మధ్య సజ్జనులు మెలగ వలసి వస్తుంది. దుర్జను లెంతగా వేధించినా సజ్జనులు నీతిని విడవజాలరు. దంతాల మధ్య యేమైనా చిక్కుకుంటే నాలుక దానిని తీసి వేస్తుంది. అలాగే సజ్జనులు కూడ దుర్జనుల మధ్య ఉంటూ వారి కష్టాలను సంతాపాలను దూరం చేస్తారు.

హనుమంతుడు విభీషణునకు ఓ నూతన మైన దృష్టిని ప్రసాదించాడు. విభీషణుడు భావించిన దుఃఖ స్థితి యిప్పుడు సుఖ స్థితిగా మారింది.

సంత–స్థితి మారదు. వారు స్థితి విశేషాన్ని దర్శించే దృష్టిని మాత్రమే మారుస్తూంటారు. విభీషణుడు "హనుమా ! నీ వంటి భక్తశ్రేష్ఠుని దర్శనం కలిగిన దంటే నా పై రామచంద్రులకు విశేష కృప కలిగినదనియే భావిస్తూన్నాను.

కించిత్ రుష్టస్వరంలో మారుతి – "విభీషణా ! నీ వంటి వారిపై ప్రభువులు యెన్నడూ దయ చూపరు. నేను సదా రామసేవలో ఉంటాను. కనుక యెవరిపై రామకృప వుంటుందో నాకు తెలుస్తుంది".

విభీషణుడు – "హనుమా ! నేను యేకాంతంలో రామ నామ జపం చేస్తున్నాను. నిశాచర నగరంలో భగవన్మందిరాన్ని యేర్పాటు చేశాను. అయినా భగవానుడు నాపై దయచూపడా?"

"చూపడు. నువ్వు కేవలం రామానామ జపం చేస్తూ న్నావే కానీ రామకార్యాన్ని సాధించడం లేదు. నువ్వు జపించే శ్రీరామచంద్రుని యిల్లాలినే నీ అన్న అపహరించి తీసుకు వచ్చాడు. ఆతని సభలో నువ్వు ఓ మహామంత్రివి. అన్నా ! నువ్వు దుష్కార్యం చేశావు. అని యెన్నడైనా అన్నావా? సీతామాతను సందర్శించ ఒక్కసారైనా ఆమె సన్నిధానానికి వెళ్లావా? ఎవని నామాన్ని నువ్వు స్మరిస్తున్నావో? ఆతని ఆదర్శ సంస్కృతులను నువ్వు సేవించ గలిగిన నాడే ఆ ప్రభువుల కృప నీపై కలుగుతుంది".

భగవత్కృపను పొందడానికి భగవాన్నమంతో బాటు దైవకార్య సమన్వయం కూడ జరుగుతూండాలి. కేవలం జపం మాత్రం చేస్తూ రామకార్యాన్ని ఆచరించని వాడు రామకృపకు పాత్రుడు కాజాలడు.

అంగీకరించాడు విభీషణుడు "హనుమా ! ఇక నేను రామ కార్యాన్ని సాధిస్తాను. రామకృపకు పాత్రుడ నవుతాను" అన్నాడు.

"విభీషణా ! రామనామ జపంతో రామ కార్యసమన్వయ మైతే ప్రభువు నిన్ను ప్రేమిస్తాడే కానీ కరుణించడు. కృపచూపడం కంటే ప్రేమించడమే విశేషమయినది.

"సోదరా ! విభీషణా ! నేను జానకీ మాతను దర్శించాలను కుంటున్నాను".

"మారుతీ ! ఏ సంబంధంగా నువ్వు నన్ను సోదరా! అని సంబోధించావు".

ఏ సోదరుల కన్న విభీషణా ! మన భ్రాతృత్వం అత్యంత సన్నిహితమైనది. మన దౌర్భాగ్య మేమంటే నేనింత వరకూ పితృదర్శనమే చేశాను.నువ్వు మాతృ దర్శనమే చేశావు. నువ్వు నేడు నాకు సీతామాతను దర్శింపజెయ్యి. త్వరలో నేను నీకు సాగర తీరంలో రామ ప్రభు దర్శనం చేయిస్తాను".

విభీషణుడు హనుమంతుని కౌగలించుకున్నాడు. సీతా దర్శన మార్గాన్ని అతడు హనుమంతునకు చెప్పాడు.

విభీషణుడు యింకా సంపూర్ణ జాగరణను పొందాడు. అతడు న్వయంగా వెంటనుండి హనుమంతుని జానకదేవిని దర్శింపజేయాలి. ఇలా చేస్తే కార్య సిద్ధి అవుతుంది. అని ఉపదేశకుని వలె పలికాడు.

విభీషణుడు సంపూర్ణ జాగరణ పొందడానికి యింకా సమయం పడుతుందని హనుమంతుడు గ్రహించాడు.

సూక్ష్మరూపాన్ని ధరించి హనుమంతుడు అశోక వనంలో ప్రవేశించాడు. అక్కడ అనేక ప్రకారాలైన తరు లతాగుల్మాదులు వికసించిన పుష్పాలతో మనోహరంగా ఉన్నాయి. ఉద్యానవన శోభను తిలకిస్తూంటే అక్కడ సదా వసంత ఋతువే ఉంటుందా? అన్నట్లుంది.

ఓ అశోక వృక్షం క్రింద ఓ నారీమణి దైన్య హైన్య స్థితిలో ఉండడం అతడు చూశాడు.

ఆమె శరీరం కృశించి ఉంది. శిరోజాలు యెకవేణీ రూపాన్ని దాల్చాయి. మనస్సు శ్రీరామ చరణాలపై లగ్నమై పోయింది. శ్వాసోచ్ఛ్వాసాలపై రామనామ జపం అఖండంగా కొనసాగుతున్నది.

"ఈమెయే సీతామాత" అన్న విశ్వాసం హనుమంతునకు కలిగింది.

నాలుగు లక్షణాల ద్వారా భక్తిని గుర్తించ వచ్చును.

1) సీతాదేవి శరీరం శుష్కించి ఉంది.

2) నిర్విరామంగా ఆమె రామనామ జపం చేస్తున్నది.

3) ఆమె దృష్టి స్వీయచరణాలపై ఉంది.

4) ఆమె మనస్సు రామచరణాలపై ఉంది.

భక్తుని శరీరం క్రమ క్రమంగా కృశిస్తూంటుంది. భజన వర్ధిల్లుతూంటుంది. బరువు తగ్గుతూంటుంది. బరువు పెరిగితే భజన తరుగుతూంటుంది. శరీరభారం తగ్గడం వల్ల తేజస్సు వర్ధిల్లుతూండడం భక్తికి ప్రథమ లక్షణము.

ద్వితీయ లక్షణం జపం కొనసాగడం. జిహ్వతో రామనామోచ్చారణ జరుగుతూంటుంది. ఒక్కొక్కప్పుడు యెవరిదో నామాన్ని తీసుకుంటుంది. కానీ జిహ్వతో రామనామోచ్చారణ జరుగుతుంది. ఇది భక్తి స్థితి.

భక్తుడు నిజదృష్టిని స్వీయచరణాలపై ఉంచి మనస్సును శ్రీరామ చరణాలపై ఉంచుతాడు. భక్తిమార్గ సాధకునికి దృష్టి సదా స్వీయాచరణపై ఉంటూ మనస్సు ఆరాధ్యుని చరణాలపై సర్వదా ధ్యానమందు లీనమై ఉంటుంది.

"నేను విప్రవేషంలో సాక్షాత్కరించుకోనా? స్వస్వ రూపంలోనే వెళ్ళనా? ముద్రికను సీతామాత సమ్ముఖంలో పడవేయుదునా? అమ్మ పాదసన్నిధిలో ముద్రికను అర్పింతునా? ఏమిచేయుదును?

తులసీదాసు అంటాడు – భక్తి దేవిని సమీపించిన సాధకుడు తర్కవితర్కాలు చేయరాదు. స్వయంగా సమర్పితుడు కావాలి. భక్తిని చేరి కూడ సాధకుడు తర్కవితర్కాలు చేస్తూ కూర్చుంటే రావణుడు వచ్చి విక్షేపాన్ని కలిగిస్తాడు.

హనుమంతుడు యోచిస్తూండగానే రావణుడు వికటాట్టహాసాలతో ఆడంబరంగా మండోదరీ సమేతంగా అక్కడకు వస్తూనే.

"సుందరాంగీ ! ఒక్కసారి నువ్వు కన్నెత్తి నన్ను చూస్తే నేను మండోదర్యాది రాణుల నందరినీ నీ దాసీలనుగా చేస్తాను" అంటాడు.

రామస్మరణ చేసుకుని ఓ తృణాన్ని అడ్డుగా పడవేసి– "రావణా! సూర్యోదయానంతరమే కమలం వికసిస్తుంది. నువ్వు మిణుగురు పురుగు లాంటి వాడవు".

తనను పురుగని సీత భాషించడంతో రావణుడు కరవాలం తీసి ఆమెను అంతం చెయ్యాలని అడుగు వేసి "సీతా! నవ్వు నన్ను అవమానించావు. ఇప్పుడే క్రూరకృపాణంతో నీ మస్తకాన్ని ఖండిస్తాను" అన్నాడు.

రావణుడు సీతను వధించ అడుగు వెయ్యబోగా హనుమంతుడు కూర్చుని వున్న వృక్షశాఖ కంపించ సాగింది. "ఈ దుష్టుడు యింకా అడుగులు ముందుకు వేస్తే నేను వీడి కంఠాన్ని పట్టుకుంటాను. నా

తల్లిని వీడేమి చేసినా నేను సహించను".

సీతాదేవి కృపాణాన్ని సంబోధించి "సోదరీ ! నువ్వూ స్త్రీజాతికి చెందిన దానవే. నేనూ స్త్రీనే, నా మీదకు దుఃఖం వచ్చింది. దయ దలచి నా కుత్తుకపై పడి నన్ను అంతం చెయ్యి. తద్వారా యీ దుఃఖాల నుండి నేను విముక్తురాల నవుతాను" అంటుంది.

ఖడ్గహస్తుడై రావణుడు సీతవైపుకు నడవడం చూసి మండోదరి అతని హస్తాన్ని పట్టుకుని "నాథా! అబలను అంతం చెయ్యరాదు. కత్తిని వొరలో పెట్టండి" అంది.

రావణుడు కత్తిని వొరలో పెట్టేశాడు. అతడు సీతతో - "మాసం లోగా నువ్వు నా మాట వినకపోతే నేను నిన్ను అంతం చెయ్యడం తప్పదు". అన్నాడు. ఆపై అతడు రాక్షసస్త్రీలను సంబోధించి "మీరు సీతను నెలలోగా నాకు వశమయ్యేటట్లు వేధించి ఒప్పించండి". అని అతడు మండోదరి సహితంగా వెళ్ళిపోయాడు.

రాక్షసాంగనలు సీతను వేధించసాగారు. అందులో త్రిజట అనే స్త్రీ సీతాదేవికి సహకరిస్తూ ధైర్యం చెబుతున్నది. సీతాదేవిని త్రిజట "అమ్మా" అంటూన్నది. త్రిజట రాక్షసాంగనలతో - రావణుడు ఆదేశించినా మీరు మాత్రం సీతను వేధించకండి.

కారణం ? నేడు నేను ఓ స్వప్నం చూశాను. ఓ వానరం లంకలోకి ప్రవేశించింది. అది లంకను దగ్ధం చేసి రాక్షసులను సంహరించింది. పరాజితుడై రావణుడు దక్షిణదిశగా పారిపోయాడు. లంకారాజ్యం విభీషణునకు దక్కింది, ఇదంతా నేను కలలో చూశాను. అనతికాలంలోనే యీ స్వప్నం సత్య మవుతుందని

నా కనిపిస్తున్నది, కనుక సీతాదేవికి కష్టం కలిగించకండి" అంది.

రాక్షసాంగనలు భయభీతలై సీతాదేవికి ప్రణమిల్లి వెళ్ళిపోయారు.

వృక్షశాఖపై కూర్చున్న హనుమంతుడు యోచించ సాగాడు. నేనిక్కడకు వచ్చాను. ఈమెకు స్వప్నమూ వచ్చింది. ఎలాగైనా భగవానుడు యీమె స్వప్నాన్ని సత్యం చేయును గాక!

అతనికి అక్కడే లంకా దహన సంకల్పం కలిగింది. సీతాదేవి త్రిజటతో – "అమ్మా ! నాకు అగ్నిని తెచ్చి పెట్టు. నేను దగ్ధమై పోతాను' అంది.

"సుకుమారీ ! ఇది లంక. ఇక్కడ అగ్ని దొరకదు". అని త్రిజట పలికిన పలుకులను హనుమంతుడు ఆలకించాడు, 'ఇక్కడ అగ్ని దొరకదన్నమాట. రేపు నేను ప్రతియింటినీ అగ్నికి ఆహుతి చేస్తాను' అనుకుంటాడు.

సీతాదేవిని ఓదార్చి త్రిజట వెళ్ళి పోయింది, సీతాదేవికి రామ విరహం సహించరానిదిగా ఉంది. హీనభాంగారులారా! మీరు క్రిందకు వచ్చి నన్ను దహించి వేయండి". అని సీతాదేవి తారాగణాన్ని సంబోధించి ప్రార్థిస్తుంది.

సీతాదేవి వృక్షన వాంకురాలితో పలుకుతుంది. "మీరు నన్ను భస్మం చెయ్యండి".

సీతాదేవి ఆత్మ హత్యాప్రయత్నంలో అధీరురాలు కావడంతో హనుమంతునకు క్షణం యుగంగా గడుస్తుంది, సాక్షాత్తూ భక్తి సమాప్తి, ఆమె మరణ యోచన సర్వదా అమంగళకరమైనదే.

నా తల్లి ఆత్మ దాహవిషయాన్ని యెలా చెప్పగలిగింది ? అతనికి తత్కారణం అవగాహనమయింది. రావణుడు ప్రవేశించడంతో

సీతాదేవి రామస్మరణ విస్మరించింది. రామస్మరణలో పునః సీతాదేవిని సంలగ్నం చెయ్యాలని గ్రహించి మారుతి రామనామాన్ని స్మరిస్తూ రామముద్రికను క్రిందకు పడవేశాడు.

సీతాదేవి ముద్రికను తీసి దానిపై చెక్కబడిన రామనామాన్ని చదివింది, ఆమె యోచించసాగింది. రాముణ్ణి యెవరూ పరాజితం చెయ్యలేరు. అతడు అజేయుడు, మాయ ద్వారాకూడా యిట్టి ముద్రికను తయారు చెయ్యా లేరు. అట్టి దశలో యిక్కడకు యెవరీ ముద్రికను తీసుకువచ్చి ఉంటారు?

ఈ విధంగా సీతాదేవి యోచిస్తూండగా శాఖపై కూర్చున్న మారుతి రామ కథను ప్రారంభించాడు, అత్యంత భక్తి భావంతో మారుతి కథాగానం చేస్తూన్నాడు. రామకథా శ్రవణంతో ఆమె వ్యథ దూరం కాసాగింది, రామకథలో దుఃఖాలను దూరం చేయగల దివ్యశక్తి ఉంది. పైగా హనుమంతుని వంటి గాయకుడే గాన మారంబిస్తే చెప్పేదేముంది? సీతాదేవి దుఃఖమంతా దూరమై పోయింది.

ఆమె ప్రశ్నించకుండా ఉండలేక పోయింది, కథకు మధ్యలోనే ఆమె ఆపి "వత్సా ! ఇంతటి సరసగాథను గానంచేసే నువ్వెవరవు? నా సమ్ముఖానికి రా" అంది.

దీని తాత్పర్యమేమంటే–భక్తి సాధకుణ్ణి ప్రశ్నిస్తుంది, నువ్వు చక్కగా మాట్లాడుతున్నావు. చక్కగా పాడుతున్నావు. స్వయదార్థ రూపంలో నా సమ్ముఖానికి రా. ఇంతవరకూ నువ్వు పరిభ్రమిస్తూ వేషాలు మారుస్తూ వచ్చావు. ఇప్పుడు స్వస్వరూపంలో రా, ఉన్నవాడవు ఉన్నట్టుగా రా, యితరుల దగ్గర నీవేషాలు సాగుతాయి. కానీ నాదగ్గరకు మాత్రం యదార్థ రూపంతోనే నువ్వు రావాలి.

రామనామాన్ని స్మరించుకుంటూ మారుతి జానకీ మాత సమక్షానికి వానరరూపంలోనే వచ్చాడు. అతణ్ణి చూసి సీతాదేవి భయాశ్చర్యాలతో ముఖం తిప్పుకుంది, రాక్షసుడు వానర రూపంతో వచ్చాడేమో నన్న శంక ఆమెకే కలిగింది.

ఎవరినైనా ఆహ్వానించి ముఖం ప్రక్కకు తిప్పుకోవడంచే వారిని అవమానించడమే అవుతుంది. కానీ హనుమంతుడు ఆమె ప్రవర్తనను అపార్థం చేసుకో లేదు. అందుకతడు సుందరమైన అర్థాన్ని తీస్తూ- "అమ్మా ! నన్నుచూసి మీ ముఖాన్ని ప్రక్కకు తిప్పుకుని సరిగానే ప్రవర్తించారు". అన్నాడు

"అదెలా?"

"అమ్మా ! కథావాచకుని ముఖం చూడలేము. అతని కథను మాత్రమే వినడం జరగుతుంది. నేను వానరుడను, పైగా నాముఖం చూడడానికి బాగుండదు కదా ! నా కథను వినడమే యోగ్యమైన విషయము".

"నువ్వెవరవు?"

"తల్లీ ! నేను రామదూతను".

"దీనికి ప్రమాణమేమిటి?"

"నేను నిన్ను అమ్మా ! అని సంబోధిస్తూన్నాను. ఇది చాలదా? ఈ ప్రమాణం చాలదు. అమ్మా అన్న సంబోధన విషయంలో నాకు గతానుభవం ఉంది".

"ఏ ప్రకారంగా?"

"రాక్షసులు కూడా అమ్మా !" అంటారు, కానీ తరువాత

అపహరిస్తారు. అందుకే అమ్మా! "అన్నసంబోధనపై నాకు విశ్వాసం లేదు.

దానితో హనుమంతుడు అత్యంత ఖిన్నుడై పోయాడు. అతని కనులనుండి అశ్రువులు వెలువడ్డాయి. అతడు యోచించ సాగాడు. ఇంత సుదీర్ఘమైన యాత్రచేసి నేను భక్తి దేవి సన్నిధానానికి వచ్చానే యిప్పుడీమె నా నుండి ప్రమాణం కోరుతున్నదే. నా దగ్గర ప్రమాణం రూపంలో ఉన్న రామ ముద్రికను కూడ నే నీమెకు యిచ్చేశాను. అయినా జానకీ దేవి నన్ను రామదూతగా అంగీకరించడం లేదే. ఇక నేను చేయగలిగే దేమిటి? ఈమె కెలా విశ్వాసాన్ని కలిగించగలను? అని విచారించ సాగాడు.

చిట్ట చివరకతడు - "అమ్మా ! 'నేను రామభక్తుణ్ణి, 'అమ్మా అన్న నా సంబోధనపై మీకు విశ్వాసం కలగడం లేదు. ఇప్పుడు నేనొక ప్రమాణం యిస్తున్నాను. కరుణా నిధానునిపై ప్రమాణం చేసి చెబుతున్నాను. నేను రామ భక్తుణి!

కరుణా నిధాన శబ్దాన్ని ఆలకిస్తూనే సీతాదేవి యెదురుగావచ్చింది, కరుణానిధాన సంబోధన రామునిపట్ల సీతామాతయొక్క అంతరంగ సంబోధన, మొత్తం అయోధ్యానగరంలో సీతాదేవి మాత్రమే రామభద్రుణ్ణి అలా సంబోధిస్తుంది.

నాయీ రహస్యమయ సంబోధన నెరిగిన వాడు అవశ్యం రామప్రభువుల అంతరంగ వ్యక్తియే అయి ఉంటాడు.

సీతామాతను సమ్ముఖంలో దర్శించి మారుతి ఆమె చరణార విందాలకు వందనం చేశాడు. రామ దూతను ప్రకటితుడవు

కమ్మని నేను రామకథను ఆపు జేశానే-అని సీతాదేవి బాధపడ సాగింది, బాగాలేదు. ఈ గాథ వల్లనే నా దుఃఖం దూరమయింది. ఈ కథ కొనసాగితే బాగుండునే ! అనుకుంటూనే ఆమె కథ కొనసాగడానికి ఓ ఆలోచన చేసింది. "నువ్వు రామభక్తుడవని నేను విశ్వసిస్తున్నాను, కానీ రాముడు నరుడు. నువ్వు వానరుడవు? ఈ నరవానర సంయోగం యెలా జరిగింది?" అని ప్రశ్నించింది.

నరవానర స్నేహాన్ని వివరించడం కోసం కథ పునః ప్రారంభ మయింది. ఋష్యమూక సానువులలో రామ సుగ్రీవుల కలయిక వరకూ గల గాథను చెప్పి హనుమంతుడు కథను ఆపు జేశాడు.

"ఇంత కథ మాత్రమేనా?"

ఈపై గాథ నా సంబంధమైనది తల్లీ ! నా గాథను స్వయంగా నేను చెప్పుకోను, దీనిని రామప్రభువులే మీకు చెబుతారు.

హనుమంతుడు సీతామాతకు ప్రభు సందేశాన్ని వివరించి- "అమ్మా! ప్రభువులు మీ వియోగంలో దుఃఖిస్తున్నారు. ఆయన వాణిని ఆలకించండి".

సీతా! నీ వియోగంలో వృక్షచ్ఛాయ కూడా దుఃఖాన్ని కలుగు జేస్తున్నది. శీతల పవనాలు అగ్నిసమంగా తపింప జేస్తున్నాయి. వానతుంపరలు మరిగిన నూనె బిందువులలా నాకు అనిపిస్తున్నాయి. నీ విరహంలో నేను అత్యంత దుఃఖితుడనై ఉన్నాను.

రామవిరహ విషయాలను గురించి మారుతి పలుకుతూంటే సీతాదేవి - "హనుమా ! ప్రభువులు నన్నింతగా స్మరిస్తూంటే నన్ను తీసుకు వెళ్ళడానికి యేల రావడం లేదు? వారు తమ ధనుర్బాణాలను మరచిపోయారా? జయంతుణ్ణి ఆయన బ్రహ్మలోక

పర్యంతం యాత్ర చేయించగలిగిన వారే ! అదీ మరచినారా?"

హనుమంతుడు ఉత్తమ దూత, అతడు చక్కగా బదులు పలికాడు. "తల్లీ నీ ధ్యాసలో రామప్రభువులు తాను క్షత్రియుడనని కానీ, తనహస్తాలలో ధనుర్బాణాలున్నాయని కానీ స్మరించడం లేదు.

ఆ పలుకులు విన్న జాన  ి ఆనందాంబుధిలో మునిగిపోయింది. రఘురాముని యావత్సందే  న్ని మారుతి జానకీ దేవికి వినిపించాడు. ప్రభువుల సందేశాన్ని ఆలకించి జానకీదేవి పరమప్రసన్నురాలయింది. రామ లక్ష్మణులను స్మరించడంతో ఆమె కనుల నీరు నిండింది. అది హనుమంతుడు చూడలేక పోయాడు. "అమ్మా ! ఇప్పుడే నేను లంకను సర్వనాశనం చేసి వేస్తాను. రావణుని సాగరంలో ముంచి వేసి నిన్ను విముక్తు రాలిని చేసి శ్రీరామ సన్నిధికి తీసుకు వెడతాను. కానీ యిందుకు ప్రభువులు అనుమతించి యుండ లేదు.

హనుమంతుని పలుకుల నాలకించి – యితడు అధికాడంబరంగా మాట్లాడుతున్నాడేమో ? ననిపించింది సీతాదేవికి "హనుమా ! నువ్విక్కడకు రావడమే చాలగొప్ప విషయం. సర్వులనూ అంతం చేస్తా నంటున్నావు. కానీ యిక్కడున్న వారు సామాన్యులు కారు. ఘోర మహాభయంకర రాక్షసులు. రామచంద్రులు సమావేశ పరచియున్న వానర భల్లూక వీరులు నీకు సములా? లేక నీకన్న అధిక బలశాలురా?" 'అని ప్రశ్నించింది.

"అమ్మకు నేనెవరో, యింకా తెలిసినట్లు లేదే"

అని గ్రహించిన మారుతి –ఈమె నా లఘురూపాన్ని మాత్రమే చూసింది. అనుకుంటూ – అతడు తన పాదాంగుష్ఠాన్ని పృథ్విపై అణగ ద్రొక్కాడు.

"కనక భూధరాకార శరీరా, సమర భయంకర అతి బల వీరా",

స్వర్ణమయ సుమేరుగిరి సమంగా నిజస్వరూపాన్ని ప్రకటింప జేశాడు.

హనుమంతుని తద్విరాడ్రూపాన్ని దర్శించి జానకీ దేవి కనులు మూసుకుని –"హనుమా ! ఆదిలో వున్నట్లుగానే వుండు". అంది,

మారుతి పూర్వ లఘురూపంతో నిలబడ్డాడు. అమ్మా! నేను విశాలకాయుణ్ణి కాదు. నా దేహం మహత్తరమైనది కాకపోయినా నీ దర్శన భాగ్యం వల్ల మహత్తరమైన దవుతుంది". అనగా సీతామాత మారుతి మస్తకం పై హస్తముంచి నిమురుతూ "వత్సా ! నువ్వు అజరుడ వవుతావు. నిన్ను వార్ధక్యం ఆవహించదు".

హనుమంతుడు స్థిత ప్రజ్ఞుని వలె మౌనంగా వుండిపోయాడు. అతని కేమీ ఆనందం కలగలేదు. ఈ ఆశీర్వాదంవల్ల హనుమంతుడు సంతసించ లేదని సీతామాతగ్రహించి–నువ్వు అమరుడవు వుతావు" అంది..

ఆ వరమూ హనుమంతునిపై ప్రభావాన్ని కలిగించ లేదు.

సీతాదేవి పునః పలికింది– "నువ్వు గుణాగారుడవయ్యేదవు గాక" అని పలికినా మారుతి ఆనందించ లేదు. అంత ఆమె – "మారుతీ! నువ్వు అమరుడ వవుతావు. అజరుడ వవుతావు, గుణాగారు డవవుతావు".

"రామ ప్రభువులు నిన్ను విశేషంగా ప్రేమిస్తారు" అన్న పలుకులు వింటూనే హనుమంతుడు అత్యంత ప్రసన్నుడయ్యాడు. అతడు సమాధి మగ్నుడయ్యాడు. ఆ స్థితి అనిర్వచనీయ మయింది.

హనుమంతుడు జానకీదేవి చరణాలను పట్టుకున్నాడు "అమ్మా! నీ ఆశీర్వాదం అమోఘమైనది. నేను ధన్యుడ నయ్యాను.

హనుమంతుడు – "అమ్మా ! నాకు చాల ఆకలిగా ఉంది. నువ్వు అనుమతిస్తే నే నీ తోటలోని ఫలాలు ఆరగిస్తాను".

సీత "ఫలాలు తినవద్దనను, కానీ ఫలాలు కోయవద్దు, రాలిన వాటినే భక్షించు, రాక్షసు అనేకమంది యీ వనానికి కాపలా కాస్తు న్నారు. శ్రీరామ చంద్రుల చరణారవిందాలను హృదయమార స్మరించి మధుర ఫలాలను భక్షించు".

మారుతి అశోకవనంలో పరిభ్రమిస్తున్నాడు. చెట్ల నిండా ఫలాలున్నాయి. కానీ నేలమీద ఒక్కపండూ లేదు. అమ్మ – రాలిన పండ్లనే తినుమన్నది. పండ్లు కోయరాదు. పళ్ళను కోస్తే అమ్మ ఆదేశాన్ని అతిక్రమించినట్లవుతుంది. ఇప్పుడేమి చేసేది అని అను కుంటున్న అతనికి ఓ ఉపాయం తట్టింది. ఒక్కొక్క చెట్టునే ఊడబెరకసాగాడు. చెట్లను ఊపడంతో పళ్లు నేలమీద పడసాగాయి. రాలిన పళ్ళను అప్పుడు తినసాగాడు. దానితో బాటు –"అమ్మా ! నేను నీ ఆజ్ఞానుసారమే పళ్లను తింటున్నాను". అన సాగాడు.

వృక్షాలు వానరులకు నివాసస్థానాలు కదా ! ఫలాలు వాటికి భోజన వస్తువులు కదా ! అట్టి దశలో మారుతి చెట్లను యెందుకు పీకసాగాడు, అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

ప్రథమ దృష్ట్యా వానర రూపంలో మారుతి వానరస్వభావానుసారం చెట్లనూ, కొమ్మలనూ ఊపడం విరగగొట్టడమూ చేశాడు, కానీ మారుతి సామాన్య వానరుడా ? అతడు "బుద్ధిమతాం పరిష్ఠం" బుద్ధిమంతుల లోనే సర్వశ్రేష్ఠుడు, అయితే అతడు వృక్షాలను యెందుకు వూడ బెరికాడు?.

తులసీ దర్శనంలో "మోహవిటపి" శబ్దం వచ్చింది. హనుమంతుని వంటి మహాయోగి – భక్తిమాతకు సమర్పితుడై "మోహవిటపి" ని నాశనం చేస్తున్నాడు.

మోహరూప వృక్షాలను సమూలంగా వూడబెరుకు తూన్నాడు.

వృక్షాలను వూడ బెరకడానికి మరో కారణం వుంది. పళ్ళు తింటున్నా అతనికి సీతామాత దర్శన మవుతూండాలి. కనుక సీతా మాతృ సందర్శనంలో విఘ్నంగా నిలచిన వృక్షాలను అతడు వూడ బెరికి విసిరేశాడు.

హనుమత్కథన మేమంటే – భక్తి పరమార్థ సాధనలో విక్షేపాన్ని కలిగించే తత్త్వాలను నాశనం చెయ్యాలి. ప్రహ్లాదుడు తండ్రితోనూ, ధ్రువుడు తల్లి తోనూ, విభీషణుడు సోదరునితోనూ, మీరాబాయి కుటుంబ సభ్యులతోను. సంబంధాన్ని ఖండించు కున్నారు. నయనాలు విక్షేపాన్ని కలిగిస్తున్నాయని తలచి సూరదాస మహాకవి నేత్రాలనే వూడ బెరికి వేసు కున్నాడు.

గోస్వామి భావమేమంటే భక్తికి ఆటంకాన్ని కలిగించే వారితో గల సంబంధాన్ని దూరం చేసుకోవాలి.

మారుతి చెట్లను విరుగకొడుతూ, ఫలాలను భక్షిస్తూండడం

చూసి రక్షకభటులైన రాక్షసులు పరుగెత్తుకు వచ్చి హనుమంతుణ్ణి బాధించాలని ప్రయత్నించారు. అలాంటి రాక్షసులందరినీ మారుతి సంహరించాడు. హత శేషులు భయభీతులై రావణుని దర్బారులో ఫిర్యాదు చేశారు.

"ప్రభూ ! వానరు డొకడు వచ్చి అశోక వనాన్ని విధ్వంసం చేశాడు.

కుపితుడైన రావణుడు పంపిన అసంఖ్యాక రాక్షస వీరుల నందరినీ మారుతి సంహరించేశాడు. దానితో ఆ రాక్షసరాజు పరాక్రమశాలియైన అక్షయకుమార నామక సుతుణి పంపాడు. మారుతి ఓ వృక్ష ప్రహారంతో వాణ్ణి అంతం చేసి ఉచ్చైస్స్వరంతో గర్జించాడు.

ఈ వార్త రావణునికి అందడంతో అతడు తన జేష్ఠపుత్రుడైన యింద్రజిత్తుని పంపాడు. హనుమంతునికీ, యింద్రజిత్తుకూ మధ్య ఘోరయుద్ధం జరిగింది. తలచుకుంటే హనుమంతుడు యింద్ర జిత్తును సంహరించగలడు. వినయ పత్రికలో వర్ణించిన ప్రకారం చూస్తే యింద్రజిత్తు 'కాముడు'. హనుమంతుడు బ్రహ్మచారి. బ్రహ్మచారికి కామశమనం విశేష విషయం కాదు.

ఇంద్రజిత్తు యొక్క యుద్ధపద్ధతి విశేషమేమంటే-అతడెక్కడ యుద్ధం చేసినా వైరివీరులను బంధించేవాడు, కామ ప్రవృత్తి సదా బంధనకార్యాన్నే కొనసాగిస్తూంటుంది.

రావణుడెవరినీ బంధించడు. అతడందరినీ అంతం చేస్తూంటాడు. అతడు మోహస్వరూపుడు, మోహం సర్వులనూ అంతం చేస్తూంటుంది.

కుంభకర్ణుడెవరినీ బంధించడు. అంతం చెయ్యడు. అతడందరినీ మ్రింగి వేస్తాడు. కుంభకర్ణుడు మూర్తీభవించిన అహంకారమే, సద్గుణాలను మ్రింగి వేయడమే అహంకార కార్యము.

అశోక వాటికలో ఇంద్రజిత్తు ద్వారా మారుతి బంధించబడడమనే ఘట్టం, రామచరిత మానస్‌లో బహుసుందరంగా వర్ణించబడింది. కైలాస శిఖరంపై సుఖాసీనుడైన శంకరభగవానుడు యీ ప్రసంగాన్ని వర్ణిస్తూ–"భవానీ ! హనుమంతుడు బంధనం లోకి వచ్చాడు". అంటాడు.

"స్వామీ ! నిజంగానే మారుతి బంధించ బడ్డాడా?" దేవీ ! ఎవరి నామస్మరణ మాత్రంచే జ్ఞానులు జనన మరణ బంధనాలను ఖండించి వేస్తుంటారో, ఆ రామ దూత బంధనాలలోకి వస్తాడా ? హనుమంతుడు ప్రభు కార్యాన్ని సాధించడానికి బంధనాలను అంగీకరించాడు. అంతే"

ఇంద్రజిత్తును హనుమంతుని ద్వారా కాకుండ లక్ష్మణుని ద్వారా అంతం చేయించడం జరుగుతుంది. లక్ష్మణుడు గృహస్థాశ్రమి. ఊర్మిలా దేవికి భర్త, గృహస్థుద్వారా కామశమనం జరగడం అత్యంత మహత్వ పూర్ణ విషయం.

ఇంద్రజిత్తు మారుతిపై బ్రహ్మాస్త్రానుసంధానం చేశాడు. మూర్ఛితుడై పడి వున్న మారుతిని అతడు నాగపాశబద్ధుణ్ణి చేశాడు.

ఇంద్రజిత్తు హనుమంతుని బంధించి రావణుని ఆస్థానంలో నిలబెట్టాడు.

హనుమంతుని చూసి రావణుడు– "నువ్వెవరవు? పళ్ళు యెందుకు తిన్నావు ? చెట్లను యెందుకు విరుగ గొట్టావు? నా రాక్షసులను యెందుకు సంహరించావు?"

"నేను రామదూతను. ఆకలితో వున్నాను. కనుక పళ్ళు తిన్నాను. ఫలపుష్పాదులను నువ్వు సృష్టించలేదు. వీటన్నింటినీ సృష్టించినవాడు రామప్రభువే. వీటిపై నీ కెంత అధికారం ఉన్నదో నాకూ అంతే".

"బాగుంది. మరి అయితే చెట్లను యెందుకు నాశనం చేశావు".

"నేను వానరుడను.తత్స్వభావానుసారం చెట్లను ధ్వంసం చేశాను".

'కానీ రాక్షసులను యెందుకు అంతం చేశావు?

"నేను నా అంతగా యెవరినీ అంతం చెయ్య లేదు. నన్ను చంపాలని వచ్చిన వారే నా చేతులలో మరణించారు.

"రావణా? నా మాటలు విని సీతామాతను శ్రీరామచంద్రులకు సాదరంగా వప్పగించు".

ఆ పలుకులు విన్న రావణుడు – ఆ వానరాన్ని వధించుడని రాక్షసులను ఆదేశించాడు.

రాక్షస మూకలు కత్తులు ధరించి మారుతిని వధించ వస్తూండగా విభీషణుడు లేచి వినయంగా – 'దూతను వధించడం రాజనీతికి సమ్మతించిన విషయం కాదు. మరే శిక్షనైనా విధించండి ప్రభూ?" అన్నాడు.

విభీషణుని వచనాలు రావణునికి నచ్చాయి. "వాలమంటే

వానరానికి అత్యంత ప్రీతి పాత్రమైనది. ఇతని వాలానికి ఘృత తైలాదులను పోసిన గుడ్డలు చుట్టి నిప్పు ముట్టించండి. తోకలేని కోతిని చూసి వీని ప్రభువు కూడ పలాయనం చిత్తగిస్తాడు".

హనుమంతుని వాలాన్ని దగ్ధం చెయ్యాలన్న నిర్ణయం జరిగింది.

సజ్జనుల వచన మేమంటే – వానరానికి వాలం మీద మమకారమైతే నరుడికి ముక్కుమీద – అంటే ప్రతిష్ఠ మీద మమకారం వుంటుంది. ఎవరికైనా కష్టం కలిగించ దలిస్తే వాని మమకారం మీద దెబ్బకొట్టు.

మారుతి తన వాలాన్ని – లంకానగరంలో వున్న ఘృతతైలాదులు పూర్తిగా అయిపోయేటంతటి విశాలంగా పెంచేశాడు, నగరంలోని వస్త్రాలన్నీ అయి పోయాయి.

తోకకు గుడ్డలు చుట్టి రాక్షసులు హనుమంతుని లంకా నగరమంతా తిప్పారు. ఆ వింతను చూడాలని నగర వాసులంతా వచ్చారు. వికటాట్టహాసాలు చేయసాగారు.

బంధితుడై వున్న హనుమంతుణ్ణి ప్రజలు డోళ్ళు వాయిస్తూ అపశబ్దాలు పలుకుతూ, వ్యంగ్యంగా వ్యవహరిస్తూ తన్న సాగారు కూడా,

మారుతిని నగర మంతా త్రిప్పి రాక్షసులు అతణ్ణి సాగరతీరానికి తీసుకుపోయారు. అతని తోకకు నిప్పు ముట్టించారు. దానితో మారుతి యెగిరి పర్వత శిఖరం యెక్కాడు. వాలం దగ్ధమై, లంకానగరంలో యథాతథంగా ఉండిపోతే త్రిజట స్వప్నం వృథా అవుతుందని గ్రహించాడు. రెండవది–లంకానగరంలో అగ్నికి లోటుందని భావించి – తన రాక వల్ల కూడ అగ్ని స్వల్పంగానే

వున్న దన్నలోటు తీరాలని యింటింటికీ విశేషంగా అగ్నిని అందించాలని నిశ్చయించు కున్నాడు.

రామాజ్ఞ లేనిదే యీ పనిని యెలా చేయడమా ? అనుకున్నాడు. వెళ్ళి రావాలంటే అత్యధిక విలంబ మవుతుంది.

అదే సమయంలో రామ ప్రభు హృదయంలో స్పందన కలిగింది. అతడు లక్ష్మణునితో – సౌమిత్రీ! మన హనుమంతుడు లంకా దహనానికి అనుమతిని కోరుతున్నాడు. "దూతను పంపడానికి అవకాశమే లేదు".

అందువల్ల రామప్రభువు 49 వాయువులను ప్రేరేపించి హనుమంతుని కర్ణంలో లంకాదహనానికి తన అనుమతిని వినిపించు డన్నాడు.

రామచంద్రుని ప్రేరణానుసారం 49 వాయువులూ బయలు దేరాయి. అవి హనుమంతుని కర్ణ కుహరాలలో రామచంద్రుల ఆదేశాన్ని వినిపించాయి.

హనుమంతుడు భయంకరంగా గర్జించి స్వస్వరూపాన్ని ఆకాశ పర్యంతం విస్తరింప చేశాడు. అంతే స్వల్ప కాలవ్యవధిలో లంకనంతనూ దగ్ధం చేశాడు. అతణ్ణి యెవరూ వారించనూ లేక పోయారు. వేధించనూ లేక పోయారు.

ఏయే గృహాలనుండి ఘృత, తైల, వస్త్రాదులు వచ్చాయో? ఆయా గృహాలన్నీ అగ్ని హోత్రునికి ఆహుతి అయిపోయాయి. విభీషణుని మందిరం నుండి సామానేదీ రాలేదు. కనుక అది చెక్కు చెదర లేదు. రెండవది హనుమంతుడు విభీషణుని "సోదరా!" అని సంబోధించాడు. సోదర బాంధవ్య నిర్వహణ జరిగింది.

లంకా దహనం చేసి హనుమంతుడు సాగరంలో మునిగాడు. వాలాగ్నిని శాంతింప జేసుకున్నాడు.స్నానం చేసి శ్రమను దూరం చేసుకున్నాడు. సూక్ష్మరూపాన్ని ధరించి సీతామాత సమ్ముఖంలో చేతులు జోడించి నిలచాడు.

"హనుమా ! లంకకు నిప్పు అంటుకుందా? విపరీతజ్వాలలు లేస్తున్నాయే? ఇదంతా ఏమిటి?"

"అమ్మా! పెద్ద నగరం కదా! ఏదో కోలాహలం కొనసాగుతూనే ఉంటుంది. మీరేమీ విచారించ వలసిన పని లేదు".

"లేదు హనుమా ! ఇలా ఎన్నడూ జరుగలేదు. నువ్వు వచ్చిన తరువాతనే జరిగింది".

"కోపగించనంటే చెబుతానమ్మా! మాతా ! ఇదంతా నీ యీ కుమారుని పరాక్రమమే."

"నీ పరాక్రమమా?"

"తల్లీ ! ఇందులో ఆశ్చర్య పడవలసిన దేముంది? ఇదంతా నీ లీలలో ఓ భాగం మాత్రమే". జరిగిన కథంతా చెప్పి సీతామాతకు ప్రణమిల్లి- "అమ్మా! లంక దగ్ధమై పోతున్నప్పుడు నాకు ఓ విచారం కలిగింది".

"ఏమిటి?" "అశోక వనపర్యంతం అగ్నిజ్వాలలు వచ్చేస్తాయేమో నన్నంత ప్రచండంగా ఉన్నాయి".

"హనుమా! నువ్వింత పొరపాటు యెందుకు చేశావు? "ఏమి పొరబాటమ్మా?"

"అగ్ని నాకు బహుదూరంలో ఉంది. కానీ నీ శరీరం మీదనే

నిప్పుంది. జ్వలించే నీ వాలాగ్నిని ప్రభువులు నీకే మాత్రం వేదన కలిగించకుండా ఉంచగా లంకాగ్నిని నా దగ్గరకు రానిస్తారా?"

హనుమంతుని మనస్సు సమాధాన పడింది. సీతా భగవతి చరణాలకు ప్రణమిల్లి అతడు పలికాడు–"అమ్మా! నేను తిరిగి వెడుతున్నాను, ప్రభువులు అనుమతించ లేదు. లేకుంటే పనులన్నీ చక్కబెట్టి నేను నిన్ను వెంట తీసుకు వెళ్ళేవాడను. అమ్మా ! నేను దృఢవిశ్వాస పూర్వకంగా చెబుతున్నాను. మాసం గడువులోగా మేమంతా వస్తాము".

"మాతా ! గుర్తు నిమిత్తం ప్రభువులు అంగుళీయకాన్నిచ్చినట్లుగా మీరు కూడ యేమైనా ఆనవాలు నివ్వండి".

తన చూడామణిని తీసి జానకీమాత హనుమంతుని చేతికి యిచ్చింది.

ఈ ప్రసంగాన్ని మానసకారుడు వర్ణిస్తూ – హనుమంతుని ప్రస్థానవేళలో సీతామాత విలపిస్తూ– "హనుమా ! ఏక మాత్రాధారుడవుగా నువ్వు నాకు దొరికావు. నీ రాకతో నాకు ధైర్యం కలిగింది, శాంతి లభించింది, ఇప్పుడు నువ్వు మరలి పోవ డంతో ఆ రాత్రులనే అనుభవించాలి. నా పరిస్థితినచూశావు కదా! అధికంగా నేను చెప్పేదే ముంది? నా స్మరణ గురించి ప్రభువులకు నేను చెప్పనవసరం లేదు. నా విషయమై వారు పడుతున్న వేదనను గురించి నువ్వు చెప్పావు కదా ! జయంతుని వృత్తాంతాన్ని నువ్వు వారికి వివరించి మీరు క్షత్రియులనీ, మీ కరకమలాలలో ధనుర్బాణాలున్నాయనీ నా మాటగా తెలియజెప్పు. మరో మాట కూడ చెప్పు. నెలరోజులలోగా ప్రభువులు రాక పోతే నేను

సజీవంగా వారికి లభించను". అంటున్న ఆమె నేత్రాలు నీటితో నిండిపోయాయి.

అనేక మార్లు మాతృచరణాలకు ప్రణమిల్లి మారుతి సెలవు తీసుకున్నాడు. హనుమంతుని యాత్ర సార్ధకమయింది.సాగర తీరంలోని శిఖరాన్నధిరోహించి మారుతి భయంకరంగా సింహగర్జన చేశాడు. అమోఘ రామ బాణ సమ వేగంతో గెంతు గెంతి ప్రయాణోన్ముఖుడయ్యాడు.

సాగరతీరంలో అతని సహచరు లందరూ అతని రాకకై నిరీక్షిస్తూన్నారు. హనుమదాగమనంతో వారు నాట్యం చెయ్యసాగారు. జయ జయ కారాలు పలికారు. అందరికీ మారుతి చూడామణిని చూపించాడు. జరిగిన కథ అంతా చెప్పాడు. తరువాత అందరి కందరూ సుగ్రీవ సన్నిధికి వచ్చారు. సుగ్రీవునికి ప్రణమిల్లి వానరులు పలికారు.

"ప్రభూ మనందరి కార్యాన్ని మారుతి యేకమాత్రుడుగా సాధించుకు వచ్చాడు. మన ప్రాణాలను కాపాడాడు. అతడే లేకపోతే మేము సజీవంగా ఉండేవారము కాదు". అన్నారు.

తరువాత సుగ్రీవ సహితులై సర్వులూ శ్రీరామసన్నిధి చేరారు. ప్రభు చరణాలకు వినయంగా ప్రణమిల్లి మారుతి మాతృసందేశాన్ని వినిపించాడు. జానకీదేవి దుఃఖ స్థితిని గ్రహించిన రామచంద్రుని నేత్రాలు కన్నీటితో నిండిపోయాయి.

"మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధిగా నన్నే నమ్ముకుని ఉన్న వారికి ఎన్నడూ కలలో కూడ విపత్తులురావు" అన్నాడు.

తత్సమయంలో మారుతి చక్కగా అంటాడు. "ప్రభూ ! నిన్ను

స్మరించకుండ ఉండడం కంటె జీవునకు విపత్తి యేముంటుంది?"

"స్వామీ! విశేషంగా చెప్పను. నా తల్లికి సంభవించిన దుఃఖాలను ఆ భూపుత్రి మాత్రమే సహించగలదు. ఇంత మాత్రం అర్థం చేసుకోండి, ఇంక ఎంతమాత్రం ఆలస్యం చెయ్యరాదు. మీరు పరిశ్రమించాలంటే నాకు ఆజ్ఞనివ్వండి - రావణ కులంలో తర్పణాలీయదగిన వాడెవడూ శేషించకుండ చేస్తాను". అంటూన్న అతని నేత్రాలలో ఆవేశం గోచరించింది. హనుమంతుణ్ణి హృదయమార హత్తుకుని రామచంద్రుడు - 'మారుతీ! నేను నీ ఋణవిముక్తుడను కాజాలను," అంటాడు. జీవునికి యింతకంటే యేమి కావాలి?

హనుమంతుడు భగవచ్చరణాలపై వాలిపోయాడు. భగవానుడు తన వరద హస్తాన్ని మారుతి మస్తకం మీద ఉంచాడు. రామప్రభువు మారుతి మస్తకంపై నిజహస్త ముంచగానే కథను చెబుతున్న శంకరుడు సమాధి గమ్యుడై పోయాడు.

"ప్రభూ ! ఇక ఆలసించకండి. యుద్ధ సన్నాహం చెయ్యండి. అన్నాడు మారుతి. సుగ్రీవుడు సైన్యాన్ని సిద్ధం చేశాడు. సైన్య సమేతుడై రామచంద్రుడు సాగర తీరం చేరాడు.

సాగరానికి అభిముఖంగా రామసైన్యాలు వచ్చి ఉన్నాయన్న వార్త రావణునికి అందింది". ఇప్పుడు మనం యేమి చెయ్యాలని అతడు మంత్రుల నడిగాడు. మంత్రు లతణ్ణి ప్రశంసించారు. సీతను తిరిగి రామునికి వప్పగించుమని పలికిన విభీషణుని రావణుడు కాలితో తన్నాడు. నాకు నీ అవసరం లేదు. నువ్వు ఆ తపస్వి దగ్గరకే పో" అన్నాడు.

విభీషణుడు రావణుని పరిత్యజించి శ్రీరామ సన్నిధికి వచ్చి

శరణు వేడుతాడు. రామచంద్రుడు విభీషణునికి శరణిస్తాడు. అంత విభీషణుడు–"స్వామీ! ఆదిలో వాసనలుండేవి, కానీ నీ దర్శన మాత్రంచే అవన్నీ నశించి పోయాయి. ఇక తమ పవిత్ర భక్తి వినా మనస్సు దేనినీ కోరడం లేదు. "అన్నాడు. భగవానుడు సాగర జలాలను రప్పించి విభీషణుని మస్తకంపై రాజతిలకం ఉంచాడు, లంకా రాజ్య సింహాసనాభిషిక్తుని చేశాడు. జీవుడు భగవానునితో నాకే కోరికా లేదని చెప్పగలిగిననాడు పరమాత్మ అట్టి వానికి సర్వాన్నీ ప్రసాదిస్తాడు. విభీషణుడు భగవంతుని వాడయ్యాడు.

భగవానుడు సుగ్రీవ విభీషణులను ప్రశ్నించాడు–మధ్యలో వచ్చే సాగరాన్ని యేలా దాటేది? త్రిరాత్ర దీక్షలో ఉపవసించి ప్రార్థించుడని విభీషణ సలహా యిచ్చాడు. సాగర తీరంలో రామప్రభువు త్రిరా దీక్షలోకూర్చుని ప్రార్థించాడు. సాగరుడు దారికి రాలేదు.

"లక్ష్మణా ! ధనుర్బాణాలు తీసుకురా, సాగరుడు యిలా దారికి వచ్చేటట్లు లేడు, అని లక్ష్మణునితో పలికి రామచంద్రుడు శరసంధానం చెయ్యగా సాగరంలో జ్వాలలు లేచాయి.

ముత్యాల పళ్ళెరంతో సాగరుడు రామచంద్రుని శరణు వేడాడు. "ప్రభూ ! నీ సైన్యంలో నలనీలనామాలతో వానరు లిద్దరున్నారు. వారి హస్తస్పర్శమాత్రంచే రాళ్ళు నీళ్ళపై తేలతాయి. తద్వారా మీరు సేతునిర్మాణం చెయ్యండి, నేను సహకరిస్తాను" అంటూ భగవంతుణ్ణి ప్రార్థించి సముద్రుడు స్వస్థానానికి వెళ్ళి పోయాడు.

తులసీదాసు అంటాడు. ఈ రామగాథను గానం చేసే వారూ ఆలకించే వారూ నౌక లేకుండానే భవసాగరాన్ని తరిస్తారు. అని ఆశీర్వదించి గోస్వామి సుందరకాండను పూర్తి చేశాడు.

**శ్రీరామ జయరామ జయ జయరామ**

# హనుమల్లీలలు

### ఓం శ్రీ గణేశాయనమః

సదాశివ దేవుడు సతీ సమేతంగా కైలాస పర్వతంపై గల మహోన్నత శిఖరం మీద తేజరిల్లుతూన్నాడు. ఆ దేవ దేవుని ధవళ శరీరం మీద జటాజూటం శోభిల్లుతున్నది. కర కమలంలో రుద్రాక్షమాల, మనోహర కంఠసీమలో నాగరాజూ విరాజిల్లుతూ న్నారు. శ్రద్ధా భక్తులు మూర్తీభవించి సేవలకై వినయభావంతో చేతులు జోడించి ఆసీనమై వున్నాయా. అన్నట్లు నందీశ్వరుడు వినయంగా కూర్చుని వున్నాడు. ఆ దేవదేవుని అనుచర సహచర సమూహం కొద్ది దూరంలోనే నానావిధ క్రీడలలో మునిగి తేలుతూ ఆనందిస్తూన్నది. ఆ శంకరభగవానుని మస్తకం మీద బాలచంద్రుడూ, ఆకాశ గంగా సర్వదా నివసిస్తూండడం వల్ల ముక్కంటి కంటిమంట శాంతి వహించి వున్నట్లు గోచర మవుతున్నది. లలాట భాగంలో భస్మరేఖలు అత్యంత సుందరంగా సందర్శన మవుతున్నాయి.

"శ్రీరామ, శ్రీరామ" అంటూనే మహాదేవుడు నిజసమాధి స్థితి నుండి ప్రకృతిలోకి వచ్చాడు. తన నాథుడు అపూర్వభావంతో తనను తిలకించడం సతీదేవి గ్రహించి భర్తకు అభిముఖంగా వచ్చి నిలచి దోయిలించిన హస్తాలతో – "ప్రభూ ! ఇప్పుడు నేను తమకు చేయవలసిన సేవలేమిటో సెలవిస్తారా? మీ ముఖ కవళికలను పరిశీలిస్తూంటే మీరు నాతో యెదో చెప్పాలనుకుంటూన్నట్లు గోచరమవుతున్నది." అని పలుకగా సదాశివుడు బదులు పలుకుతూ

"ప్రియా ! నేడు నా మదిలో మహోత్తమ శుభ సంకల్పం జరిగింది. ఏ మహా మహిమాన్వితుని నేను నిరంతరం ధ్యానిస్తూన్నానో యే దేవాధి దేవుని శుభనామాన్ని నిరంతరం స్మరిస్తూ గద్గదత్వాన్ని పొందుతూ వుంటానో, యెవరి యదార్థ రూపాన్ని స్మరించి సమాధి గమ్యుడ నవుతుంటానో, ఆ నా దేవ దేవుడే భూతలాన అవతరించ మున్నాడు. అమరులందరి కందరూ మదీయారాధ్య దేవునితో అవతరించారని అత్యంత కుతూహలంతో ఆ ప్రభు సేవా భాగ్యాన్ని పొంద కోరుతున్నారు. అట్టి దశలో నేను మాత్రం యెందుకు వంచింపబడాలి? నేనూ అక్కడకు వెళ్ళి నా ప్రభువును సేవించి యుగయుగాలుగా నాకు కలిగిన అభిలాషను నెరవేర్చు కుంటాను" అన్నాడు. ఆ మధుర వచనాలను విన్న సతీదేవి తత్సమయంలో ఉచితానుచిత కర్తవ్యాలను వెంటనే నిశ్చయించుకో లేకపోయింది. ఆమె మదిలో ద్వంద్వభావాలు చెలరేగాయి. తన పతి అభీష్టం నెరవేరాలన్నది ఓ భావం. తనకూ తన నాథునికీ మధ్య వియోగం కలగరాదన్నది మరోభావం – ఇలా ఆమె కొన్ని క్షణాలు యోచించి "స్వామీ ! మీ సంకల్పం యోగ్యమైనదే. నా యిష్ట దేవులయిన మిమ్మల్ని నేను ఆరాధించ గోరునట్లే మీరు మీ ఇష్ట దేవుణ్ణి సేవించ గోరుతున్నారు. కానీ వియోగ భీతి వల్ల నా హృద్గత స్థితి యెలా అవుతుందో తెలియడం లేదు. మీ సుఖంలోనే నాకు సుఖం కలదన్న భావం కలిగేటట్లు మీరు నాకు శక్తిని ప్రసాదించాలి. మరో విషయం యే మంటే యీ సారి పరమాత్మ రావణ వధార్థం అవతరించ బోతున్నాడు. మీకు పరమభక్తుడయిన రావణుడు మిమ్మల్ని ప్రసన్నులను చేసుకోవడం కోసం తన శిరస్సులను సయితం ఖండించి హోమం చేశాడు. అట్టి

స్థితిలో తమరు రావణుణ్ణి అంతం చేసే కార్యంలో యేలా సహకరిస్తారు?" అని ప్రశ్నించింది.

అందుకు ఆశుతోషుడు చిరునవ్వు నవ్వాడు. దేవీ ! నువ్వెంతటి అమాయకురాలవు? ఇందులో మన వియోగ విషయం యేముంది? నేను ఓ రూపంలో అవతరించి నా ప్రభువును సేవించుకుంటాను. ఈ రూపంలో నీ దగ్గరే ఉంటూ ఆ లీలా మయుని మహత్తర లీలలను చూపిస్తూంటాను. అవకాశం లభించి నప్పుడల్లా నా ప్రభువును నేను ధ్యానించుకుంటూ వుంటాను. ఇప్పుడు నీ రెండవ సందేహాన్ని నివారించుకో. రావణుడు ఓ రీతిగా నన్ను ప్రార్థించినా మరో రూపంలో నా అంశను హేళన చేశాడు. దేవీ ! నేను యెకాదశాకారాలలో తేజరిల్లుతూ ఉంటానన్న విషయం నీకు తెలిసినదే కదా! రావణుడు తన మస్తకాలను ఖండించి నాకై హోమం చేసే సమయంలో నా అంశను ఒక దాని చూసి వికటంగా నవ్వాడు. ఇప్పుడు నేను అదే అంశతో అవతరించి వానికి విరుద్ధంగా యుద్ధం చేస్తాను. వాయుదేవత ద్వారా పరమ తపస్విని అయిన అంజనాదేవి గర్భంలో అవతరించ దలచాను. ఇక నీ సందేహాలు తీరినట్లే కదా!" అన్న సదాశివ నాథుని మధుర వచనాలకు సతీ దేవి పరమానందం పొందింది.

రూప యౌవన మదగర్వంతో ఓ మహర్షి శాపానికి గురి అయింది అమరావతీ నగరంలో విలాసంగా జీవించే "పుంజికస్థలి" అనే అప్సరస. ఆమె వల్ల జరిగిన అపరాధానికి ప్రాయశ్చిత్తంగా ఆ మహర్షి ఆమెను "వానరయోనిలో జన్మించు" అని శపించేశాడు. ఆమె అనేక విధాల ఆ మహాత్ముని పాదారవిందాలపై వాలి ప్రార్థించగా

అతడు కరుణించి ఆమెకు యెప్పుడు యేలాంటి రూపం ధరించా లనుకుంటే అలాంటి రూపాన్ని ధరించే కామరూపధారణాశక్తిని ప్రసాదించాడు. అందువల్ల ఆమె మానవిగా కానీ , వానరిగా కానీ

సంచరించే శక్తిని పొందినది. అపారశక్తి సంపన్నుడూ, భగవ ద్భక్తుడూ అయిన వానర రాజయిన కేసరి–ఆమెను భార్యగా స్వీకరించాడు, సర్వాంగసుందరి అయిన ఆమె అతణ్ణి అత్యంత ప్రేమానురాగాలతో సేవించసాగింది.

ఓ నాడు వారిద్దరూ సుందర మానవ రూపాలను ధరించి తమ ప్రాంతంలో రాజిల్లుతూన్న సుమేరు పర్వత శిఖరం మీద విహరించ సాగారు. అప్పుడు వాయువు మంద మందంగా వీస్తున్నాడు. వాయు తరంగం ఒకటి అంజన చీర చెరగును యెగుర గొట్టింది. తనను యెవరో స్పృశిస్తునట్లు అంజనకు అనిపించసాగింది. ఆమె తన చీరను సవరించుకుంటూ వేరుగా నిలబడి గద్దిస్తూ "నా పాతివ్రత్యాన్ని భంగపరచ సాహసించే వారిని నేనిప్పుడే భస్మం చేస్తాను". అంది. "దేవీ! నేను నీ మహావ్రతాన్ని భంగపరచను. అస్మత్ సమాన మహాశక్తి సంపన్నుడైన కుమారుడు నీకు కలుగుతాడు. బలబుద్ధ్యాదుల విషయంలో అతణ్ణి అధిగ మించగల వారు యీ భువన భవనంలో ఉండరు. అతణ్ణి నేను కంటికి రెప్పలా రక్షిస్తూంటాను. త్వరలో నీకు కలుగబోయే కుమారుడు భగవత్కింకరుడై మహాధర్మ మార్గగామియై దుష్టసంహారానికీ, శిష్ట జన సంరక్షణకూ పాటుబడుతూ ఆచంద్ర తారార్కమైన సత్కీర్తిని సంపాదించగలడు". అంటూ వాయుదేవుడు పలుకుతూన్నట్లు అంజనీదేవికి వినిపించింది. ఆనంతరం అంజనాకేసరులు స్వస్థానాలకు

మరలిపోయారు. శంకరభగవానుడు వానరరూపంలో వైశాఖబహుళ దశమినాడు ప్రాదుర్భవించాడు. ఈ విషయంలో మత భేదమున్నది. ఏది యేమయినా స్వామి సేవ, పూజ, పారాయణాదులు సర్వదా అనుసరణీయాలే కదా ! అంజనా కేసరుల ఆనందానికి అవధులు లేకపోయాయి. శుక్ల పక్షంలోని చంద్రునిలా ప్రవర్ధమానుడవుతూ ఆ బాలుడు అల్లారు ముద్దుగా పోషింపబడుతున్నాడు. అంజన యెక్కడికైనా బిడ్డను గుండెకు హత్తుకుని తీసుకువెళ్ళేది.కేసరి తన ముద్దుల గారాల పట్టిని వీపు మీద యెక్కించుకొని గంతులు వేస్తూ ప్రియసుతుడు ఆనందించడం చూసి పరమానంద పరవశుడవుతూన్నాడు.

కాలచక్రం అవ్యాహతగతితో గిరగిర తిరిగిపోతున్నది. ఓ నాడు అంజనాదేవి బిడ్డను యింటిదగ్గరే విడిచి పువ్వులకై వెళ్ళింది. అంత క్రితమే వానరరాజైన కేసరి కార్యార్థియై వెళ్ళి పోయాడు. బాలుడు యింట్లో ఒంటరిగా ఉన్నాడు. అతనికి తీవ్రంగా ఆకలి వేసింది. అతడు యిటూ అటూ పరికించ సాగాడు. కానీ అతనికి తినడానికి యేమీ దొరకలేదు. చివరికి అతని దృష్టి సూర్యబింబం పై పడింది. అది ప్రాతఃకాల సమయం కావడం వల్ల అతడు సూర్యబింబాన్ని చూసి అదేదో యెఱ్ఱని పండనుకొని భ్రమవశుడై అది తినడానికీ ఆడుకోవడానికీ కూడా పనికివస్తుందన్న భావంతో సూర్య మండలం వరకూ వెళ్ళాలని ప్రయత్నించాడు, వాయుదేవుడు ఆదిలోనే అతనికి యెగిరే మహత్తర శక్తిని ప్రసాదించాడు. లేకుంటే మహాదేవుని భవ్యలీలలో యిదేమంత ఆశ్చర్యకర విషయమూ

కాదని చెప్పాలి. ఆ బాలుడు ఆకాశవీథిలో యెగరుతున్నాడు. సురాసుర గరుడ గంధర్వ యక్షకిన్నర గణాలు అతనిని చూసి ఆశ్చర్య పడుతున్నాయి. వాయు దేవుని మదిలో కూడా సందేహం కలగ సాగింది. తన పుత్రుడు ప్రచండ కిరణుడైన భాస్కరునివైపు పరుగులు తీస్తున్నాడే సూర్య కిరణ జ్వాలల్లో అతడు దగ్ధం కాకుండా వుండాలన్న భావంతో అతడు హిమాద్రి మలయాద్రుల నుండి శీతలత్వాన్ని వెంటపెట్టుకుని పుత్రుని వెనువెంట రాసాగాడు. తత్సమయంలో దివాకరుడు దివ్యదృష్ట్యా పరిస్థితులను తిలకించ సాగాడు - వాయుదేవుని వల్లనే యీ బాలుడు జన్మించాడనీ యితణ్ణి సంరక్షించాలని అతడు కూడ వస్తున్నాడనీ తెలుసుకున్నాడు. వెంటనే తన సోదరుణ్ణి కోమలకర స్పర్శతో లాలిస్తున్నాడా? అన్నట్లు అతడు తన ప్రచండ కిరణాలను శీతలం చేశాడు. లేదా జగత్పతి అయిన సదాశివ భగవానుని ఆగమనాన్ని తిలకించి స్వాగతం పలుకుతున్నాడా? అన్నట్లుంది. ఆ బాలకుడు సూర్యరథాన్ని యెక్కి అతనితో ఆడుకోసాగాడు. సరిగా నాడు గ్రహణ దివసం కావడం వల్ల రాహువు - సకాలంలో సూర్యగ్రసనార్థం వచ్చాడు. అతడు - సూర్యరథం మీద వానర బాలుడు లీలగాకూర్చుని ఉండడం చూసి కూడ అతన్ని లెక్కచెయ్యలేదు. ఆదిలో వలెనే అతడు సూర్యునిపై విరుచుకు పడ్డాడు. కానీ వానర బాలుని కఠోర హస్తాలలో చిక్కుకు పోయి అతడు భయపడి యెలాగో తప్పించుకుని పారిపోయాడు. సరాసరి మహేంద్రుని సమీపించి - "సురరాజా! సూర్యగ్రసనాధికారం మీరు నాకు ప్రసాదించి ఉన్నారు. దాని యిప్పుడు వేరొకరికి కూడా యిచ్చారా?" అని ప్రశ్నించేసరికి మహేంద్రునికి అసలు సంగతి తెలియక రాహువును గద్దించి మళ్ళా

సూర్యుని దగ్గరకు పంపాడు. రాహువు తిరిగి రావడం చూసిన ఆ వానర బాలునికి తన ఆకలి విషయం జ్ఞాపకానికి వచ్చింది. దానితో అతడు రాహువు మీదకు విరుచుకు పడ్డాడు. ఆ బాలుని తేజానికి రాహువు దడదడ లాడిపోయాడు. తనను రక్షించుమని అతడు దేవేంద్రుని ప్రార్థించ సాగాడు. అతని ఆర్తనాదాలను ఆలకించి దేవేంద్రుడు ఐరావతారూఢుడై మహావేగంతో వచ్చాడు. ఐరావతాన్ని చూడగానే ఆ బాలుడు రాహువును వదిలి. దాని పట్టుకోవాలని పరుగెత్తాడు. ఇంద్రుడు భయపడి ఆ బాలుని మీద మహా వేగంగా తన వజ్రాయుధాన్ని విసిరాడు. ఆ దెబ్బకు అతని వామహనువు విరగడంతో అతడు పర్వతం మీద పడి విలవిలలాడ సాగాడు. అది చూసి వాయు దేవుడు తనపుత్రుని యెత్తుకుని పర్వత గుహలోకి వెళ్ళిపోయాడు. అతనికి మహేంద్రునిపై మహాక్రోధం కలగడంతో వెంటనే తన గతిని బంధించి వేశాడు. వాయుప్రసారం లేకపోవడంతో విశ్వమంతటా కల్లోలం బయలు దేరింది. ముల్లోకాలలో యేదీ కదలడం లేదు. సర్వుల శ్వాస కార్యమూ బంధింప బడసాగింది. మహేంద్రుడు పరుగెత్తి పితామహ సన్నిధి కరిగి సమాచారాన్ని వివరించగా – ప్రజాపతి అమర ప్రముఖులను వెంటబెట్టుకుని పర్వత గుహలోనికి వచ్చి బాలుణ్ణి స్పృశించే సరికి అతడు దివ్యానందంతో లేచి నిలచాడు . దానితో వాయుదేవుడు పరమానంద భరితుడయ్యాడు. శీఘ్రమే విశ్వంలో ప్రాణవాయు సంచారం జరిగింది. బ్రహ్మ దేవుడు దేవతలను సంబోధించి – "అమరులారా! ఈ బాలుడు సామన్యుడు కాదు. మన కార్య సిద్ధ్యర్థం యితడవతరించాడు. కనుక మీ రందరూ యితనికి వరాలను ప్రసాదించాలి' అన్నాడు.

అంత దేవేంద్రుడు పరమానంద భరితుడై "నా వజ్రం వల్ల యితని హనువు భగ్నమైపోయింది, కనుక నేటి నుండి యితడు హనుమంతుడని పిలవబడతాడు. భవిష్యత్తులో నా వజ్రంవల్ల యితనికి యెట్టి ఆపదా కలగదు". అన్నాడు. అప్పుడు సూర్యుడు వరాలను ప్రసాదిస్తూ–"నా శతాంశ తేజాన్ని యితనికి ప్రసాదిస్తున్నాను, నా అనుగ్రహం వల్ల యితడు తన రూపాన్ని అభీష్టానుసారం మార్చు కోగలడు. శాస్త్రాధ్యయనేచ్ఛ కలుగగానే యితనిచే నేను సమస్త శాస్త్రాలనూ అధ్యయనం చేయిస్తాను, ఇతడు మహోవాజ్మి అవుతాడు" అన్నాడు. అనంతరం వరుణ, కుబేర, విశ్వకర్మాదులందరూ బాల హనుమంతునికి వరాలను ప్రసాదించారు. బ్రహ్మదేవుడు వరాలనిస్తూ – "ఈ బాలుడు బ్రహ్మజ్ఞానియై, దీర్ఘాయుర్దాయం కలవాడై–అంటే చిరంజీవియై బ్రహ్మాస్త్ర బ్రహ్మ శాపవిముక్తుడై భాసిల్లునుగాక!" అని ఆశీర్వదిస్తూ స్వస్థానానికి మరలిపోయే సమయంలో వాయుదేవుణ్ణి చూస్తూ – "నీ కుమారుడు మహోపరాక్రమశాలియై, కామరూపధారణా శక్తిసంపన్నుడై, మనోవేగంతో సమానమైన వేగం కలవాడై, అప్రతిహతగతితో అమర కీర్తితో భాసిల్లుతాడు. రాబోయే రామరావణ సంగ్రామంలో యితడు శ్రీరామచంద్రులకు సహాయకుడై ఆ పురుషోత్తమునకు అత్యంత ప్రేమపాత్రుడు కాగలుగుతాడు". అంటూ వెళ్ళిపోయాడు. అలా అమరులందరూ బాలహనుమంతునికి వరాలను ప్రసాదించి తమ తమ స్థానాలకు మరలిపోయారు. ఈ యావత్ సమాచారాన్నీ ఆలకించి అంజనాకేసరులు చెప్పలేని సంతోషాన్ని పొందారు.

— 0 —

## బాలలీలలు

బాల్యదశలో హనుమంతుడు అనేక విధాలుగా అల్లర్లు చేశేవాడు. అసలే వానరుడు. పైగా బాలుడు. అదీ గాక అమరుల వల్ల పొందిన వరబలం తోడునీడై వుంది. ఇవన్నీ అలా వుంచగా రుద్రాంశతో అవతరించిన వాడు, మునుల ఆసనాలు యెత్తుకుపోయి చెట్లకొమ్మలకు వ్రేలాడ దీసేవాడు. వారి కమండలలు జలాలను పారబోసే వాడు, వారి అంగ వస్త్రాలను చింపి పార వేసే వాడు, అప్పుడప్పుడు ముద్దుగా వారి తొడలమీద కూర్చొని అకస్మాత్తుగా వారి గడ్డాలనూ, మీసాలనూ పీకి పారిపోయే వాడు. బలవంతంగా అతణ్ణి యెవరూ ఆపలేరు కదా ! అతడు పెద్దవా డయ్యాడు. విద్యాధ్యయన సమయం వచ్చింది. కానీ అతని బుద్ధి చాపల్యంలో మాత్రం మార్పు రాలేదు, అంజనా కేసరులు విచార సాగరంలో పడిపోయారు. బిడ్డను క్రమ శిక్షణలోనికి తీసుకురావాలని వారు చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమై పోయాయి. అంత వారు మహర్షులను ఆశ్రయించి–"మీరే దయ, చూపాలి. లేకపోతే మా వాడు బాగు పడడు!" అన్నారు. అంత మహర్షులు దివ్యదృష్ట్యా తిలకించి–ఇతనికి తన బలం మీద అపార గర్వముంది. స్వశక్తిని మరచిన నాడు కానీ యితడు మార్గం లోకి రాజాలడు." అని నిశ్చయించు కున్నారు.వారు ఒకానొక సమయంలో వచ్చిన అవకాశాన్ని పురస్కరించుకుని హనుమంతుణి శపిస్తూ "నువ్వు నీశక్తిని మరచి పోయెదవుగాక ! నీ బలపౌరుషాలను గురించి పరులు నీ స్మరణకు తీసుకువచ్చిన నాడే స్వశక్తిని పొంది నువ్వు దానిని సంపూర్ణంగా సద్వినియోగం చేసుకోగలుగుతావు", అనడంతో హనుమంతునికి స్వశక్తి స్మరణ దూరమై పోయింది.

హనుమంతునికి విద్యాధ్యయన సమయం రాగానే వానర రాజైన కేసరి తన కుమారునికి సముచిత సంస్కారం చేయించి వేదాధ్యయనార్థం సూర్య దేవుని సన్నిధానానికి పంపాడు. హనుమంతుడు అక్కడకు వెళ్ళి వేదవేదాంగాలను అధ్యయనం చేశాడు. అతడు వేరే అధ్యనం చెయ్యాలా? సాక్షాత్తూ మహాదేవాంశగా అవతరించిన వాడే అయినా సంప్రదాయ పరంపరను సంరక్షించడం కోసం సమస్త శాస్త్రాలనూ సమగ్రంగా అధ్యయనం చేసి అతడు తల్లిదండ్రుల దగ్గరకు తిరిగి వచ్చేశాడు. సూర్యదేవుని అనుగ్రహం వల్ల తమ బిడ్డ సకల విద్యాపారంగతుడు కావడం చూసి అంజనా కేసరులు మహానంద పరవశులయ్యారు.

లోక కంటకులైన రావణ కుంభకర్ణాది దుష్టాత్ములనందరినీ సంహరించే నిమిత్తం దేవతలచేతా మహర్షుల చేతా ప్రార్థించబడిన శ్రీమన్నారాయణమూర్తి ధర్మమూర్తి రూపంలో శ్రీరామరూపంలో అవతరించాడు. శివభగవానుడు శ్రీరాముని బాలలీలలను తిలకించి పులకించాలని తరచు అయోధ్యాపురానికి వచ్చి అక్కడ ఉండేవాడు. ఓ నాడు అతడు జ్యోతిషుని రూపంలో వచ్చి బాలరాముని చెయ్యి చూసేవాడు. మరోనాడు భిక్షురూపంలో వచ్చి ఆశీర్వదించేవాడు. కాలం గడుస్తూన్నది. బాలరాముడు ఓ నాడు ఆడుకోవాలి. రాజభనం నుండి వచ్చి బయట చూసేసరికి వానరాలను ఆడించేవాడు -ఒకడు చాలాబాగా ఆడే వానరాన్ని వెంటబెట్టుకు వచ్చాడు. ఆ వానరం అసామాన్యమైనది. బాలకులందరూ దాని మనోహర విచిత్ర క్రీడను తిలకించడానికి అక్కడ గుమి గూడారు. బాల రామ చంద్రుడు కూడ తమ్మునితో అక్కడకు వచ్చాడు. తన ప్రభువును ఆకర్షించాలని వానర రూపంలో శంకరుడే విజయం చేశాడు.

ఆడేవాడూ, ఆడించేవాడు సర్వం ఆ మహాదేవ భగవానుడే. అంతా యెందుకు? తనతో ఆడాలనీ, ఆయన మధుర లీలలను సందర్శించాలనీ ఆయన్ని ప్రసన్నుణ్ణి చేసుకోవాలనీ అతడు వచ్చాడు. ఆ వానర క్రీడను తిలకించి పులకించిన బాలరాముడు ఆకర్షింప బడ్డాడు. ఆ సుందర వానరక్రీడను సందర్శించి అందరూ వెళ్ళి పోయారు. కానీ బాలరాముడు మాత్రం కదల లేదు. "నాకీ వానరం కావాలి" అంటూ రామచంద్రుడు పట్టుబట్టాడు. కౌసల్యా దశరథులు గారాల పట్టి పట్టుపడితే జరగని దేముంటుంది? దశరథమహారాజు సేవకులను పిలిచి "ఆ కోతులాడించే వానికి యెంతైనా సరే యిచ్చి ఆ వానరాన్ని తీసుకు రండి". అని ఆజ్ఞాపించాడు. కోతుల వాడు వచ్చినది ద్రవ్యం కోసం కాదు. తన పెన్నిధియైన శ్రీరామచంద్రప్రభు చరణాలలో తనకు తాను అర్పించు కోవాలని వచ్చాడు. బాలరాముడా సుందర వానరాన్ని తన చేతుల లోకి తీసుకున్నాడు. అంతవరకూ ఆ దివ్య వానరం తనను తానే ఆడించు కుంటున్నది. ఇప్పుడా రామచంద్ర ప్రభువే ఆడించ సాగాడు. యుగయుగాల నుండి కలిగిన కోరిక నాటితో నెరవేరింది. అది ఆనంద పారవశ్యంతో నాట్యం చెయ్య సాగింది. జనులందరూ ఆ దివ్యవానర నృత్యాన్ని తిలకించి పులకించి పోయారు. ముగ్ధులై పోయారు. తత్సమయంలోనే ఆ కోతులవాడు మాయమై పోయాడు. అతడు ఆ వానరంలో లీనమై పోయాడో ? లేక తన పని పూర్తి కావడంతో తన కైలాసానికే వెళ్ళిపోయాడో తెలియదు. ఆ రూపంలోనే హనుమంతుడు అక్కడ బాలరామ చంద్రుని సేవించుకుంటూ ఉండి పోయాడు. అంతట ఓ నాడు విశ్వామిత్ర మహర్షి యజ్ఞ సంరక్షణార్థమై – రామ, లక్ష్మణులను

తనతో తీసుకు వెళ్ళాలని వచ్చినప్పుడు భగవానుడు హనుమంతుని దగ్గరగా పిలిచి "హనుమా! నువ్వు నా అంతరంగ మిత్రుడవు. నీకు తెలియని లీలలు నాలో యేమీ లేవు. భవిష్యత్తులో నేను దశ కంఠుడైన రావణాసురుణ్ణి అంతం చేస్తాను. ఆ సమయంలో నాకు వానర సహకారం కావలసి ఉన్నది. ఖర, దూషణ, త్రిశిర, శూర్ప నఖాదులు దండక వనంలో దుష్టవిహారం చేస్తూన్నారు. మారీచ, సుబాహు తాటకాదులు మనకు దగ్గరలోనే ఆవాసం యేర్పర చుకున్నారు. వారి మాయాజాలాలు, సర్వేసర్వత్రా వ్యాపించి ఉన్నాయి.నువ్వు శబరిని కలుసుకుని ఋష్యమూకాద్రిని చేరి సుగ్రీవ రాజుతో స్నేహం పెంపొందింప జేసుకో. నేను క్రమంగా మార్గాన్ని నిష్కంటకం చేసుకుంటూ అక్కడకు వస్తాను. అప్పుడు నువ్వు నాకూ సుగ్రీవునికీ స్నేహాన్ని యేర్పాటుచెయ్యి. ఆ తరువాత నేను రావణుణ్ణి అంతం చేసి అవతార కార్యాన్ని నెరవేరుస్తాను" అన్నాడు.

హనుమంతునికి తన ప్రభువును విడనాడి వెళ్ళడం యెంత మాత్రము యిష్టం లేదు. అయినా అతడు రామాజ్ఞను తలదాల్చి రామనామ స్మరణ చేసుకుంటూ ఋష్యమూకాద్రిని చేరుకున్నాడు

ఆ రోజులలో సుగ్రీవుడు తన అన్నగారైన వాలికి భయపడి తన మంత్రులతో ఋష్యమూకాద్రిపై నివసిస్తున్నాడు. హనుమంతుడు సుగ్రీవ మిత్రుడై ఉంటూన్నాడు, మహా బలపరాక్రమ సంపన్నుడై వాలిచే పంపబడ్డ వారెవరైనా వచ్చి తనపై దండెత్తుతారేమో అన్న భయంతో సుగ్రీవుడు సంచరిస్తూన్నాడు. శాప కారణంగా వాలి ఆ ప్రదేశానికి రాలేడు. ప్రియసఖుడైన హనుమంతునితోను

అన్యులతోనూ కూర్చుని సుగ్రీవుడు రాజకీయ విషయాలపై చర్చలు కొనసాగిస్తున్నాడు. అప్పుడు అకస్మాత్తుగా అతని దృష్టి పంపా సరోవరం వైపుకు పోయింది, అక్కడ దనుర్బాణధారులైన యిద్దరు వ్యక్తులు నిలబడి వుండడం అతడు చూశాడు. వారి మనోగతం అర్థం కావడం లేదు. కానీ వారి పోకడ చూస్తుంటే యెవరి కోసమో వారిద్దరూ వెదుకుతున్నట్లు మాత్రం ఉంది. వారి నడక వీర పరాక్రమోచిత దేహాలూ, వారు ధరించిన అస్త్రాలూ వల్కల వస్త్రాలూ జటలూ, చూచిన సుగ్రీవునికి సంశయం కలిగింది. దానితో అతడు హనుమంతుని దగ్గరగా పిలిచి, "ఆంజనెయా !ఆ వీర పురుషు లిద్దరూయెవరో తెలుసుకునిరా, శత్రు వర్గం వారైతే యిక్కడి నుండి పారిపోవాలి. మన సహకారాన్ని కోరి వస్తే వారితో స్నేహం చేసి ఒకరి కోరికను వేరొకరు నెరవేర్చుకోవచ్చును. నువ్వు బ్రహ్మచారి వేషంలో వెళ్ళి వారి వివరాలు తెలుసుకురా, వివరాలు తెలియగానే సంకేతం చెయ్యి". అనగా హనుమంతుడు సుగ్రీవాజ్ఞను శిరసా వహించి బయలు దేరాడు.

హనుమంతుడు సుందర బ్రహ్మచారి రూపంలో ఆ పురుషోత్తములను సమీపించి కుశల ప్రశ్నలు పూర్తి అయిన తరువాత అతడు వారిద్దరినీ అభినందిస్తూ-వారి పరిచయాన్ని గురించి ప్రశ్నిస్తూ మహనీయులారా! మీ దివ్యదేహకాంతినీ, శస్త్రాదులనూ చూడ మీరు మహావీరశూర పరాక్రమ సంపన్నులుగా గోచరమవుతున్నారు. మీ సుకోమల పాదార విందాలను సందర్శించ మీరు రాజమందిర వాసులని మీరు చెప్పకయే తెలుస్తున్నది. గతంలో యెన్నడూ వీరు కొండకోనలలో కానీ అరణ్యాలలో కానీ సంచరించ లేదనీ

తెలియ వస్తూన్నది. వేషాలను చూస్తూంటే మీరు ఋషికుమారులుగా కనబడుతున్నారు. నిశ్చయాత్మకంగా మాత్రం యేమీ చెప్పలేక పోతున్నాను. మీ దివ్య సుందర వదన సీమలనుండి బహిర్గత మవుతున్న తేజాన్ని సందర్శిస్తూ వుంటే మీరు సాధారణులు కాదనీ దివ్యులనీ సువ్యక్త మవుతున్నది. శివకేశవ ప్రజాపతులలో మీ రెవరు? నరనారాయణులేమోనని నాకు సందేహం కలుగుతున్నది. మీలో దివ్య భవ్యాకర్షణ గోచరిస్తూన్నది. మీ సౌందర్య మాధుర్యాలలో నా చిత్తం ముగ్ధమై పోతూన్నది. మీరు నాకు అత్యంత మమతాస్పదులుగా గోచరమవుతున్నారు. ఎన్నడో యెక్కడో గతంలో మీతో గడిపినట్లు నాకు స్ఫురణకు వస్తూన్నది. కరుణించి నా సందేహాలన్నిటినీ దూరం చెయ్యండి!" అని వినయంగా అర్థించాడు.

పవన సుతుని పలుకులు ఆలకిస్తూన్నంతసేపూ రామచంద్రుడు చిరునవ్వు నవ్వుతూనే వున్నాడు.తరువాత అతడు లక్ష్మణుని వైపు తిరిగి-"తమ్ముడూ! ఈ బ్రహ్మచారి అపార బుద్ధిశాలి. ఇతడు మాటలాడే తీరును తిలకిస్తూంటే - ఇతడు వేద వేదాంగాలను అధ్యయనం చేసినట్లు అవగత మవుతున్నది. సంస్కృత బద్ధమైన యితని సంభాషణలో కానీ, ఆకృతిలో కానీ కొంచమైనా దోషం కనిపించటం లేదు. ఏ మహారాజు దగ్గరనో యితడు మహామాత్యుడుగా ఉండ తగిన వాడే. స్పష్టమైన యితని ఉచ్చారణాధోరణీ, బుద్ధి కుశలతా,రెండూ గంభీరంగా, ప్రభావాన్ని కలిగించేవి గానే ఉన్నాయి" అని పలికి సంజ్ఞ చేయగా లక్ష్మణుడు హనుమంతుని వైపు తిరిగి - "బ్రాహ్మణోత్తమా! అయోధ్యను పాలించిన దశరథచక్రవర్తి మా తండ్రి. వారి ఆదేశానుసారం పద్నాలుగేళ్ళు వనవాసం చెయ్యాలని

వచ్చాము. ఇక్కడ మేము సంచరిస్తూండగా దుర్మార్గుడైన రాక్షసు డెవడో మా వదిన గారైన సీతాదేవిని అపహరించుకు పోయాడు. ఆమెను వెతుక్కుంటూ మేమిద్దరము బయలుదేరాము" అన్నాడు, లక్ష్మణుని మాటలు పూర్తికాకుండానే హనుమంతుని బ్రహ్మచారి రూపం మారిపోయింది. వానర స్వరూపంలో అతడు శ్రీరాముని పాదాలపై వాలిపోయాడు. అతడు తనలో "నేను మారు రూపాన్ని ధరించడం వల్లనే రామచంద్రుడు నాతో మాట్లాడ లేదు. నేనే నా స్వామిని గుర్తించలేక పోవడం వల్లనే ఆయన నన్ను గుర్తించ లేదు. నా ప్రభువుల పరిచయాన్ని నేను అడగడంతో వారు నన్ను వివరాలు అడిగారు. ఇదంతా నా కూట నీతికి ఫలమే. నేను మహాపరాధం చేశాను" అనుకుంటూ అతడు కనులనుండి జలాలు ప్రవహించ భగవానుని చరణాలపై బడి వేడుకో సాగాడు. భగవంతుడు అతణ్ణి లేవదీసి ఆలింగనం చేసుకున్నాడు.

అప్పుడు హనుమంతుడు రామచంద్రునికి వినయంగా నమస్కరిస్తూ- "ప్రభూ ! మా సుగ్రీవ రాజు ఆపదలో చిక్కు కున్నాడు. తమరు తప్ప అతనికి సాయపడ గల వారు యీ భూమండలంలో మరెవ్వరూ లేరు. ఆపదలో ఉన్న అతణ్ణి ఆదుకొని ధైర్యం చెప్పి అతని సేవలను తమరు స్వీకరించండి". అంటూ ఆనందమగ్నుడై అతడు రామ లక్ష్మణులను తన భుజాల మీద యెక్కించుకుని సుగ్రీవుని సమీపానికి తీసుకు వెళ్ళాడు. వెంటనే రామ సుగ్రీవులకు మైత్రి యేర్పడింది. అగ్నిని సాక్షిగా పెట్టుకుని వారు మైత్రిని యేర్పరచుకున్నారు. వాలి మరణించాడు. సుగ్రీవుడు వానరులకు రాజు అయ్యాడు. రామలక్ష్మణులు నాలుగు నెలల వరకూ ప్రవర్షణ పర్వతం మీదనే నివసించసాగారు. విషయ

వాసనలలో మునిగి సుగ్రీవుడు శ్రీరామకార్యాన్ని మరచి పోయాడు. కానీ ప్రభు కార్యాన్ని హనుమంతుడు యేల మరువగలడు? అనేక మార్లు అతడు సుగ్రీవునికి నచ్చ చెప్పాలని ప్రయత్నించాడు. కానీ సుగ్రీవుడు వినిపించుకో లేదు. అతడు స్వకార్యంలో సంలగ్నుడై వున్నాడు. సుగ్రీవుడు ఉపేక్షించడం చూసి లక్ష్మణుడు మహా కోపంతో రావడం చూసి తార అతనికి నచ్చచెప్పసాగింది. అంతలోనే హనుమంతుని ద్వారా పిలువబడ్డ అపార వానర భల్లూక సైన్యాలు వచ్చి చేరాయి. ఆ ప్రయత్నాల్ని చూసి లక్ష్మణుడు సుగ్రీవుని విషయమై ప్రసన్న చిత్తుడయ్యాడు. అంత సుగ్రీవుడు రామ సన్నిధి చేరి తన అపరాధాన్ని మన్నించ వలసిందిగా ప్రార్థించాడు. ఆపై శ్రీరామ సన్నిధిలో అతడు దేశదేశాంతరాలను వర్ణించి వానరులను – సీతను వెదికి రమ్మని పంపాడు. రావణాసురుడు జానకీ దేవిని అపహరించాడని మాత్రమే తెలిసింది. కానీ అతడామెను యెక్కడ దాచినదీ తెలియలేదు. కనుకనే వానరులను దశ దిశలకూ పంపడం జరిగింది. తద్వారా వారు వివిధ ప్రదేశాలలో ఉన్న వానరులను సమీకరించడమూ జరుగుతుంది, సీత జాడ తెలుస్తుంది. సుగ్రీవుడు వానరులను శాసిస్తూ నెలలోగా నిర్దిష్ట స్థానాలను వెదికి తిరిగి రానివారు కఠిన శిక్షలకు పాత్రు లవుతారు. జాగ్రత్త! అనడంతో వారందరూ నియమింపబడ్డ స్థానాలకు బయలు దేరారు.

దక్షిణ దిక్కును వెదికే పని అన్నిటి కంటె గొప్పది. అందులకే సుగ్రీవరాజు ముఖ్యవానర వీరులయిన జాంబవంత, హనుమంత అంగద. నల. నీలాదులను పిలిచాడు. వారు రాగానే హనుమంతుని తనకు దగ్గరగా కూర్చో బెట్టుకుని – "ఆంజనేయా! జల, స్థల, ఆకాశాలలో నీ గమనం ఆటంకం లేనిదే. స్వర్గంలో కూడా నువ్వు

సునాయాసంగా సంచరించగలవు. గమన, వేగ. తేజ, స్ఫూర్తులలో నువ్వు నీతండ్రితో సరిసమానుడైన వాడవు. నీకు తెలియనిది యెమీ లేదు. నీతో యేమి చెప్పాలి? కేవలం ఆయా స్థానాలను గాలించి రావడం కాదు. నువ్వు సీత జాడ తెలుసుకొని రాగలవని నాకు పూర్తి నమ్మకం ఉంది" అన్నాడు.

సుగ్రీవుని పలుకులు విని శ్రీరామచంద్రుడు హనుమంతుని చేర బిలచి - "హనుమా ! నువ్వు నా పనిని తప్పక చెయ్యగలవు - ఇదిగో నా వేలి ఉంగరం-దీనిని తీసుకు వెళ్ళు. దీనిని చూడగానే నువ్వు నా దూతవని సీత గ్రహిస్తుంది". అంటూ సీతతో చెప్ప వలసిన సందేశ వచనాలను కూడ చెప్పాడు. అంత హనుమదాది వానర వీరులందరూ రామునికీ, సుగ్రీవునికీ నమస్కరించి బయలు దేరారు.

సీతకై వెదికి వెదికి హనుమంత, జాంబవంత అంగదాది వీరులందరూ అలసి పోయారు. ఆకలి దప్పికలతో బాధపడి పోతూన్నారు, నీళ్ళు యెక్కడున్నదీ వారికి తెలియడం లేదు. చాల రోజులుగా పళ్ళు కూడ దొరకడం లేదు. భారం అంతా హనుమంతుని పై బడింది. కొండశిఖరం పైకి యెక్కి హనుమంతుడు చూడగా దగ్గరలో పచ్చదనం కనిపించింది. అందమైన పక్షులు తమ రెక్కలతో నీళ్ళు జల్లుకుంటూ రావడం కనిపించింది. సమీ పంలోనే ఉద్యానవనంలో సరోవరం ఉండవచ్చును" అనుకున్నాడు. అందరినీ వెంటబెట్టుకుని వారు అలావెళ్ళి చూడగా ఓ గుహలో నుండి పక్షులు బయటకు వస్తున్నాయి. ఒకరి బుజాలు వేరొకరు పట్టుకుని రామ నామాన్ని స్మరించుకుంటూ ఆ గుహలో

ప్రవేశించారు. అత్యంత సుందరమై పరమ రమణీయమైన ఆగుహాం తర్భాగంలో వున్న సరోవర జలాలు అమృతంలా ఉన్నాయి. బంగరు కాంతులతో తళ తళ లాడే చెట్లూ వాటిపై మధురాతి మధురమైన పళ్లూ ఉన్నాయి. అక్కడే ఉంటూన్న "స్వయంప్రభ" అన్న తపస్విని యొక్క అంగీకారంపై వారందరూ ఆకలిదప్పికలను తీర్చుకుని ప్రశాంతంగా కూర్చున్నారు. తపస్విని అయిన స్వయంప్రభ అడుగగా హనుమంతుడు తమ సమాచారమంతా చెప్పాడు. తరువాత తమను యెంత త్వరగా బయటకు పంపితే అంత మంచిదన్నాడు. అప్పుడు స్వయంప్రభ వారితో యిలా అంది-"సోదరులారా ! ఇంతవరకు యిక్కడకు వచ్చినవారు యెవరూ ప్రాణాలతో బయట పడలేదు. ఎట్టి ఆటంకాలూ లేకుండా తపస్సు చేసుకునే యేకాంత ప్రశాంత స్థానం యిది. జనులు యిక్కడకు వచ్చి పోతుంటే తాపసులకు ఆటంకం కలుగుతుంది. కానీ మీరు శ్రీరామ కార్యార్థం వచ్చినవారు. కనుక మిమ్మల్ని నా తపశ్శక్తితో బయటకు పంపుతాను. నేను కూడ శ్రీరామచంద్రులను చూడడానికి ప్రవర్షణ పర్వతం దగ్గరకు వెళ్ళవలసి వుంది. మీరందరూ కళ్ళు మూసుకోండి" అంది. అందరూ వెంటనే కళ్ళు మూసుకున్నారు. క్షణంలో వారందరూ సముద్రపు వొడ్డున వున్న పెద్ద పర్వతం మీద నిలబడ్డారు. అంత స్వయంప్రభ వారి దగ్గర సెలవు తీసుకుని శ్రీరామ సన్నిధికి వెళ్ళిపోయింది.

తత్సమయంలో అంగదుడు వానర వీరుల వైపు చూస్తూ "సోదరులారా! మనం బయలుదేరి నేటికి పూర్తిగా నెల గడచి పోయింది. ఇంత వరకూ మనం సీతాదేవి వివరాలను తెలుసు కోలేదు. సరికదా? పోవలసిన స్థానాలకు యింకా పోనేలేదు.పనిని

పూర్తి చేసుకోకుండా తిరిగినే వెడితే సుగ్రీవరాజు తప్పక నన్ను అంతం చేస్తాడు. అందువల్ల నేను యిక్కడే వుంటూ తపస్సు చేసుకుంటాను. మీరు వెళ్ళండి "- అని దీనంగా పలికాడు.

ఆ మాటలు విని హనుమంతుడు అంగదునికి ధైర్యం చెబుతూ- "యువరాజా! సుగ్రీవరాజు నీపై విశేష ప్రేమాభిమానాలతో వుంటున్నాడు. శ్రీరామ కార్యంలో మీరందరూ దత్తచిత్తులై వున్నారు. గుహలోకి వెళ్ళడం వల్ల మనకు ఆలస్యమయింది. ఇందుకు ఆయన తప్పకుండా క్షమిస్తాడు. నిన్ను తప్పక రాజును చేస్తాడు. భయపడవలసిన పని లేదు. శ్రీరామచంద్రుడు అపార దయా సముద్రుడు. ఆయన సర్వకాల సర్వావస్థలలోనూ నిన్ను సంరక్షిస్తూ వుంటాడు. శక్తి వంచన లేకుండా మనం రామసుగ్రీవుల ఆజ్ఞలను పాలిద్దాము. ఒకవేళ సుగ్రీవునిపై గల ద్వేషం కారణంగా అతడు రాజు అవడం నీకు యిష్టం కాకపోతే యెక్కడా కూడ నువ్వు సురక్షితంగా మాత్రం ఉండ లేవు. రామకార్యాన్ని నెరవేర్చకుండా నువ్వు తప్పించుకుని తిరగదలిస్తే నువ్వెక్కడున్నా లక్ష్మణస్వామి యొక్క తీవ్రబాణాలు నిన్ను ప్రాణాలతో విడిచి రామకార్యాన్ని పూర్తిచేయకుండా బ్రతకడం కంటె వారి సన్నిధానానికి వెళ్ళడమే మంచిది. వారి యిష్టప్రకారమే జరగనివ్వడం చాల మంచిది". అనడంతో అంగదుడు ప్రాణాలపై గల ఆశను వదులుకున్నాడు. సుగ్రీవుని దగ్గరకు మరలి వెళ్ళడం కంటె నిరాహారంగా ఉండి ప్రాణాలను విడనాడడానికే నిశ్చయించుకున్నాడు. అతనితో బాటు మిగిలిన వారు కూడ దీక్ష ప్రారంభించారు.

అప్పుడే వారికి జటాయువు సోదరుడైన సంపాతి కనిపించాడు. వానరభల్లూకాలన్నీ సముద్రతీరంలో సమావేశమయ్యాయి. "సముద్రాన్ని దాటగలవారెవరు? అన్న విషయమై చర్చ ప్రారంభమయింది. అందరికందరూ తమతమ పరిమిత శక్తులను గురించి చెప్పి అసమర్థతను వివరించారు. "నేను సముద్రాన్ని దాటి వెళ్ళగలను. కానీ మరలి రాగలనో లేదో అన్న సందేహముంది. అన్నాడు అంగదుడు. జాంబవంతుడు అతణ్ణి యువరాజుగా గౌరవించి అతడు వెళ్ళడానికి వొప్పుకో లేదు. పైగా వార్ధక్యం కారణంగా తానూ పోలేను అన్నాడు.

అంతవరకూ హనుమంతుడు అందరి మాటలూ వింటూ మౌనంగా ఓ మూల కూర్చున్నాడు. అంగదుడు నిరాశ చెందాడు, అంత జాంబవంతుడు అంగదుని వైపు చూస్తూ–"యువరాజా ! నిరాశ చెంద నవసరం లేదు. సముద్రాన్ని దాటడానికి కావలసింది కేవలం శారీరిక బలమేకాదు. కావలసినది అపారమైన బుద్ధిబలం కూడా. ఈ పనిని పూర్తి చేయడానికి సాక్షాత్తు రుద్రభగవానుడే అవతరించి ఉన్నాడు. రావణాది దుష్టరాక్షస సంహారం అత్యవసరమైనది" అంటూ అతడు హనుమంతునివైపు తిరిగి–"ఆంజనేయా! నువ్వు మౌనంగా యెలా కూర్చోగలిగావయ్యా. నీవు జన్మించినది రామకార్యార్థమే కదా ! పవనతనయా! నువ్వు నీ తండ్రి వలె క్షణంలో యీ సముద్రాన్ని దాటివేయగలవు. నీ బుద్ధి అపారమైనది. వివేక, జ్ఞానసాగరుడవైన నువ్వు యింత బలాన్ని నీలో దాచుకుని యెలా కూర్చోగలిగావు?" అని పలికి అతడు ఆంజనేయుని జన్మ, దేవతలు వరాల నివ్వడం, ఋషులు శపించడం ఆదిగాగలవన్నీ వినిపించి, జ్ఞాపకానికి తెచ్చి– "మారుతీ! నువ్వు తలుచుకుంటే యేమైనా చెయ్యగలవు" అన్నాడు.

# సముద్రోల్లంఘనం

పవన తనయుడు సదా సర్వదా రామస్మరణలోనే సంలగ్నమై వుండే వాడు. అతనికి తన బలపరాక్రమ స్మరణ లేనే లేదు. జాంబవంతుని మాటలు వినేసరికి అతనికి తనలో అపారమైన శక్తి వున్నదనీ, భగవంతుని శక్తి అంతా తనదేననీ అనిపించ సాగింది, అతడు వెంటనే గర్జిస్తూ– "ఈ సముద్రం దాటడమన్నది నాకు ఓ లెక్కా? రాముని దయల్ల నేను యిలాంటి అనేక సముద్రాలను దాటివేస్తాను. లంకలో నాకు సీతామాత కనిపించకపోతే స్వర్గం మొదలు బ్రహ్మలోకం వరకూ వెదుకుతాను. లంకా సమేతంగా త్రికూట పర్వతాన్ని యెత్తుకువస్తాను. రావణుణ్ణి అంతం చేసి వేస్తాను. రామ కార్యాన్ని సాధించే నా దారికి యెవరూ ఆటంకాన్ని కలిగించ లేరు". అంటూ హనుమంతుడు చేసిన గర్జనలతో కూడిన గంభీర వచనాలను ఆలకించిన వానర సేన అంతా ఒక్కుమ్మడిగా ఆనందంతో నాట్యం చేసింది. "ఆంజనేయా! నువ్వు మహావీర శూర బలపరాక్రమ శాలివి. నువ్వేమైనా చెయ్యగలవు. నువ్వు సీతామాతను చూసి రావాలి. శ్రీరామప్రభువుతో మనమందరం లంకకు చేరి రావణ సంహారం చేద్దాము. రామచంద్రునికి కీర్తి కలుగుతుంది. మనమందరం ఆనందోత్సవాలు చేసుకుందాము" అన్న జాంబవంతుని మాటలు ఆలకించి హనుమంతుడు లేచి ఓ మహోన్నత పర్వత శిఖరాన్ని యెక్కాడు. అతని పాద ఘట్టనలకు పర్వత శిఖరాలు విరిగి పడిపోసాగాయి. అతని వాల విక్షేపాలకు పెద్ద పెద్ద చెట్లు ఆకాశంలో యెగిరిపోసాగాయి. అందులో అసంఖ్యాక పుష్పాలు హనుమంతుని పూజిస్తున్నాయా! అన్నట్లు పడసాగాయి.

దేవతలు "జయ జయ" నాదాలు చేశారు, మహర్షులు శాంతి పాఠాలు వల్లించ సాగారు. వాయుదేవుడు అండగా సహకరించగా హనుమంతుడు సముద్రాన్ని దాటడానికి పైకియెగిరాడు. రామ పరమాత్మను స్మరించు కుంటూ అతడు వానరులకు అందరికీ ధైర్యాన్ని చెప్పాడు. "సోదరులారా! మహోత్సాహంతో మహానందంగా నా మనస్సు భగవంతుని అపార దయానుభవాన్ని పొందుతున్నది, కార్యాన్ని సాధించుకుని నేను వెంటనే తిరిగి వస్తాను, మీ రెంతమాత్రం భయపడ నవసరం లేదు". అంటూ అతడు మరల భగవన్నామాన్ని స్మరించుకుంటూ బయలుదేరాడు. మేఘ సమూహం అతని కఠోర వజ్ర సమమైన దేహ స్పర్శకు చెల్లా చెదరై అతనిపై చల్లటి నీటి బిందువులను వర్షించింది. ఏకాగ్రచిత్తుడై అతడు ఆకాశ మార్గంలో ముందుకు దూసుకుపోతున్నాడు. మారుత తుల్యవేగంతో ముందుకు అలాపోతున్న హనుమంతుని చూసి సముద్రుడు తనలో యిలా అనుకున్నాడు-రామచంద్రుని పూర్వీకులే నాకు యీ స్వరూపాన్ని ప్రసాదించి వున్నారు. నేటి వరకూ నేను వారికి యేవిధమైన ప్రత్యుపకారమూ చెయ్యలేక పోయాను. సీతాదేవిని అపహరించుకు పోవడంలో నాకు కూడ సంబంధం ఉన్నదని శ్రీరామచంద్రుడు అనుకో రాదు. ఏమంటే ఓ విధంగా రావణుడు నా లోపలే ఉంటూన్నాడు. అతని కోటకు నేను కందకంగా వున్నాను, కనుక నేనీ రామసేవకునికి స్వాగతం పలికి అతని విశ్రాంతికై యేదేని ఉపాయం ఆలోచించ గలిగితే సురక్షితుడనై చేసిన మేలు మరువని వాడనవుతాను". అనుకుని అతడు మైనాకుణ్ణి పిలిచి- "మైనాకా! శ్రీరామసేవకునికి స్వాగతం చెప్పు". అన్నాడు. అప్పుడు మైనాకుడు విశాలమైన రూపాన్ని

ధరించి సముద్రం పైకి వచ్చాడు. అదేదో ఆటంకమని తలచి తన కాంతితో అతణ్ణి పాతాళ లోకంలోకి అణచి వెయ్యాలని హనుమంతుడు మహా వేగంతో తనవైపుకు రావడం చూసి మైనాకుడు మనుష్య రూపాన్ని ధరించి శిఖరం మీద నిలబడి వినయంగా "ఆంజనేయా! నీ తండ్రి అయిన వాయుదేవుడు నాకు మహోపకారం చేశాడు. తన వజ్రాయుధంతో మహేంద్రుడు మా పర్వతాల రెక్కలు నరికే సమయంలో నీ తండ్రి సహాయంతో నేనీ సముద్రంలో రహస్యంగా దాక్కున్నాను. నేను నీకు విశ్రాంతి నివ్వాలను కుంటున్నాను. నాపై విశ్రమించి అలసటను తొలగిం చుకుని ముందుకు వెళ్ళు. రామకార్యం ప్రపంచ కార్యమే కదా! రామసేవకుడవైన నిన్ను సేవించడమంటే యావత్ విశ్వాన్నీ సేవించడమే అవుతుంది. నా కోరికను మన్నిస్తావను కొంటున్నాను" అన్నాడు. అంత హనుమంతుడు సాదరంగా మైనాకుని స్పృశించి- "మైనాకా! నువ్వు నాపై చూపిన ప్రేమాభిమానాలకు నేను చాల సంతోషించాను. తండ్రిలా నువ్వు నాకు గౌరవనీయుడవే. నేను నీ ఆదేశాన్ని పాలించ వలసినదే, కానీ నేనిప్పుడు రామకార్యార్థినై వెడుతూన్నాను. నా మనస్సు శ్రీరామకార్యంలో పరిపూర్ణంగా లగ్నమై పోయింది. అలసట తీర్చుకోవడం కోసం నేనిక్కడ ఆగినా, నా మనస్సు నా దేహాన్ని విడనాడి లంకకు పోతుంది. క్షణకాలం కూడ నేనిక్కడ నిలవలేను. నన్ను క్షమించు. "హనుమంతుడు మహావేగంతో ముందుకు యెగరి పోసాగాడు.

శరీర బలం హనుమంతునిలో అపారంగా ఉన్నదన్న సంగతి తెలిసిన దేవతలు అతని బుద్ధిబలాన్ని కూడ పరీక్షించాలని - నాగమాత అయిన సురసను పంపారు. ఆమె వస్తూనే మారుతి

మార్గానికి అడ్డంగా నిలబడి బిగ్గరగా – దైవకృప వల్ల నాకు భోజనం దొరికింది. తనివి తీరా తింటాను". అంది. ఆమెకు సమాధానమిస్తూ హనుమంతుడు "నేను రాముని పనిమీద వెడుతూన్నాను. ఆ పని పూర్తికాగానే వచ్చి నీకు ఆహార మవుతాను. నేను మృత్యువుకు యెంత మాత్రం భయపడను". అని అతడు యెన్ని విధాల చెప్పినా సురస వినలేదు. ఆమె అతణ్ణి మ్రింగి వేయాలని నోరు తెరచింది. ఆమె తెరచిన దానికి రెట్టింపుగా మారుతి తన దేహాన్ని పెంచాడు. ఆమె వంద యోజనాలు నోటిని పెంచేసరికి అతడు సూక్ష్మ దేహాన్ని ధరించి ఆమె నోటిలో దూరి బయటకు వచ్చేశాడు, హనుమంతుని బుద్ధి కుశలత్వానికి సురస ప్రసన్నురాలయింది. అతడు వెళ్ళేపని నెరవేరాలని ఆశీర్వదించి మాయమై పోయింది. అదే సముద్రంలో రాహువు యొక్క తల్లియైన సింహికా రాక్షసి నివసిస్తూ పై నుండి యెగిరేప్రాణుల నీడ సముద్రం మీద పడగానే ఆ నీడనే పట్టుకుని తనవైపుకు లాగి అంతం చేస్తూంటుంది. అలా యెందరో హతమై పోయారు. రామదూత విషయంలో కూడా సింహిక అలానే చేయ సాగింది. తన నడకకు ఆటంకం కలగడం చూసి హనుమంతుడు క్రిందకి చూసి ఆ రాక్షసిని గుర్తించాడు. మహాబల పరాక్రమశాలి అయిన ఆ వజ్రాంగుని ముందు ఆ నీచ రాక్షసి నిలవగలదా? ఒకే ఒక గుద్దుతో హనుమంతుడు ఆ రాక్షసిని నేలకూల్చి వేశాడు, వెంటనే అతడు యెట్టి ఆటంకం లేకుండా సముద్ర తీరానికి చేరుకున్నాడు.

అక్కడి మనోహరమైన వనంలో పచ్చటి చెట్లూ, సువాసన లీనే పువ్వులూ పక్షులు చేసే మధుర నాదాలూ, తుమ్మెదలు చేసే ఝుంకారాలూ–ఆదిగా గల వాటితో అక్కడ శ్రవణ నయ

నానందకరంగా ఉంది, కానీ హనుమంతుడు తన దృష్టిని అయ్యాకర్షణలవైపు పోనీయనే లేదు. ఒక్కదూకులో ఓ కొండశిఖరం యెక్కి కూర్చున్నాడు. అది తనకు శిబిరంగా బాగున్నదనుకున్నాడు. తియ్యటి జలాలున్నాయి. విశేషం యేమంటే అక్కడ కూర్చుని చూస్తే లంక అంతా కనిపిస్తుంది. అది తెలిసిన ఆ రామదూత అక్కడ కూర్చునియే లంకలోని అనేక విషయాలను అర్థం చేసుకున్నాడు. ప్రవేశించడానికి వీలులేని లంకకు సంబంధించిన సమస్త విషయాలూ తెలుసుకున్నప్పుడే సీతాదేవి జాడ తెలుస్తుంది- అని నిశ్చయించు కున్నాడు. విశాలమైన ఆకారంతో లంకానగరంలో ప్రత్యేక విషయాన్నీ అర్థం చేసుకోవడం కుదరని విషయం కావడం వల్ల ఆ సిద్ధుడు అణిమా సిద్ధిని ప్రయోగించాడా? అన్నట్లు సూక్ష్మ రూపాన్ని ధరించి లంకానగరం యొక్క ప్రముఖ ద్వారం దగ్గరకు వచ్చాడు. లంకానగరానికి లంకిణి అధిష్టానదేవి. సాయం సమయంలో రహస్యంగా వానరుడొకడు ప్రవేసిస్తూండడం చూసి సందేహంతో ఆమె హనుమంతుని దగ్గరగా వచ్చి గద్దిస్తూ-"నువ్వు దొంగతనం చేయదలచు కున్నావా?" అని ప్రశ్నించింది. దానితో రామ దూత క్రోధావేశంతో బలం కొద్దీ ఆమెను ఓ గుద్దు గుద్దాడు. దానితో ఆమె రక్తాన్ని కక్కుకుంటూ నేల మీద పడిపోయి మరల తేరుకుని లేచి-"మహావీరా! నువ్వు లంకానగరంలోకి యే విధమైన ఆటంకం లేకుండా వెళ్ళు. నేను నిన్ను గుర్తుపట్టాను. చాలకాలం క్రితమే బ్రహ్మదేవుడు నన్ను చూసి - ఓ వానరుని చేత దెబ్బతిన్న సమయంలో రావణాసురునికి అంతం సమీపించిందని తెలుసుకోఅని నాకు చెప్పి వున్నాడు" అని లంకిణి పలకగానే హనుమంతుడు లోపల ప్రవేశించాడు. ఆ లంకా నగరంలో ప్రవేశించి- రాక్షసుల

ఆహార, విహార, శయన, శస్త్రాగార, ఆలోచనా మందిరాలను అన్నింటినీ నిశితంగా పరిశీలించాడు. సీతాదేవి జాడ తెలుసుకోవాలని రావణాసురుని అంతఃపురాన్ని కూడ వెతికాడు. మండోదరి ఆదిగాగల రావణుని భార్యలను చూశాడు. కానీ సీతామాత మాత్రం అతనికి కనిపించ లేదు. దానితో ఆతనికి చాల వేదన కలిగింది. చెప్పలేని బాధను అనుభవించ సాగాడు.

అతడు తనలో తానిలా అనుకోసాగాడు "నేను ధర్మాన్ని అతిక్రమించ లేదు కదా! పరకాంతలను చూడడం అధర్మమే. నేనింత వరకూ యేలాంటి పాపమూ చెయ్య లేదు.నేడు నా ద్వారా మహాపరాధం జరిగింది". అని అతడు విచారసముద్రంలో మునిగి పోయాడు. మరుక్షణంలో అతని మనస్సులో మరోభావం కలిగింది. ఆ సమయంలో దైవస్మరణ వలన అతని హృదయం పరిశుద్ధమైనది. అతడొక నిశ్చయానికి వచ్చాడు. ఇంద్రియాల శుభాశుభ ప్రవృత్తికి కారణం మనస్సే. అత్యవసరాన్ని బట్టి కార్య సాధనకోసం నేను పరకాంతలనుచూశానే కానీ నా మనస్సులో యేలాంటి వికారమూ లేదు. నా మనస్సు స్థిరంగా పవిత్రంగానే ఉంది. సీతాదేవిని నేను స్త్రీసమూహంలో కాక మరెక్కడ చూడగలను? అత్యంత పవిత్రమైన మనస్సుతోనే నేను వారిని తిలకించాను.కనుక యీ విషయంలో నాదోషం యెంతమాత్రం లేదు. అని దృఢమైన మనస్సుతో హనుమంతుడు యితరేతర స్థానాలను కూడ వెతక సాగాడు.

ముందుకు సాగగా అతనికి ఓ చిన్న కుటీరం కనిపించింది, దాని గోడలపై సర్వత్రా రామనామం కనుల విందుగా వ్రాయబడింది. మణుల ధగధగ కాంతులు కారణంగా ఆ రామ నామాలు రాత్రులలో

కూడ చక్కగా స్పష్టంగా కనిపిస్తున్నాయి. అక్కడే బారులు బారులుగా తులసి మొక్కలున్నాయి. కేసర ఆదిగా గల సుగంధిత పుష్పాలువున్నాయి. ఆ పర్ణ కుటీరానికి యెదురుగా ఓ చిన్న దేవాలయం ఉంది. "లంకలో యిలాంటి ప్రదేశమా?" అన్న భావం కలగడంతో హనుమంతునికి ఆశ్చర్యానందాలు కలిగాయి. తూర్పు తెల్లవారబోతుండగా విభీషణుడు లేచి "శ్రీరామ జయరామ జయజయరామ" అంటూ రామచంద్ర పరమాత్మను స్మరించ సాగ్గాడు. "ఈ రామభక్తుడెవరా?" అనుకుంటూ హనుమంతుడు బ్రాహ్మణ వేషాన్ని ధరించి తానుకూడ విభీషణుని స్వరంతో స్వరం కలిపి రామనామం చెయ్యసాగాడు. బ్రాహ్మణోత్తముని చూస్తూనే విభీషణుడు బయటకు వచ్చాడు. ఒకరినొకరు పరిచయం చేసుకున్నారు, ఆ తరువాత ఆ భగవత్ భక్తు లిద్దరూ గాఢంగా ఆలింగనం చేసుకున్నారు. విభీషణునిలో హనుమంతునకు శ్రీరామ పర మాత్మ కనిపించాడు. విభీషణుడు మారుతిని సాక్షాత్తూ భగవంతునిగానే భావిస్తూన్నాడు. తనను గుర్తించి విభీషణునకు చెప్పుకో వలసిన దేమీ లేదు, కరుణాసముద్రుడైన శ్రీరామ చంద్రుని సమాచారాన్నీ, సీతాపహరణ విషయాన్నీ వివరించి చెప్పాడు. అప్పుడు విభీషణుడు వినయంగా మాట్లాడుతూ– హనుమా! కఠోర దంతాల మధ్య వున్న నాలుక వలెనే నిక్కడ వుంటూన్నాను. అసురుడనైన నన్ను శ్రీరామ ప్రభువు యేనాటికైనా తన వాణ్ణిగా చేసుకుంటాడా? కామ ప్రవృత్తి గల జాతిలో నేను పుట్టాను. ఎలాంటి సాధనా చెయ్యలేక పోతున్నాను. శ్రీరామపరమాత్మ పాదకమలములపై నాకు అపారమైన శ్రద్ధ, భక్తి, ప్రేమలున్నాయి, రామప్రభువు నాకు తప్పక లభిస్తాడని

ఆశించవచ్చునా? నిన్ను చూస్తూంటే నాకు ఆశకలుగుతూ దృఢ మవుతున్నది. భగవంతుని దయలేనిదే నీ వంటి మహాత్ములయిన సజ్జనుల సాంగత్యం కలగదు. దైవకృప వల్లనే భక్తులలో గొప్పవాడవైన నీ స్నేహం లభించింది. భగవంతుని దర్శనం లభించబోయే ముందు సజ్జనుల సాంగత్యం యేర్పడుతుంది" అంటాడు.

అప్పుడు హనుమంతుడు బదులుపలుకుతూ అంటాడు– "విభీషణా శ్రీరామ పరమాత్మ పరమ దయాళుడు. అతడు సదాసర్వదా దీనులపై దయచూపుతూనే ఉంటాడు. నువ్వు నీ గురించి అంతా చెప్పావు. నా గురించి ఆలోచించు. వానరుణ్ణి. చాంచల్యమే మా జాతికి సహజ స్వభావం ఏ విధమైన సాధనా లేని వాణ్ణి. పరోపకార విషయం అలా ఉంచగా, ఉదయసమయంలో మా వానర నామాన్ని తలచిన వారికి భోజనం దొరకదు, మిత్రుడా విభీషణా! నేను వానరజాతివాడనైనా రామప్రభువు నాపై దయ చూపించాడు. అట్టి ప్రభువును గురించి తెలిసి కూడ సేవించని వారు సంసార సముద్రంలో పడి కొట్టుకు పోతారు. అలాంటి వారు దుఃఖించి లాభమేముంది?" అంటూ శ్రీరామపరమాత్మ యొక్క సద్గుణాలను స్మరించుకుంటూన్న హనుమంతుని నయనాల నుండి ఆనంద బాష్పాలు జల జల రాలాయి. ఆ రీతిగా వారిద్దరి మధ్యా చాల సేపు సంభాషణ జరిగింది. విభీషణుని సూచనానుసారం హనుమంతుడు అశోకవనం వైపుకు వెళ్ళాడు.

అశోకవనంలో శ్రీరామపత్ని అయిన సీతామాత 'శింశుప' అనే చెట్టు క్రింద దీనంగా కూర్చున్నది. ఆమె దేహం వాడిపోయి

నీరసించి వుంది తల వెంట్రుకలు పెనవేసుకు ఉన్నాయి. తలపై సౌభాగ్యానికి గుర్తుగా యెకవేణి ఉంది, ఆమె శ్రీరామ భగవన్నామాన్నీ, లీలలనూ తలచుకుంటూ వుంది. దూరం నుండియే హనుమంతుడు ఆమెకు మనసా నమస్కారం చేశాడు. అతి సూక్ష్మరూపంలో శింశుపమనే ఆ చెట్టునెక్కి కూర్చున్నాడు. ఆదే సమయంలో రావణుడు సీతను స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నం చెయ్య సాగాడు. సామదానభేదోపాయాలు వుపయోగించాడు. చిట్టచివరకు గర్జిస్తూ భయంకరంగా పలికాడు. కానీ ఆమె పవిత్రత్వంలో రామ నిష్ఠలో, సతీత్వంలో అగ్రస్థానాన్ని అలంకరించి వున్న ఆ మహాసధ్వి ముందు ఆ రాక్షసుని ప్రయత్నాలు నెరవేరుతాయా? ఎంతో మంది రాక్షస స్త్రీలు ఆమెను రావణ వశవర్తినివి కావలసినదని బాధించ సాగారు. వారి అప్రియ కఠోర కర్కశ వచనాలు ఆమెకు తీవ్రమైన బాధను కలిగించ సాగాయి. భర్త జాడ తెలియక పోవడంతో ఆమెకు అనేక సందేహాలు కలగసాగాయి. ఇక తాను బ్రతికి వుండడం అసంభవమనుకున్నది. అంత త్రిజట అనే రాక్షస స్త్రీ తనకు వచ్చిన కలను గురించి సీతకు చెప్పి ఆమెకు ధైర్యం చెప్పింధి. రాక్షస స్త్రీలందరూ అక్కడ నుండి వెళ్ళిపోయారు, కొన్ని క్షణాలకు త్రిజట కూడ వెళ్ళి పోయింది.

చెప్పలేని బాధతో ఆత్మహత్యకు సంసిద్ధమవుతున్న సీతాదేవిని చూసి హనుమంతుడు సమయం కనిపెట్టి-రాముడు పుట్టినది మొదలు, సీతను పెండ్లాడడం, అరణ్యావాసం, సీతాపహరణం ఆదిగాగల సమాచారాన్ని చెట్టుమీద నుండియే చెప్పి చిట్ట చివరగా- "అమ్మా ! నేను శ్రీరామ ప్రభువులు పంపగా వచ్చాను". అన్నాడు. హనుమంతుని మధురాతి మధురమై అమృతంతో సమానమైన

పలుకులు విన్న జానకీ దేవికి మహానందం కలిగింది. "ఇది రాక్షసమాయ కాదు గదా!" అన్న సందేహం ఆమెకు మరుక్షణంలోనే కలిగింది. అది గ్రహించిన హనుమంతుడు– "అమ్మా ! నేను రామచంద్రుల పాద కమలాలు సాక్షిగా శపథం చేసి చెబుతున్నాను, నేను ఆ పరమాత్మ దూతను. మీకు నమ్మకం కలగడం కోసం ప్రభువులు నాకు ఓ రహస్యమైన కథను చెప్పారు. మీరు అడవిలో ప్రభువులతో వున్న సమయంలో జయంతుడు కాకిరూపంలో వచ్చి మిమ్ము బాధించడం చూసి శ్రీరామచంద్రులు వారు అతని పై ఇషీకాస్త్రాన్ని ప్రయోగించారుట, ముల్లోకాలలోను వానికి యెవరూ శరణివ్వలేదట, చిట్టచివరకు ప్రభువులే దయతలచి వాణ్ణి ఒంటికంటి వాణ్ణిగా చేసి విడిచి పెట్టారట. అంతే కాక ఆ దయామయుడు మీకు ఆనవాలుగా నాకు ఓ వుంగరాన్ని యిచ్చారు. మీరు నన్ను నమ్మండి. నేను మీ పాదాలు పట్టుకుంటున్నాను" అన్నాడు. నిజానికి హనుమంతుని హృదయం నిర్మలమైనది. అతడు నిజమైన ప్రమాణం కూడా చూపించాడు, దానితో సీతాదేవికి నమ్మకం కలిగింది, ఆమె పవతనయుని క్రిందకు దిగి రమ్మన్నది, రామ నామాం కితమైన వుంగరాన్ని చూసి ఆమె మహానందమగ్నురాలై పోయింది. శ్రీరామ సందేశాన్ని ఆలకించిన ఆమెకు ప్రాణాలతో సమానుడైన అంతకన్నా అధికు డైన రామప్రభువే లభించినంతటి ఆనందం కిగింది. అప్పుడ మె హనుమంతుని వైపుచూస్తూ–"ఆంజనేయా ! నువ్వు [illegible] కు మహోపకారం చేసావు. నా స్వామి నన్ను మరచి పోయారని [illegible], ఆయనకేమైనా అపకారం జరిగినదని కానీ భావించి నే [illegible] మరణించివుంటే యి విషాదవార్త విన్న ఆయనకు యెంతటి [illegible]

కలుగుతుందో కదా ! బాబూ! వారునన్ను యెప్పుడైనా తలుస్తున్నారా? నేను నా ప్రాణనాథుణ్ణి సందర్శించ గలుగుతానా? నన్ను నా 'నాథుడు శీఘ్రంగా తీసుకు వెడతారా !" అని యింకా యేమో పలకబోతుండగా ఆమె కనుల నుండి దుఃఖ బాష్పాలు జలజలా రాలాయి. ఆమె యిక మాట్లాడలేక పోయింది. "అమ్మా ? మిమ్మల్ని తలుచుకుని ప్రభువులు పడుతున్న బాధను నేను చెప్పలేకున్నానమ్మా! ఆ మహాత్ముడు భూదేవిని చూస్తూ - నీ బిడ్డకు నా వల్ల మహాకష్టాలు కలిగాయి, అందుకే నేను నీలో కలిసిపోవాలను కుంటున్నాను. నువ్వు నాకుస్థానం యివ్వడం లేదు". అని పలికి విరబూసిన పూలను కోసుకురా. గుచ్చి సీత జడలో పెడతాను". అంటూన్నారు. తల్లీవారివిరహ బాధలను యెవరూ వరించలేరమ్మా ! వారు తమ్ము తామే మరచిపోతూన్నారు. యెల్లవేళలా మిమ్మల్నే స్మరిస్తూన్నారు. మిమ్మల్ని సంబోధించి- "ప్రియురాలా!

నువ్వు నా దగ్గర ఉన్నప్పుడు నాకు అత్యంత ప్రియకరమై, సుఖప్రదమైన వస్తువులే నువ్వు లేనప్పుడు నాకు మహా దుఃఖాన్ని కలుగ జేస్తూన్నాయి. అందమైన మనస్సును ఆకర్షించే చెట్లసమూహాలలో తేజరిల్లే ఎర్ర ఎర్రని చిగురుటాకులు యిప్పుడు నాకు నిప్పుకణాలవలె కనపడుతున్నాయి. చంద్రుడు గ్రీష్మకాలంలోని సూర్యునిలా నన్ను దగ్ధం చేస్తూన్నాడు. నీవున్న వేళ అమృతం వలె వుండే వానతుంపరలు నేడు సలసల కాగే నూనె చుక్కల్లా నన్ను వేధిస్తున్నాయి. శీతలమందసుగంధ వాయువులు విషసర్పాల వలె పీల్చి విడిచే ఉచ్ఛ్వాస, నిఃశ్వాసల వలె నన్ను పీడించి వేస్తూన్నాయి. నా బాధలను యెవరి దగ్గరైనా తెలుపుకుంటే నాగుండె

బరువు తగ్గుతుంది. కానీ యెవరితో యేమని యెలా చెప్పుకుంటాను? మన యిరువురి ప్రేమ, అభిమాన సంయోగ రహస్యవిషయాలను నా హృదయం తప్ప గుర్తించగల వారె వరున్నారు? అట్టి నా హృదయం సర్వకాల సర్వావస్థలలోనూ నీదగ్గరే వుంటున్నది. అది క్షణం కూడా నన్ను విడనాడి ఉండదుకదా! ఇంతమాత్రంచే మనం చెప్పజాలని, వర్ణించ వీలుపడని మన ప్రేమకు వ్యాఖ్యానం చాలుతుందా? చాలదు. కానీ యిక చెప్ప గలిగేది మాత్రం యేముంది!" అంటూ హనుమంతుడు భావావేశంలో మునిగిపోయాడు. తన ప్రాణనాథుడే తన ముందు నిలచి మాట్లాడుతున్నట్లు సీతాదేవికి అనిపించింది. ఆమె ప్రేమమగ్నయై దేహస్మృతిని మరచిపోయింది. అంత హనుమంతుడు ఆమెకు ధైర్యాన్నిచెబుతూ – "అమ్మా ! ప్రభువుల అతులనీయ బలైశ్వర్య ప్రభావాలను జ్ఞప్తికి తెచ్చుకో. ఆ మహామహితాత్ముని ఒకొక్క పదునైన బాణం ముందు వీరందరి కందరూ కలసి నిలవగలరా? ఈ ధురాత్ములు సమూలంగా నాశనమై పోయారనే భావించు. ఈ ఘడియ వరకూ రామప్రభువులకు నీజాడ తెలియ లేదు. లేకుంటే ఆ మహాపరా క్రమశాలి యీ పాటికే యీ రాక్షసులనందరినీ బూడిద చేసి ఉండేవాడే, ఇప్పుడు మా వానర భల్లూక సైన్యాలన్నీ వారితో రావడానికి సిద్ధంగా ఉన్నాయి. మేమందరం కలిసి యీ దుష్టులను అందరినీ అంతం చేసి ఆనందోత్సవాలతో మిమ్మల్ని తీసుకు వెళ్ళగలము. అమ్మా ! మీరు శ్రీరామచంద్రుల మహాప్రభావ విషయాలను మరచి పోయారా? ఆయనకీ సమాచారం తెలియగానే వానర భల్లూక సేనలతో వచ్చి తన నిశితబాణ పరంపరలతో సముద్రాన్ని స్తంభింప జేసి లంకలో ఒక్క రాక్షసుణ్ణి కూడ

మిగలకుండ అంతం చేసి వేస్తారు. వారికి అడ్డంగా దేవదానవాదులే కాదు సాక్షాత్తూ మృత్యుదేవత వచ్చి నిలచినా ఆ మహాత్ముడు దానిని కూడ అంతం చేసి తీరతాడు తల్లీ ! నీ విరహంలో రామ ప్రభువు యెంతగా దుఃఖ పడుతున్నాడో? నేనువర్ణించజాలనమ్మా ఆయనింక క్షణకాలం కూడ ఆలస్యం చెయ్యడు. శీఘ్రంగానే ఆయనను కలిసి మీరు సుఖిస్తారు" అన్నాడు.

ఆ మాటలు విన్న జానకీదేవి–"హనుమా! నేటికి పది నెలలు గడిచి పోయాయి. ఇంక గడువు రెండు నెలలే వుంది. ఈ లోగా నా ప్రభువు నాపై దయదలచనిచో నేను వారిని సందర్శించ లేను. విభీషణుడే లేకపోతే ఆ దుష్ట రావణుడు నన్నీపాటికే అంతం చేసి ఉండేవాడు". అంటూ సీత భరించ జాలని దుఃఖం వల్ల యింక మాట్లాడ లేక పోయింది, అప్పుడు హనుమంతుడు ఆమెకు ధైర్యాన్ని చెబుతూ" అమ్మా!నా వల్ల మీ సమాచారం వింటూనే రామ ప్రభువులు మహా వేగంతో యిక్కడికి వచ్చేస్తారు. నిజానికి ఆయన రావలసిన అవసరం మాత్రం యేముంది? ఈ దుఃఖ సముద్రం నుండి నేనే మిమ్మల్ని విడిపించ గలను. మీరు నా భుజసీమపై కూర్చుంటే సురక్షితంగా యిప్పుడే సముద్రాన్ని దాటించి వేస్తాను. అగ్నిహోత్రుడు హవనం చేయబడ్డ హవిస్సును శీఘ్రంగా దేవేంద్రునికి అర్పించునట్లు మిమ్మల్ని శీఘ్రంగా శ్రీరామ ప్రభు సన్నిధానానికి చేర్చగలను. భగవంతుని దయ వల్ల మిమ్మేకాదు. రాక్షస సమేతంగా యీ లంకనే తీసుకుపోగలను. ఇక ఆలసించకండి. మిమ్ము తీసుకుపోయే సమయంలో రాక్షసుడెవరూ నన్ను అడ్డగించ లేడు". అన్న మారుతి వచనాలకు సీత యిలా బదులు పలుకుతున్నది. "హనుమా ! నువ్వుచూస్తే చాల చిన్నవాడిగా

ఉన్నావు - నన్ను తీసుకు వెళ్ళాలని యెలా సాహసిస్తున్నావు? అని ప్రశ్నించగా ఆంజనేయమూర్తి సీతాదేవికి తన విరాట్ స్వరూపాన్ని చూపించాడు. ఆమె అలా చూస్తూండగానే అతడు పెరిగి సుమేరు పర్వతంలా అయిపోయాడు. "అమ్మా ! ఇంక ఆలస్యం చెయ్యకు. నీ ఆజ్ఞయే లభిస్తే రాక్షస సమేతంగా నేనీ లంకనే యెత్తుకు పోతాను. నిశ్చయించుకో. నాతో వచ్చి రామచంద్రుల ఆనందాన్ని వర్ధిల్ల జెయ్యి", అన్నాడు "హనుమా ! నీ శక్తినీ యుక్తినీ అర్థం చేసుకున్నాను. వాయువుతో అగ్నితో సమాన ప్రతాపం కల నువ్వు నన్ను తీసుకు పోగలవు. కానీ నీతో నేను రావడం సముచితం కాదు. తీవ్రమైన నీ వేగానికి నేను మూర్ఛ పోవచ్చును. లేదా పడిపో వచ్చును. రాక్షసులతో నువ్వు ఘోరయుద్ధవం చెయ్యవలసి వస్తుంది. జయ పరాజయాలు ముందుగా నిర్ణయించలేము. ఒక వేళ నువ్వే జయంచినా భగవంతుని ప్రతిష్ట వర్ధిల్లదు. నువ్వీ రీతిగా రావడం వల్ల-హనుమంతుని వీపుపై కూర్చుని పోవుచున్న దెవరు? అన్న ప్రశ్నతో క్షణంలో అనేకులకు నా శీలంపై సందేహం కలుగు తుంది". అంటూ సీతాదేవి మరెన్నో కారణాలు చెప్పి "పతిభక్తి దృష్ట్యా స్వేచ్ఛగా నేను నీ శరీరాన్ని స్పృశంచజాలను. రావణుడు నన్ను యెత్తుకు తీసుకు వచ్చాడు. అది కేవలం వశంలో లేని విషయం. నేను అసమర్థురాలను. ఆ స్థితిలో యేమి చెయ్యగలను? నా ప్రభువులు యిక్కడకు వచ్చి రాక్షస సమేతంగా రావణుణ్ణి అంతం చేసిన నాడు నేను వారితో మాత్రం రాగలను. ఇది నాకూ వారికీ కూడ మర్యాదాకరమైన విషయం" అని ఆమె పలుకగా హనుమంతు డందులకు అంగీకరించి ఆమెను అభినందించాడు.

"వత్సా ! శ్రీరామచంద్రులపై నీకు గల భక్తి విశ్వాసాలనూ నీ బల పౌరుషాలనూ చూస్తూంటే నాకు మహానందం కలుగుతున్నది. నేను నిన్ను ఆశీర్వదిస్తూన్నాను, నువ్వు శీలవంతుడవై, అతి బలవంతుడవై, అజరుడవై, చిరంజీవివై సద్గుణ సంపన్నుడవై తేజరిల్లెదవు గాక! " శ్రీరామచంద్రులు సదా నీపై స్నేహ ముంచె దరుగాక! "అని సీతామాత అతణ్ణి ఆశీర్వదించింది. "భగవంతుడు సర్వదా నీపై స్నేహ ముంచును గాక! అన్నఅమృతసమ వచనాలను ఆలకించిన హనుమంతుని శరీరం పులకరించి పోయింది. అతనికి అంతకుమించి కావలసినది మాత్రం యెమున్నది? జీవితపరమార్థం. అదియే కదా! సీతామాత ఆశీర్వాదాన్ని అతడు అమోఘమను కుంటూ తన జన్మ చరితార్థతను ప్రకటించుకున్నాడు.

అనంతరం అతడాలోచించ సాగాడు. రామరావణ యుద్ధం తప్పదు. ఇక్కడి వాతావరణాన్ని పూర్తిగా తెలుసుకున్న మీదటనే ప్రతీకార మార్గాలు కనిపిస్తాయి సరే! నేను వానరుడను కదా ! పళ్ళు కోసుకు తింటాను. ప్రభువుల పని పూర్తి అయింది. కొన్ని చెట్ల కొమ్మలు విరగొడతాను. ఈ రాక్షసులను ఆవేశితులను చెయ్యడానికి యింతకు మించిన మార్గం లేదు. అని నిశ్చయించుకుని అందులకు జానకీదేవి అనుమతిని కూడా తీసుకున్నాడు.

ఆ సుందరమైన అశోక వనంలోని యెన్నో చక్కటి చెట్లు నేలకూలాయి. కాపలా కాసే వారు పారిపోయారు. ఎంతోమంది రాక్షసులు అంతమై పోయారు. ఒకే ఒక్క గుద్దుతో అక్షయకుమారుడు యమలోకం చేరుకున్నాడు. లంకానగరం నగరమంతా కోలాహ లంతో నిండిపోయింది. అంత రాముడు తన పెద్ద కొడుకైన

యింద్రజిత్తును పంపాడు, హనుమంతుని దెబ్బలకు తట్టుకోలేక అతడు బ్రహ్మపాశాన్ని ప్రయోగించాడు "బ్రహ్మ పాశం నిన్నేమీ చెయ్యలేదని" బ్రహ్మదేవుడు ఆదిలోనే హనుమంతునకు వరం యిచ్చినా కార్యసాధనకై హనుమంతుడు – ఆ పాశానికి బంధించబడిన వాని వలె రావణుని కొలువు చేరి శ్రీరామమహిమను గానం చెయ్యాలనుకున్నాడు. స్వయంగా అతడు బ్రహ్మపాశ బంధితుడై పోయాడు. అంత మహానందంతో యింద్రజిత్తు అతణ్ణి రాజసభ లోనికి తీసుకువెళ్ళాడు. అక్కడకు ప్రవేశిస్తూండగానే బ్రహ్మపాశం హనుమంతుని శరీరం నుండి విడివడిపోయింది. ఆ రావణాసురుని యెదుట దేవతలూ, లోకపాలురూ చేతులు కట్టుకుని నిలబడి వుండడం చూశాడు వాయునందనుడు. రావణుని ఆజ్ఞల కోసం అగ్ని దేవుడు యెదురు చూస్తూన్నాడు. వారందరి కందఱు భయంతో వినయంగా రావణుని కనుసన్నలలో మెలగుతూన్నారు. ఆ నాడు సభలో వీర హనుమంతుడు మహాధైర్యంగా, యే విధమైన సంకోచమూ లేకుండా నిలబడ్డాడు. వినయం విధేయతా లేకుండ అలా నిలబడ్డ హనుమంతుని చూసి గద్దిస్తూ రావణుడు వికటాట్టహాసం చేస్తూ "నువ్వెవడవురా? యెవని అండను కొండంత బలంగా భావించి యీ కోలాహలాన్ని చెలరేగ దీశావు?" అంటూ ప్రశ్నించాడు. దానికి హనుమంతుడు బదులు చెపుతూ ధైర్యంతో –" రావణా చరా చర ప్రపంచానికి అంతటికీ ఆశ్రయమైనవాడూ ప్రతీరోమం లోనూ అనంతకోటి బ్రహ్మాండాలను సృష్టించి పాలించి లయం చేసేవాడూ, తనశక్తి ప్రసాదించి బ్రహ్మవిష్ణు మహేశ్వరుల ద్వారా సృష్టి స్థితి సంహారాలను చేయించేవాడూ, తన కృపాలేశ మాత్రం చేతనే ఆది శేషువు ద్వారా యీ భూమినంతనూ మోయింప

జేసేవాడూ నీ వంటి లోకకంటకులైన రాక్షసులను శిక్షించడానికే అవతారమెత్తిన వాడూ అయిన శ్రీరామప్రభుదూత నైన నన్నే నువ్వెరుగవా? జనకమహారాజు యాగంలో నీచే కొంచెం కూడ కదల్చబడని శివుని విల్లును అవలీలగా భగ్నంచేసిన రామప్రభువులనే మరచి పోయావా? నీ వారైన ఖర, దూషణ. త్రిశిరాది పధ్నాలుగు వేల మంది రాక్షసులనే సంహరించిన శ్రీరామపరమాత్మనే మరచినావా? నిన్ను తన చంకలో నొక్కివేసి బాధించిన మహాబలి అయిన వాలిని ఒకే ఒక్క బాణపు దెబ్బతో నేలకూల జేసిన రామచంద్రునే నువ్వెరుగవా? రావణా ! నువ్వాయనను మరచిపో వచ్చునేమో? కానీ ఆయన మాత్రం నిన్ను యె నాటికీ మరువజాలరు. ఏ మహనీ యులయిన రామలక్ష్మణులు లేనివేళ నువ్వు మాయారూపాన్ని ధరించి సీతాసతిని దొంగిలించుకుని తీసుకు వచ్చావో? అట్టి శ్రీరామప్రభువునే మరచి నువ్వు జీవాలతో బయట పడాలనుకుంటూన్నావా? నేను ఆ మహామహిమాన్వితుని సేవకుడను, రామదూతగా వచ్చాను. నన్ను బాగా గుర్తుంచుకో, కొద్దిరోజులలోనే అద్భుతపరాక్రమశాలి అయిన ఆ శ్రీరామచంద్రుని బాణాగ్ని జ్వాలల్లో యీ లంక అంతా భస్మమైపోతుంది. నీ సభాసదుల నామరూపాలు కూడా ఉండవు". అని మేఘగర్జనతో సమానమైన కంఠంతో పలికాడు.

కొంచెంకూడ భయం లేకుండా పలికిన హనుమంతుని పలుకులు విన రాక్షసులందరూ దడదడ లాడి పోయారు. రామునికి యెదురుగా నిలిచి యుద్ధం చెయ్యజాలమన్న భావం వారికి కలిగింది. అక్కడి దేవత లందరికందరూ మనసా మహానందం చెందారు. రావణుడు

మాత్రం వాయునందనుని వచనాలను పెడచెవిని బెట్టాడు. అది గమనించిన హనుమంతుడు ఖళ్ళా అందుకున్నాడు. "రావణా ! ఆకలి వేయడంతో పళ్ళు తిన్నాను. ఆ రీతగా నా వల్ల దోషం జరగలేదు. చెట్ల కొమ్మలను విరగ గొట్టడం మా వానర జాతికి సహజ లక్షణం కదా! నన్ను అంతం చెయ్యాలని వచ్చిన దుష్ట శత్రువుల నుండి నన్ను నేను కాపాడుకోవడానికి వారిని నేను కూడా కొట్టాను. వారు నా ఆ ప్రయత్నంలో యమసదనం చేరారు. హద్దులు మీరి నీ పెద్దకొడుకే నన్ను బంధించ ప్రయత్నించాడు. అయినా అతణ్ణి నేను క్షమిస్తున్నాను, నువ్వు నా మాట ఒకటి వినాలి. నేను ప్రేమతో హితంగా నీకు క్షేమాన్ని కలుగ చేసే మాటలను చెబుతున్నాను. ప్రపంచాన్ని అంతటినీ మ్రింగివేయగల కాలుడు కూడ శ్రీరామచంద్రుని అధీనంలోనే ఉన్నాడు. అట్టి శ్రీరామప్రభువులకు యెదురై నువ్వు చేయగలిగిన దేమీ లేదు. ప్రాణాలతో బయట పడ లేవు కూడ. దయాసముద్రుడైన రామప్రభువుల సన్నిధానానికి నువ్వు ఆయన భార్యను తీసుకు వెళ్ళు. ఆ మహాత్ముడు శరణాగతులయిన వారి తప్పులను అన్నిటినీ క్షమిస్తాడు. ఆయన పావన శ్రీచరణాలను శరణువేడి ధ్యానించు. తద్వారా యెట్టి బాధలూ లేకుండా లంకారాజ్యాన్ని పాలించి అనుభవించు. ఉత్తమ కులంలో పుట్టావు. మహైశ్వర్యంతో అపార బలంతో, విద్వాంసుడవై కూడ అహంకరించకు. ఇదంతా మూడునాళ్ళ ముచ్చటయే, నేను ప్రమాణపూర్వకంగా చెబుతు న్నాను. రామ చంద్రులకు యెదురు నిలిస్తే యీ పదునాలు ఎ లోకాలలో నిన్నెవరూ రక్షించ లేరు" అన్నాడు.

తనకు యెంతగానో మేలు చేసే పలుకులనే హనుమంతు ప

చెప్పినా అవి రావణాసురునికి యెంతమాత్రం రుచించ లేదు. సరికదా! అతడు మహాకోపంతో "వీణి అంతరం చెయ్యండి" అని రాక్షసులను ఆదేశించాడు. దూతను చంపడం అధర్మం అని విభీషణుడు అడ్డుచెప్పగా రావణుడు- "అయితే వీనికి అత్యంత ప్రియమైన తోకను కాల్చండి", అని ఆజ్ఞాపించాడు. అంత రాక్షస సేవకులు హనుమంతుని తోకకు గుడ్డలు చుట్టి దానిని నూనెలో ముంచి నిప్పు ముట్టించి అతణ్ణి పట్టుకుని లంకా నగర వీధులలో తిప్ప సాగారు. చప్పట్లు కొడుతూ ఆడుతూ పాడుతూ; కేకలేస్తూ నవ్వుకుంటూ అతణ్ణి వెంబడించారు, "లంకను తగులబెట్టడానికి యిదే మంచి సమయం" అని అనుకుంటూ హనుమంతుడు తన తోకను బలంగా ఒక్క విసురు విసిరాడు. దానితో రాక్షస వీర సేవకులందరూ హడలెత్తి పారిపోయారు. వాయు కుమారుడు ఓ మేడ మీద నుండి మరోమేడ మీదకు దూకుతూ అన్నింటినీ బూడిద చేశాడు, ఆ దహనకాండలో వాయుదేవుడు పూర్తిగా సహకరించాడు. భయంకరమైన అగ్నిజ్వాలల్లో లంకా నగరమంతా మండిపోతున్నది. ఎన్నో యంత్రాలు నాశనమై పోయాయి. కానీ బంగరు లంక మాత్రం భస్మం కాలేదు. అందరూ భార్యాపుత్ర పరివార సామగ్రులతో పారి పోసాగారు,

అదే లంకలోని గాఢాంధకారంతో వున్న ఓ గదిలో శనైశ్చరుడు (శనీశ్వరుడు) బంధింపబడి ఉన్నాడు. హనుమంతుని పాదం ఆ గది గోడమీద బలంగా పడడంతో అది కూలిపోయింది. ఆంజనేయుని ద్వారా సర్వవిషయాలనూ గ్రహించిన శనీశ్వరుడు క్రీగంటితో లంకనంతనూ చూశాడు. విభీషణుని యిల్లు తప్ప లంక అంతా నాశనమై పోయింది. అంత శనీశ్వరుడు హనుమంతునికి వరాన్ని

ప్రసాదిస్తూ "ఆంజనేయా! కొద్ది రోజులలోనే లంక అంతా నాశనమై పోతుంది. నీ కృషి ఫలిస్తుంది". అని వెళ్ళిపోయాడు. శనీశ్వరునికి ముక్తి కలిగడంతో లంక అంతా భస్మమవడం చూసి హనుమంతుడు తన తోకను చల్ల బరచు కోవాలని సముద్రంలోకి దూకాడు. అక్కడ స్నానం చేసి మరల జానకీ దేవిని దర్శించి ఆమె యిచ్చిన చూడామణిని పుచ్చుకుని ఆమెకు ప్రణమిల్లి ఘోరంగా గర్జన చేసి బయలు దేరాడు.

హనుమంతుని రాక కోసం వానరులందరితో సహా అంగద జాంబ వంతాదులు యేమీ తినకుండ యెదురుతెన్నులు చూస్తున్నారు "కిలకిల" మని ధ్వనులు చేసుకుంటూ వస్తూన్న హనుమంతుని చూసి వెళ్ళిన పని పూర్తి అయినదని గ్రహించి అతని కెదురేగి కౌగలించు కున్నారు, తింటూ, తాగుతూ మధు వనాన్ని ధ్వంసం చేసుకుంటూ అందరూ క్రమంగా శ్రీరామ సుగ్రీవులను సమీపించారు. పవన సుతుడు వినయంగా అత్యంత కరుణా పూర్ణమైన మాటలతో సీతాదేవి యొక్క దైన్యదశను పూర్తిగా వర్ణించి చెప్పాడు. తరువాత లంకానగరంలోని ఐశ్వర్యాన్నీ రావణుని శక్తినీ, అక్కడి ప్రత్యేక విషయాన్నీ రామచంద్రునికి వివరించి చెప్పాడు. అంతా విన్న రామచంద్రుడు ఆంజనేయా! ఈ ప్రపంచంలో నాకు నీ వంటి ఉపకారి మరెవ్వరూ లేరు. నీకు ఋణపడి ఉన్నాను." అని రామ చంద్రుడు సాదరంగా పలుకుతూంటే హనుమంతుడు ఆనంద సముద్రంలో మునిగిపోయాడు. అతడు రామప్రభు చరణాలపై వాలి పోయాడు. అంత రామచంద్రుడు ఆతణ్ణి లేవదీసి హృదయానికి హత్తుకున్నాడు.తనయందు అతనికి అనన్యభక్తి కలగాలని వరాన్ని ప్రసాదించాడు. దేనికోసం సదాశివ దేవుడు హనుమంతుని రూపంలో

అవతరించాడో ఆ కోరిక నెరవేరింది.

హనుమంతుని సంకల్పం పరమ పవిత్రమైనది. తన సాంగత్యంలోకి వచ్చే వారిని యేదో విధంగా దైవ సన్నిధానానికి చేర్చడమే హను మంతుని గొప్పతనం.

లంకా నగరంలో విభీషణుడు పవన సుతుని కలిసి అతనితో మాట్లాడాడు. అన్న అయిన రావణుని నిండు కొలువులో విభీణుడు హనుమంతుని వైపు వాదించాడు, చివరకు అతడు రావణుణ్ణి విడిచి పెట్టి శ్రీరాముని శరణు వేడాడు. తత్ సమయంలో వానర రాజైన సుగ్రీవుడు అడ్డు చెప్పినా రామచంద్రుడు- "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ", అంటూ-శరణా గతుని రక్షించడమే నా వ్రతం- అని శపథం చేశాడు. అందులకై హనుమంతునికి కలిగిన ఆనందానికి హద్దులు లేవు. అంగదునితో హనుమంతుడు మొట్టమొదటగా ఉత్సాహంగా గంతు వేసి విభీషణుని దగ్గరకు వచ్చి అతణ్ణి రామ పరమాత్మ సన్నిధికి తీసుకు వచ్చాడు, తాను స్వయంగా రామ పరమాత్మను సేవించడమూ, రామచంద్రుల శరణు గోరేవారికి సహాయం చేయడమూ మాత్రమే అతని పని,

సాగరానికి ఆనకట్ట కట్టారు ఆ సమయంలో హనుమంతుడు యెన్నెన్నో పర్వతాలను యెత్తుకు వాచ్చడు. పని పూర్తి అవుతుండగా ఉత్తర సరిహద్దు నుండి అతడు ఓ పర్వతాన్ని తీసుకు వచ్చాడు, ఇంద్రప్రస్థం నుండి కొంచెం దూరం వచ్చేసరికి సేతు నిర్మాణం పూర్తి అయిపోయినదని అతనికి సమాచారం అందింది. ఇక ఆ కొండను మోసుకు పోవడం వల్ల లాభం లేదని దాన్ని అక్కడే

విడిచి వేశాడు, కానీ అది సామాన్య పర్వతం కాదు. దాని ఆత్మ సాక్షాత్కరించి–"రామభక్తా! నేను చేసిన పాపమేమిటి? నీ పవిత్ర హస్తాల స్పర్శను పొంది కూడా నేను రామసేవకు పనికిరాని వాడి నవుతున్నానే! నన్నిక్కడ విడువ వద్దు. రామపరమాత్మ సన్నిధానానికి నన్ను తీసుకు వెళ్లు, నన్ను వారి పావన పాదకమల సన్నిధానం లోనే ఉంచు. లేదా నన్ను సముద్రగర్భంలో పడెయ్యి. రామసేవకు వినియోగపడని జీవితం వల్ల ప్రయోజనం యెముంది?" అంది. దానికి హనుమంతుడు బదులు పలుకుతూ–"గిరిరాజా ! నువ్వు నిజంగా పరమ ధన్యుడవయ్యా! నీ పవిత్ర భావాలను గ్రహిస్తూంటే తప్పకుండా నిన్ను రామప్రభు సన్నిధికి తీసుకు వెళ్ళాలనియే ఉంది. కానీ యిక యే పర్వతాన్నీ తీసుకు రావలదని ప్రభువులు ఆదేశించారు. అయినా నీ కోసం రామచంద్రులను అర్థిస్తాను. ఆ పై వారి ఆజ్ఞానుసారం చేస్తాను" అంటూ మారుతి రామ సన్నిధానం చేరి సంగతులను చెప్పగా–"ఆంజనేయా! ఆ పర్వతం నాకు యెంతో ప్రీతి పాత్రమయింది. నువ్వు దానిని ఉద్ధరించావు. ద్వాపరంలో కృష్ణావతార సమయంలో నేను దానిని వినియోగించుకుంటానని చెప్పు. ఏడు రోజులు దానిని నా వేలిపై వుంచుకుని వ్రజవాసులను రక్షిస్తాను". అన్నాడు. అంత హనుమంతుడు వ్రజభూమి చేరి గోవర్ధన పర్వతానికి రామ సందేశాన్ని వినిపించాడు. గోవర్ధన గిరి హనుమంతుని దయవల్ల భగవంతుని పరమకృపకు పాత్రమై, నిత్య లీలా పరికరమైనది.

అది సువేలాచలం– దానిపై పర్ణశయ్యమీద శ్రీరామచంద్రుడు శయనించి ఉన్నాడు. సుగ్రీవుని వొడిలో అతని శిరస్సు ఉంది. హనుమంతుడూ, అంగదుడూ, ఆయన పాదాలను ఒత్తుతున్నారు.

కుడి యెడమలలో విల్లమ్ములున్నాయి. ప్రక్కగా లక్ష్మణస్వామి వీరా సనంపై కూర్చుని అన్నగారి వైపు చూస్తున్నాడు. అంత రామ చంద్రుడు చంద్రబింబం కేసి చూస్తూ–"సోదరులారా! మీ మీ అభి ప్రాయలను అనుసరించి చంద్రునిలో ఉన్న శ్యామత్వాన్ని(మచ్చను) వర్ణించండి" అన్నాడు. సుగ్రీవ, అంగద, లక్ష్మణ, విభీషణాదులు తమతమ అభిప్రాయాలు చెప్పారు. అందరూ చెప్పిన తరువాత హనమంతుడు అందుకున్నాడు. ప్రభూ! చంద్రుడు సర్వకాల సర్వా వస్థలలోనూ మిమ్మల్ని తన హృదయంలో ఉంచుకుని ధ్యానిస్తున్నాడు. మీరతని గుండెలలో వుండం వల్ల అతనిలో శ్యామసుందర రూపంలో మీరే నాకు కనిపిస్తూన్నారు." ఆ మాటలు విని అందరూ ఆనందించారు. భగవానుడు చిరునవ్వు నవ్వాడు. హనుమంతునికి యెక్కడ చూసినా రామ పరమాత్మ దర్శనమే అవుతుంది. అట్టి దశలో చంద్రునిలో అతనికి రామ ప్రభు సందర్శన భాగ్యం లభించడంలో ఆశ్చర్యం యేమున్నది?

రామరావణ యుద్ధం మహాదారుణంగా భయంకరంగా జరిగింది. అందులో హనుమంతుని ద్వారా హతమైపోయిన రాక్షసుల సంఖ్య రామయణాన్ని చదివే వారందరికీ తెలిసినదే. అంతే కాదు. అనేక సమయాలలో ఆ మహాబలశాలి రామలక్ష్మణ విభీషణ అంగద జాంబవంతాదు లందరికీ సహకరించాడు. ఇంద్రజిత్తుతో యుద్ధం చేసేటప్పుడు భయంకరమైన "శక్తి" అనే ఆయుధం యొక్క దెబ్బతిని లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అప్పుడు ఇంద్రజిత్తు లక్ష్మణస్వామిని లేవనెత్తుకొని పోవాలని యెంతగానో ప్రయత్నం చేశాడు. కానీ ఫలించ లేదు. నేలమీద నుండి కనీసం యిటూ అటూ కదపనైనా కదపలేక పోయాడు. అంత హనుమంతుడు సునాయా

సంగా లక్ష్మణుణ్ణి లేవనెత్తుకుని శ్రీరామ సన్నిధికి తీసుకు వచ్చాడు. మూర్ఛితుడై పడివున్న లక్ష్మణుణ్ణి చూసి రామచంద్రుడు శోక సాగరంలో మునిగి వ్యాకులుడై పోసాగాడు. లంకా నగరంలో వున్న సుషేణుడనే గొప్ప వైద్యుణ్ణి తీసుకు రాగలిగితే లక్ష్మణుడు మామూలు స్థితికి రాగలడని జాంబవంతుడు చెప్పాడు. అది వింటూనే హనుమంతుడు లంకలో ప్రవేశించి సుషేణ వైద్యుణ్ణి తీసుకు వచ్చాడు. మూర్ఛలో వున్న లక్ష్మణుని చూసి సుషేణుడు అతణ్ణి పరీక్షించి-"తూర్పు తెల్లవారకుండ ద్రోణ పర్వతం మీద వున్న ఓషధులను తీసుకు రాగలిగితే యితడు బ్రతుకుతాడు" అన్నాడు. అంతే! వెనువెంటనే హనుమంతుడు రామనామాన్ని స్మరించుకుంటూ మనో వేగంతో ద్రోణాద్రికి బయలు దేరాడు. అది తెలిసిన రావణాసురుడు "కాలనేమి" అనే మహామాయావి అయిన రాక్షసుణ్ణి పిలచి- కపటవ్యూహాన్ని పన్ని హనుమంతుడు రాత్రి అంతా మధ్యే మార్గంలోనే గడిపేటట్లు యేర్పాటు చేశాడు. కపట ఋషి రూపాన్ని ధరించిన కాలనేమి హనుమంతుని మోసగించాలని ప్రయత్నించాడు. కానీ మాయాపతి అయిన వాని దూతకు యీ మాయాజాలం వొక లెక్కయా? దైవ యోగం వల్ల హనుమంతునికి యదార్థ విషయాలు తెలిశాయి. వెంటనే అతడు మాయాఋషి రూపంలో ఉన్న కాలనేమిని యమ సదనానికి చేర్చి ముందుకు సాగి పోయాడు. అతనికి ద్రోణాచలం కనిపించింది. [illegible]ని సమయం రాత్రివేళ కావడం వల్ల అతడు ఓషధులను గుర్తించలేక [illegible]యాడు. కాలాన్ని వ్యర్థం చేయడమంటే [illegible]మో యెరుగని [illegible]డు ద్రోణపర్వతాన్నే పెకలించుకుని మ[illegible] వేగంతో లంకకు [illegible]డు. ఆ సమయంలో శ్రీరాముడు చెందుతూన్న బాధను

యెవ్వరూ వర్ణించ లేరు. హనుమంతుని చూస్తూనే రాముడు అతణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు. సుషేణ వైద్యుడు చికిత్స చెయ్యగా లక్ష్మణుడు పూర్తిగా తేరుకుని లేచి కూర్చున్నాడు. అన్ని దిశల నుండీ అందరి కందరూ హనుమంతుని పొగడ సాగారు.

యుద్ధ శిబిరాల దగ్గర హనుమంతుడు సావధానంగా కాపలా కాస్తూన్నాడు. ఆ సమయంలో రావణుని కోరికపై అహిరావణుడు- విభీషణుని రూపంలో వచ్చాడు. హనుమంతుడతణ్ని పిలచి- "సోదరా! ఇంత రాత్రివేళ యెక్కడ నుండి వస్తూన్నావు?" అని అడియెగాడు. ప్రభువుల ఆదేశానుసారం సంధ్యావందనానికి వెళ్ళాను. తిరిగి రావడంలో ఆలశ్య మైపోయింది. వెంటనే రమ్మని ప్రభువులు చెప్పి వున్నారు" అని మాయా విభీషణుడు చెప్పాడు. అందరూ నిద్రపోయారు. అప్పుడు అహి రావణుడు రామ లక్ష్మణులను తన భుజాల మీదకు ఎక్కించుకుని పారి పోయాడు. భగవంతుణ్ణి యెవరైనా దొంగిలించుకు పోగలరా? లక్ష్మణుడు అసలు యెప్పుడూ నిద్రపోనే పోడు. కానీ తన మహిమలను ప్రకటించాలని భగవంతునికి కోరిక కలిగినప్పుడు ఆయన అనేక లీలలు చేస్తూంటాడు. రామలక్ష్మణు లిద్దరూ మౌనంగా అహిరావణుని వెంట వెళ్ళారు. మరునాడు తెల్లవారింది. రామలక్ష్మణులు కనిపించక పోవడంతో వానర భల్లూక సైన్యాలలో మహా కోలాహలం చెలరేగింది. సుగ్రీవ, అంగద, జాంబ వంత, విభీషణాదులందరికందరూ బాధపడి పోసాగారు. జరిగిన విషయాలను హనుమంతుడు వారికి చెప్పగా విని విభీషణుడంటాడు- "ఆంజనేయా! నా రూపాన్ని అహిరావణుడు తప్ప మరెవరూ ధరించలేరు". అనగా హనుమంతుడు మహావేశంతో – "విభీషణా! అహిరావణుడు యెంతటిబలశాలి అయినా, యెట్టి

రహస్యాతిరహస్య ప్రదేశంలో దాక్కున్నా నేను వెళ్ళి వాణ్ణి అంతం చేసి నా ప్రభువులను తీసుకువస్తాను అంటూనే బయలుదేరాడు. అహిరావణుడు తన ప్రభువులను నాగలోకానికి తీసుకుపోయాడని మార్గమధ్యంలోనే అతనికి నిశ్చయంగా తెలిసింది. అక్కడకు వెళ్ళి హనుమంతుడు అహిరావణుని మందిరం లోకి ప్రవేశిస్తూండగా మకర ధ్వజుడనే మహావీరు డతణ్ణి అడ్డగించ బోగా– "నువ్వెవరవు?" అని ప్రశ్నించాడు. అందుకు అతడు బదులు పలుకుతూ– "వీరాంజనేయుని కుమారు డనయిన నన్నే నువ్వు గుర్తుపట్టలేదా? దొంగతనంగా ప్రవేశించి ఆపదల పాలుకాకు, జాగ్రత్త!" అన్నాడు. ఆశ్చర్యకరమైన ఆ సమాధానం విని హనుమంతుడు– "నాయనా! నాకు పుత్రులెవరూ లేరే. నువ్వేలా పుట్టావు? నేనే హనుమంతుడను" అన్నాడు అందుకుఅతడు "మీరు లంకానగరాన్ని భస్మంచేసి సముద్రంలో స్నానం చేస్తుండగా మీ స్వేదాన్ని ఓ మత్స్యం పానం చేసింది. దాని గర్భం నుండి నేను పుట్టాను" అని మకరధ్వజుడు బదులుపలికాడు, అనంతరం హనుమంతుడు రామలక్ష్మణులను గురించి ప్రశ్నించగా వారి విషయం తన కేమీ తెలియదనీ, నేడు తమ రాజు యెవరినో బలి చేయదలచాడనీ, అక్కడకు యెవరినీ రానీయవద్దనీ తనను కాపలా పెట్టాడనీ మకరధ్వజుడు అన్నాడు. అంత వారిద్దరి మధ్యా యుద్ధం జరిగింది. హనుమంతుడతణ్ణి బంధించి భవనంలో ప్రవేశించాడు. అతని పాద స్పర్శతో దేవీ విగ్రహం భూమిలోకి దించుకుపోయింది. ఆ విగ్రహ స్థానంలో హనుమంతుడు తన నోటిని విశాలంగా తెరచి నిలబడ్డాడు, మహాదేవి ఆనందించి ప్రత్యక్షమైనదని రాక్షసులు అనుకున్నారు. చక్కగా పూజలు చేశారు. ఫల పుష్ప ఆహారాదులు యేమి పెట్టినా నేటి దేవి

తిని వేస్తూన్నది. బలి యిచ్చే సమయం వచ్చేసరికి రామలక్ష్మణులు తీసుకు రాబడ్డారు. రాక్షసులు వారిని ఆటబొమ్మలుగా భావించి వినోదంగా వారిని బాధిస్తూ తీసుకువచ్చారు. ఏమీ అనకుండ రామలక్ష్మణులు వస్తున్నారు. అహిరావణు డందుకుని "ఇక మీరు మీ యిష్టదైవాన్ని తలచుకోండి", అనగా రాముడు అందుకుని–"నీ దేవి నిన్ను మింగివేయకుండ ప్రార్థించుకో" అన్నాడు. దానితో అహిరావణుడు క్రోధంతో యెర్రవారిన నేత్రాలతో వారిని అంతం చెయ్యాలని పదునైన కత్తిని యెత్తగా – హనుమంతుడు భూమీ ఆకాశమూ దద్దరిల్లి పోయేటట్లు గర్జిస్తూ రామలక్ష్మణులను తన భుజాల మీద యెక్కించుకుని ఆ దుష్టాత్ముని చేతిలోని కత్తిని లాక్కుని దానితోనే వాణ్ణి పరివారంతో సహా అంతం చేసి సురక్షితంగా శిబిరం చేరుకున్నాడు. రామలక్ష్మణులను వెంటబెట్టుకుని మరలి వచ్చిన హనుమంతుని చూసి వానరులు చేసిన "జయ జయ" ధ్వనులతో దిశలన్నీ ప్రతిధ్వనించి పోయాయి.

నిరంతరం హనుమంతుడు శ్రీరాముని పని లోనే ఉంటున్నాడు. పగటివేళ రామచంద్రునికి దగ్గరగానో దూరంగానో వుంటూ యుద్ధం చేస్తూన్నాడు. రాత్రి సమయాలలో రామ పాదాలను వొత్తుతూ సేవ చేస్తూండేవాడు. రామచంద్రుడు తరచుగా తన కోమలమైన చేతులతో హనుమంతుని దేహాన్ని నిమురుతూండే వాడు. దానితో అతని శ్రమ అంతా మటుమాయమై పోయేది. రామచంద్రుడు నిద్రపోయే సమయంలో హనుమంతుడు తన తోకను పెంచేసి యెత్తైన ఆసనాన్ని తయారు చేసుకుని సింహద్వారం దగ్గర కూర్చునే వాడు. రాత్రి అంతా కాపలాకాయడం, సూర్యోదయం కాగానే యుద్ధ రంగానికి పోవడం జరగు తున్నది. ఎట్టి ఆపద

వచ్చినా సుగ్రీవాంగద జాంబవంతాదులు అందరూ హనుమంతుణ్ణే శరణు వేడేవారు. యుద్ధ సమయంలో ఓ సారి హనుమంతుడు రావణాసురుణ్ణి బలంగా ఓ గుద్దు గుద్దాడు. దానితో మూర్ఛపోయిన రావణుడు కొన్ని క్షణాలకు తేరుకుని హనుమంతుని గొప్పగా పొగడుతూ–తన జీవిత కాలంలో యెవరి చేతా, యెనాడూ అలాంటి దెబ్బతిని వుండ లేదన్నాడు. రావణుడు లక్ష్మణుని తీవ్రంగా వేధించి అతణ్ణి యెత్తుకు పోవాలని శక్తి నంతటినీ వినియోగించి ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఆ దృశ్యాన్ని చూస్తూనే హనుమంతుడు వేగంగా పరుగెట్టాడు. ఓ మూల రావణుని బాణపు దెబ్బలకు అతని శరీరమంతా రక్తంతో ఉన్నా ఆ బాధను కూడ లెక్క చెయ్యకుండ అతడు లక్ష్మణుని సమీపించి రావణుని ఓ గుద్దు గుద్ది పువ్వును యెత్తుకు పోయే టంత తేలికగా లక్ష్మణస్వామిని లేవదీసుకుని రామసన్నిధికి చేర్చాడు. అది చూసి శ్రీరామచంద్రుడు హనుమంతుణ్ణి గాఢాలింగనం చేసుకుని– "హనుమా! నువ్వు మృత్యువుకు కూడ మృత్యువు లాంటి వాడవు. దేవతలను సంరక్షించడానికే అవతరించావు. నా సోదరునికి ఆపద ఉంటుందా?" అన్న మాటలు పూర్తికాక ముందే లక్ష్మణుడు నిద్ర నుండి లేచిన వాని వలె లేచి రెట్టింపు ఉత్సాహంతో యుద్ధ స్థలానికి చేరుకున్నాడు. హనుమంతుని సహకారంతో పెద్ద పెద్ద ఆపదలు కూడ క్షణంలో దూరమై పోతున్నాయి.

రఘురాముడు రావణుని అంతం చేసి విజయలక్ష్మిని వరించాడు. విజయ వార్తను సీతకు అందించాలన్న భావం కలగనే అతడు హనుమంతుని చేర బిలచి– "ఆంజనేయా! సీతకు నీ మీద చెప్పలేనంత వాత్సల్యం ఉంది. ఈ శుభ విజయ సమాచారాన్ని

సీతకు నువ్వే వినిపించాలి, విభీషణరాజు దగ్గర అనుమతి తీసుకుని లంకలో ప్రవేశించి–సుగ్రీవ లక్ష్మణులతో సహా నేను క్షేమంగా ఉన్నానని ఆమెతో చెప్పు. రావణుణ్ణి నేను అంతం చేసిన విషయాన్ని కూడ ఆమెకు ఆనందం కలిగే విధంగా వినిపించు" అన్నాడు.

శ్రీరామాదేశానుసారం హనుమంతుడు లంకలో ప్రవేశించాడు. లంకలోని వారందరూ అతణ్ణి గొప్పగా గౌరవించారు. విభీషణుని అనుమతిపై అతడు అశోకవనంలో శింశుపా వృక్షం క్రింద కూర్చుని ఉన్న సీతామాత సన్నిధికి చేరి ఆ తల్లికి సాష్టాంగప్రణామం చేసి జరిగిన సమాచారమంతా చెప్పాడు. ఆ పరమ సాధ్వి జానకీ మాత క్షణం వరకూ యేమీ మాట్లాడలేకపోయింది. ఆనంద పారవశ్యం వల్ల కంఠంలో గాద్గదిక మేర్పడగా ఆమె నయనాల నుండి జలజల ఆనంద బాష్పాలు రాలుస్తూ–"హనుమా! నాజీవితంలో యింతకన్న మిన్నయైన ఆనందమయ సమాచారం మరేముంటుంది? దీనికి ప్రత్యుపకారంగా నీకు యేంచెయ్యడమా? అని ఆలోచిస్తున్నాను. నీ హృదయం సర్వవేళల్లోనూ శ్రీరాముని యందలి అనన్యభక్తితో నిండియుండును గాక! సమస్తసద్గుణాలూ నీలో నివసించి యుండునుగాక! శ్రీరామచంద్రులవారి కరుణా కటాక్ష వీక్షణాలు నీపై సర్వదా ప్రసరించు చుండునుగాక!" అని ఆశీర్వదించినది. అమృతంతో సమానమైన శుభాశీర్వచన యుక్త మైన జానకీ దేవి పలుకులు ఆలకించి హనుమంతుడు ఆనంద పారవశ్యంతో చేతులు జోడించి "అమ్మా! వాత్సల్యపూర్ణమైన యిట్టిపలుకులు నువ్వు తప్ప మరెవరు పలక గలరమ్మా!" అన్నాడు. నా పరమ పవిత్రమైన హృదయ పీఠంలో మీ సీతారాముల దివ్య మంగళ సుందర మూర్తులు సర్వదా ప్రకాశించుచుండును గాక! మీ పాద సేవలో

నేను మహానందాన్ని పొందుతుంటాను. తల్లీ! యింకా మీకు నేను యేలాంటి సేవ చెయ్యాలో ఆదేశించండి" అని అర్థించాడు.

అందుకు జానకీదేవి సంతోషంగా "వత్సా! నేను నా ప్రాణనాథుని సందర్శించాలని తహతహలాడు తూన్నాను. ఇక క్షణం ఆలస్యాన్ని కూడ తట్టుకో లేకున్నాను" అనగా హనుమంతుడు వెనువెంటనే రామ సన్నిధికి చేరి జానకీమాత అభిప్రాయాన్ని వినిపించాడు. సీతను తన సన్నిధికి తీసుకు రమ్మని విభీషణునకు ఆదేశమిచ్చాడు.

సీతాలక్ష్మణ, సుగ్రీవ, విభీషణాదులతో, రామచంద్రుడు పుష్పక విమానం మీద అయోధ్యా నగరానికి బయలు దేరాడు. ప్రయాగ చేరగానే రఘురాముడు హనుమంతుని పిలిచి "ఆంజనేయా! అయోధ్యకు వెళ్ళి భరతుడేం చేస్తున్నాడో? చూడు. నా వియోగంలో ప్రతీ క్షణం అతనికి ఓ కల్పంలా కనిపిస్తూ వుంటుంది. నా సంగతులన్నీ అతనికి చెప్పి అతని స్థితిగతులను నాకు చెప్పు" అనగానే హనుమంతుడు అయోధ్య వైపు బయలు దేరాడు. అయోధ్యలో శ్రీరాముని కోసం భరతుడు యెంతగా బాధపడు తున్నాడో? ఎవరూ వర్ణించ లేరు. అతని స్థితి గతులను హనుమంతుడు పూర్తిగా చూశాడు. శుష్కించిపోయిన శరీరంతో జటాజూటంతో నీరు నిండిన [illegible]తో భరతుడు దర్భాసనం మీద కూర్చున్నాడు. ఆగకుండ [illegible] నోటి నుండి రామనామం వెలువడుతున్నది. తన ద[illegible]కు యెవరు వచ్చి పోతున్నదీ కూడ అతనికి తెలియనంతటి తన్[illegible]త్వంలో వున్నాడు. హనుమంతుడు అతని ధ్యానానికి [illegible]ం కలిగిస్తూ "భరతా! యే శ్రీరామ ప్రభువు [illegible]విరహం [illegible]పడి పోతున్నావో? ఆ రఘు రామచంద్రుడు సీతా [illegible]దులతో సహా క్షేమంగా ఉన్నాడు" అన్నాడు.

అమృతోపమానమైన ఆ తియ్యని పలుకులను ఆలకించి చెప్ప లేని ఆనందాన్ని పొందిన భరతుడు హనుమంతుని గాఢాలింగనం చేసుకున్నాడు. ఎన్నో పర్యాయాలు శ్రీరామచంద్రులను గురించి ప్రశ్నించాడు. హనుమంతుడు ఆనందంగా అతని ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పాడు. అంత వారిద్దరూ మహానందాన్ని అనుభ వించారు. ఆ సమయంలో భరతుడు–"ఆంజనేయా! ఇంతటి సంతోషప్రదమైన సమాచారాన్ని అందజేసిన నీకు యీాయదగిన వస్తువు యేమున్నది? నీకు ఋణపడి వుండడం లోనే మహానందం ఉంది" అనగా హనుమంతుడు అతని చరణ కలమలాలపై బడి అతని ప్రేమాదర సౌజన్య సౌమనస్యాలను ప్రశంశిస్తూ–"భరతా! శ్రీరామచంద్రుడు విశేషంగా నీగురించియే భాషిస్తూండేవాడు. నీ నామాన్నే జపించేవాడు; అంటూ భరతుని దగ్గర నుండి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

అత్యంత వైభవోపేతంగా శ్రీరామ పట్టాభిషేక మహోత్సవం జరిగింది, అందరికీ బహుమానాలు లభించాయి. శ్రీరామచంద్రుడు తన చేతులతో సుగ్రీవ విభీషణాదులకు బహుమూల్య రత్నాభరణ మణి వస్త్రాదులను సమర్పించాడు. ఆ మర్యాదా పురుషోత్తముని మదిలో యేముందోకానీ ఆయన హనుమంతునకు మాత్రం ఏమీ యివ్వలేదు. పరమాత్మీయుడైన మారుతిని రామప్రభువులు విస్మరించారు? అని అందికందరూ అనుకోసాగారు. ఆశ్చర్యపడి పోతున్నారు. అంతా తెలిసియే రఘురాముడు మౌనంగా వూరుకున్నాడు. జానకీ దేవి మాత్రం నాథుని ఆంతర్యాన్ని గ్రహించింది. అందరికీ శ్రీరామచంద్రులయందు హనుమంతునికి గల అనన్య భక్తిని ప్రకటించాలని ఆ తల్లి భావించింది. వెంటనే ఆమె తన

మెడనుండి యెంతో విలువైన మణిహారాన్ని తీసి మారుతికి యిచ్చింది. దానితో అందరూ ఆ తల్లిని కొనియాడారు. హనుమంతుడు ఆనందంగా ప్రేమాదర భావాలతో ఆ మాలను తీసుకున్నాడు కానీ సర్వులూ ఆశ్చర్యంగా అతని వైపే చూడ సాగారు. ఆ హారాన్ని తీసుకున్న హనుమంతుడు ఒక్కొక్క మణినీ తీసి బద్దలు చెయ్యడం మొదలు పెట్టాడు. అతి జాగ్రత్తగా బ్రద్దలైన ముక్కలను పరీక్షించి పారవేస్తూన్నాడు. ఆ పని ఆగకుండా జరుగుతూనే ఉంది. అది చూచి శ్రీరాముడు చిరునవ్వు నవ్వుతూంటే సీతాదేవి మాత్రం గంభీరంగా చూస్తూ వుండిపోయింది. భరత, లక్ష్మణ, శత్రుఘ్న, సుగ్రీవ, విభీషణాదులందరూ మహాశ్చర్యంగా అంతా తిలకిస్తున్నారు. కానీ సభలోని వారు ఉండ బట్టలేక- "ఆంజనేయా! అమ్మ యిచ్చిన అమూల్యమైన మణులను మట్టి పాలు చేస్తూన్నావే అలా చెయ్యకు" అన్నారు. అందులో ఒకడు లేచి గట్టిగా-కోతి లక్షణాలు యెక్కడికి పోతాయి? మణుల విలువ యితనికి యేం తెలుసుంది?" అన్నాడు. చాలామంది కోపంగా తన కేసి చూస్తూ అవహేళన చెయ్యడం గమనించి హనుమంతు డన్నాడుః

"సోదరులారా! మిత్రులారా! అనవసరంగా మీరెందుకు నా మీద కోపగించి హేళనగా మాట్లాడుతారు? నేను యీ మణులను పరీక్షిస్తూ న్నాను. మహత్తరమైన ప్రకాశం గల యివి యెంతో ధనానికి అమ్మబడతాయి. వీటిని ధరించడం వల్ల అందం పెరుగుతుంది. గొప్పతనాన్ని తెలియ జేయడానికి ఆధారాలు యివి యేనా? యెంతమాత్రం కాదు. దేనిలో భగవంతుడు దర్శనమవుతాడో? అదియే మహామహత్త్వం కల వస్తువు. ఈ

మణులలో యెక్కడా పరమాత్మ కనిపించ లేదు, వీటి కాంతి నాకు అంధకారమయంగా కనిపించింది, ఏనాడో ఓనాడు బ్రద్దలు కావలసిన వీటితో నాకు పని యేముంది? అందుకే బద్దలు క్కొట్టి పారవేసాను". అన్నాడు. దానితో అందరికీ జ్ఞానోదయమయింది. కానీ అందులో యింకా కొందరి సందేహం దూరం కాలేదు. అందుకే వారందుకున్నారు– "అయితే హనుమా! నీ గుండెలలో శ్రీరామచంద్రుడున్నాడా? అయితే చూపించు". "నిశ్చయంగా నా హృదయ మందిరంలో శ్రీరామచంద్ర పరమాత్మ ప్రకాశిస్తూన్నాడు". అంటూ అతడు తన విశాలమైన వక్షఃస్థలాన్ని చీల్చి–సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నులతో తన హృదయరూప సింహాసనంమీద తేజరిల్లిపోతున్న శ్రీరామచంద్ర పరమాత్మను చూపించాడు. దానితో అందరి కందరూ హనుమంతుని అపార భక్తిని వేనోళ్ళకొనియాడారు. అంత శ్రీరామచంద్రుండు సింహాసనం నుండి దిగి వచ్చి హనుమంతుని గాఢాలింగనం చేసుకున్నాడు. ఆ దివ్య స్పర్శతో హనుమంతుని శరీరం రెట్టించిన దృఢత్వాన్ని పొందినది. హనుమంతునకు శ్రీరాముడు ఆదిలో బహుమానం యెందుకీయలేదో అప్పుడు అందరికీ అర్థమైనది. అది చూసి సీతాదేవి చిరునవ్వు నవ్వింది.

సీతవంటి మాత, హనుమంతుని వంటి పుత్రుడూ– వారి స్నేహ వాత్సల్యాలను గురించి యెవరు యెంతని వర్ణించగలరు? సీతాదేవిని సేవించడానికి దాసదాసీలు యెంతో మంది ఉన్నారు. కనుసన్నల మాత్రంచే యేమైనా జరిగిపోతుంది. కానీ ఆమెకు అంత మాత్రంచే సంతుష్టి కలగడం లేదు. తన చేతులతో వండి హనుమంతునికి తినిపించాలని ఆమెకు కోరిక కలిగింది. షడ్రసోపేతమైన వంటకాలు

యెన్నో తయారయ్యాయి. తినడానికి హనుమంతుడు సిద్ధంగా కూర్చున్నాడు. సీతమ్మ చేతి వంట యెంత మధురంగా వుంటుంది? అతడు తినడం మొదలు పెట్టాడు. యెంత తిన్నదీ అతనికి తెలియ లేదు. చేసిన పదార్థాలన్నీ అయి పోయినా అతడు మాత్రం లేవ లేదు. జానకీదేవి మహాశ్చర్యంలో మునిగి పోయింది. ఏమీ తోచక రామప్రభువును స్మరించ సాగింది. హనుమంతుని రూపంలో సాక్షాత్తూ రుద్రభగవానుడే సావకాశంగా కూర్చుని భుజిస్తూండడం చూసింది. ప్రళయ సమయంలో సర్వ ప్రపంచాన్నీ లయం చేయగల కారూపుడైన హనుమంతుని ఉదరం యీ పదార్థంతో నిండుతుందా? ఆమె శ్రద్ధ, భక్తులతో హనుమంతుని స్తుతించింది. హనుమంతుని వెనుకగా వెళ్ళి అతని వీపు మీద "ఓం నమశ్శివాయ" అని వ్రాసి మిగిలిన కొంచెం పదార్థాన్నీ వడ్డించింది. దానితో అతడు పూర్తిగా తృప్తి చెందాడు. ఈ రీతిగా జానకీ దేవి కూడ హను మంతుని రుద్రావతారునిగా గ్రహించింది.

హనుమంతుడు విసుగన్నది లేకుండ రామచంద్రులకు సర్వోపచా రాలూ చేస్తూన్నాడు. యెవొక్కరికీ యెంతమాత్రమూ అవకాంశ యివ్వడం లేదు. సావధానుడై ఆనందంగా సేవాకార్యాలన్నింటినీ శ్రమ లేకుండా నిర్వహిస్తూన్నాడు. భరత లక్ష్మణ శత్రుఘ్నులు కూడ శ్రీరాముని సేవించాలని తహతహ లాడుతున్నారు. ఆఖరుకు వారందరూ కలసి ఓ వుపాయం ఆలోచించారు. దాని ప్రకారం రామచంద్రుల దినచర్య నిర్ణయింపబడింది. అందులో 'రఘురాముణ్ణి యెవరు యెప్పుడు యెలా సేవించాలి? అన్న విషయమై సమాలోచన ఆరంభమయింది. "హనుమంతునికి యెవిధమైన అవకాశమూ యివ్వకుండా సేవలన్నీ మనమే చెయ్యాలి". అన్న ప్రణాళికకు

అందరూ ఆమోదించారు. ఈ విషయాన్ని జానకీ దేవి రామచంద్రులకు స్వయంగా నివేదించింది కూడ, అది చూసి రఘురాముడు చిరునవ్వు నవ్వి ప్రణాలికను హనుమంతునికి చూపి- "ఆంజనేయా! ఈ పద్ధతి నీకు అంగీకరామేనా?" అనగా- "స్వామీ! సీతామాత ద్వారా యిదే నిర్ణయమైతే తమరు తప్పక అంగీకరించ వలసినదే. మీ సేవాభాగ్యానికి నోచుకోని వాణ్ణి నేనొక్కడినే కదా!" అన్నాడు, అంత రామచంద్రుడు అందరినీ సంబోధించి- ఏ సేవనూ మరువకుండ ప్రణాళికను సిద్ధం చేశారా? సావధానంగా చూసుకోండి" అని అడుగగా యేదీ మరువ లేదని వారు సమాధానం చెప్పారు. దానితో ఆ ప్రణాళికకు రాజముద్ర పడింది. అంత హనుమంతుడందుకొని- "రామప్రభూ! మహారాజులు ఆవులించే వేళలో చిటికెలు వేశేసంప్రదాయం వుంది కదా? ఆ పని నాకు మిగిలింది" అని అనగా అందరూ దానిని సామన్యంగా భావించారు. అందుకు రామచంద్రుడు నవ్వుతూ అంగీకరించాడు. ఈ ప్రసంగం ద్వారా హనుమంతుని సూక్ష్మ జ్ఞానం అర్థ మవుతుంది. అందుకు భరతుడు మాత్రం మహాశ్చర్యం పొందాడు. హనుమంతుని కోరిక నెర వేరింది. రామప్రభువు తింటూన్నా, త్రాగుతున్నా, పడుకున్నా - అన్ని వేళల్లోనూ హనుమంతుడు నీడలా ఆయనను వదలకుండా ఉంటూన్నాడు. రఘురాముడు నిదురపోయే వేళలో అతడు కొంచెం దూరంలో కూర్చుని ఆ పురుషోత్తముని దివ్య సుందర వదన బింబాన్ని చూస్తూండి పోతున్నాడు. అందరికందరూ అతణ్ణి గురించి తమ తమ భావాను గుణంగా భావించుకో సాగారు. హనుమంతుడు వారందరితోనూ- "రామప్రభువులకు ఆవులింత యెప్పుడు వస్తుందో? యెవరు చెప్పగలరు?" అంటూండే వాడు.

జానకీ దేవి కూడ ప్రాణనాథుణ్ని సేవించ లేక పోతున్నది. రామ చంద్రుడు ఆ స్థితికి తనలో తానే నవ్వుకుంటూ వుండేవాడు. లక్ష్మణ శత్రుఘ్నులు భీతి చెందారు. చిట్టచివరకు జానకీదేవి ప్రతి పాదించగా పూర్వపు పద్ధతిని మరల అమలులోకి తెచ్చారు. గతంలో వలెనే హనుమంతుడు నిరంతరం రామ సేవ చేసుకుంటూ ధన్యత చెందుతూన్నాడు.

రామచంద్రుడు అందరి కంటె హనుమంతుణ్ణే అత్యధికంగా ప్రేమిస్తున్నాడన్న భరతభావం శత్రుఘ్న లక్ష్మణాదు లందరికీ కలిగింది. అది యదార్థమే కూడ. వారేదైనా ప్రభువుకు నివేదించ వలసి వస్తే హనుమంతుని ద్వారానే చెప్పించక తప్పడం లేదు. హనుమంతుడు స్వయంగా సీతారాములను ప్రశ్నిస్తూ వుండేవాడు. జీవాత్మ పరమాత్మల విషయమై తత్త్వ జ్ఞానాని పొందుతూ వుండే వాడు. రామచంద్రుడు అతనికి అనేకమార్లు తత్త్వ జ్ఞానాన్ని ఉపదేశించే వాడు. అతడు హనుమంతునికి వేద వేదాంత రహస్యాలను వివరించి చెప్పేవాడు. అధ్యాత్మ రామాయణంలో ఆదిలో జరిగిన ప్రసంగాలు యిలాంటివే. హనుమంతుడు జ్ఞానమూర్తి – అన్న విషయానికి అనేక ఘట్టాలలో అనేక ప్రమాణాలు వున్నాయి. రుద్రావతారుని విషయంలో అదో ఆశ్చర్యమా? తనను విశేషంగా సేవిస్తూన్న హనుమంతుని చూసి రామచంద్రుడు – ఆంజనేయా! నువ్వు నా స్వరూపుడవే. ఇంతగా సేవ చెయ్యవలసిన పనేముంది? విశ్రాంతిగా యెందుకుండవు? అని అడుగగా–"స్వామీ! మీ మాటలు నిజమే మిమ్ము సేవించినంత మాత్రాన నేను మీ స్వరూపుడను కాకుంటానా? మిమ్మల్ని సేవించే వేళలో కూడ నాకు శాంతిగా విశ్రాంతిగానే వుంటుంది. దేహదృష్ట్యాణ్ణి నేను మీ దాసుణి. నాయీ

దేహం మీకూ మీ సేవలకూ వినియోగ పడాలి. దీని ప్రయోజనం యిదియే కదా! జీవదృష్ట్యా నేను మీ అంశనే. నాకు యెన్నడూ మీ నుండి యెడబాటు కలుగకుండును గాక! ఇదే నా యెక మాత్రమైన అభిలాష. తత్త్వదృష్టితో చూస్తే నేను మీ స్వరూపాన్ని. ఈ దృష్టితో చెప్పవలససినది ఆలకించవలసినది యేముంటుంది ప్రభూ!" అని హనుమంతుడు సవినయంగా పలికాడు. ఆ సమాధానానికి రామచంద్రదుడు మహానందం పొందాడు.

రామప్రభువుల అశ్వమేధయాగం ఆరంభమయింది. యాగాశ్వం విడువబడగా దానిని అనుసరించి శత్రుఘ్న పుష్కలి, లక్ష్మీధరుడు మొదలైన మహాశూరు లందరూ నడుస్తూన్నారు. వారి వెంట హనుమంతుడు కూడ ఆనందంగా వస్తూన్నాడు. అనేక రాజ్యాలలో భయంకరమైన యుద్ధాలు జరిగాయి. ఆయా వేళల్లో వీరహనుమంతుడు చూపిన శౌర్య ధైర్య పరా క్రమ విషయాలు పద్మ పురాణంలోని పాతాళఖండంలో చూస్తే అర్థమవుతాయి. ఆ సమయంలో వోనాడు చక్రాంక నగరాన్ని పాలించే 'సుబాహువు' అనేరాజుతో యుద్ధం జరగుతున్నది. రెండు పక్షాలలోనూ అనేకమంది వీరులు నేల కూలిపోయారు. ఎందరో గాయపడి విల విల లాడుతున్నారు. చిట్ట చివరికి హనుమంతునికీ సుబాహువుకూ మధ్య యుద్ధం ఆరంభమయింది. హనుమంతుడు ఒక దెబ్బ కొట్టడంతో సుబాహువు తెలివి తప్పి పడిపోయాడు. తెలివి తప్పిన ఆ స్థితిలో అతడు అయోధ్యలో ఉన్నట్టూ, రామచంద్రుడు అశ్వమేధ యాగం చేస్తూన్నట్లు సరయూ నదీ తీరంలో సమావేశమై ఉన్న బ్రహ్మాదులు ఆతణ్ణి స్తోత్రం చేస్తూన్నట్లూ, నారదుడు మొదలైన దేవర్షులూ, బ్రహ్మర్షులూ. వీణ, వేణు,

మృదంగ ఆదిగాగల మంగళ వాద్యవిశేషాలతో రామచంద్రుని అనంత కళ్యాణ గుణాలను గానం చేస్తున్నట్లు చూశాడు. నీలమేఘ శ్యాముడైన శ్రీరామచంద్రుని నిఖిల లోకాశ్చర్యకర దివ్య మధుర సౌందర్యాన్ని కనులారా తనివి తీరా సందర్శించి సుబాహురాజు ముగ్ధుడై అదే దశలో చాలసేపు వుండిపోయాడు.కొన్ని క్షణాలకు తెలివి వచ్చిన తరువాత అతడు ఓ మహర్షి శాపకథను వినిపించి హనుమద్వీరుని మహిమను గానం చేసి– "మహాత్మా! నీ పాద కమలముల స్పర్శ వలన నాకు శ్రీరామ తత్త్వజ్ఞానం కలిగింది. జరిగిన దానికి నన్ను దయదలచి క్షమించండి". అంటూ యుద్ధం ఆపివేసి అమూల్యమైన యెన్నో బహుమానాలతో అయోధ్యాపురం చేరి శ్రీరాముల వారి అశ్వమేధ యాగంలో త్రికరణ శుద్ధ్యా సేవలు చెయ్యాలని నిశ్చయించుకొని రామానుచరులను అందరినీ పూజించి యాగాశ్వంతో వారి వెంట బయలు దేరాడు.

దేవపురాన్ని పాలించే మహారాజు పేరు వీరమణి. అతడు శివభక్తులలో శ్రేష్ఠుడు. యాగాశ్వం అతని చేత బంధించబడింది. దానితో – ఘోరభయంకర యుద్ధం ఆరంభమయింది. తన భక్తుని పక్షాన్ని వహించి భక్తజన వశంకరుడైన శంకర భగవానుడు స్వయంగా యుద్ధం చేశాడు. ఆ మహా భయంకర పరాక్రమశాలి అయిన రుద్రదేవునికి యెదురై పోరిన శత్రుఘ్న, పుష్కర ఆదిగాగల వీరులందరూ తెలివి తప్పి పడి పోయారు. కేవలం హనుమంతుడు మాత్రం యుద్ధం చేస్తున్నాడు. ఇటూ అటూ కూడ ఉన్నవాడు ఒక్కడే శంకరుడు. వీరమణి భక్తుని పక్షంలోనూ, శ్రీరామభగవానుని పక్షంలోనూ కూడ అతడే ఉన్నాడు. ఓడిపోయే వారెవరు? అంత మారుతి గద్దిస్తూ–"శంకరుడు రామభక్తుడని విన్నానే కానీ యిలా

యెదురుతిరుగు తాడని యిప్పుడే తెలిసింది. శ్రీరామ ప్రభువుల అశ్వమేథయాగం జగత్కళ్యాణప్రదంగా సమాప్తం కావాలని మేమందరం యాగాశ్వాన్ని రక్షించాలని వస్తే నువ్వేమో దానికి అంతరాయాన్ని కలిగిస్తున్నావు. అనగా రుద్రభగవానుడు - "హనుమా! నువ్వు చెప్పింది నిజమే- కానీ నాకు భగవత్ భక్తి కుదిరేది యేలా? నువ్వు నాచే నా దైవాన్ని స్మరింప జేశావు. ఇది నాకు మహానందమే-కానీ నేను నా భక్తునికి వశుడనై అతని పక్షం చేరి యుద్ధం చెయ్యక తప్పడం లేదు"-అన్నాడు. తరువాత దారుణ యుద్ధం జరిగింది. అతులిత బలధాముడైన హనుమంతుని దెబ్బలకు మహాదేవుని రథం ముక్కలై పోయింది. ఆయుధాలు విఫలం కాగా ఆయన దేహం శిథిలం కాసాగింది. నందీశ్వరుడంతటి వాడు కూడ పలాయన మంత్రం పఠించాడు. అంత మహాదేవుడు హనుమంతుని పిలచి-"మహావీరా! ధన్యుడవైన నీ శ్రీరామభక్తి కొనియాడ తగినది, నిన్ను చూస్తుంటే నాకు మహానందం కలుగుతున్నది. నీకు వరాన్ని ప్రసాదించదలచాను కోరుకో"- అనగా హనుమంతుడు సవినయంగా-"మహాదేవా! రామప్రభు కరుణవల్ల నాకు యే కోరికా లేదు. అయినా నువ్వు అనుగ్రహించ దలచావు కనుక కోరుతున్నాను. ఈ యుద్ధంలో మరణించిన పుష్కరుని మరల బ్రతికించు, మూర్ఛపోయిన శత్రుఘ్న వీరుణ్ణి గాయపడిన సైనికులనూ అనుగ్రహించు, నేను ద్రోణాద్రి చేరి ఓషధులను తీసుకు వచ్చేవరకూ-నువ్వు వీరిని సంరక్షించు" అని కోరగా-"తథాస్తు" అంటూ శంకర భగవానుడు ఆ పని చేయడానికి అంగీకరించాడు. అంత హనుమంతుడు మనో వేగంతో ద్రోణగిరివైపు బయలుదేరాడు. అనుకున్న ప్రదేశం చేరిన హనుమంతుడు అపార

శక్తి సంపన్నమైన తన తోకతో చుట్టబెట్టి ద్రోణపర్వతాన్ని వూడబెరికి అక్కడ నుండి మరలి వచ్చే సమయంలో దేవతలు అతని మీద దండెత్తారు. కానీ హనుమద్వేగ పరాక్రమాల ముందు వారు తాళలేకపోయారు. వానరు డొకడు వచ్చి ద్రోణగిరిని యెత్తుకు పోతున్నాడనీ అతనిపై తాము ప్రయోగించే ఆయుధాలేమీ పనిచేయడం లేదనీ వారు వెళ్ళి దేవేంద్రునితో మొరపెట్టుకున్నారు. అది విని భయపడిన దేవేంద్రుడు కులగురువైన బృహస్పతుల వారిని ఉపాయం చెప్పుడని అడుగగా ఆయన వీరాంజనేయుని విశేష మహాబల పరాక్రమాలను వర్ణించి అతణ్ణి సంతోష పెట్టండి" అని వెంటనే ఆయన దేవేం ద్రుణ్ని, దేతలనూ వెంటబెట్టుకొని వీరహనుమంతుని దగ్గరకు వచ్చి జరిగిన అపరాధానికి మన్నించ వలసినదని అర్థించారు. "ఆంజనేయా! నీ కోరిక నెరవేరుతుంది. ఈ మృత సంజీవనీ ఓ షధిని తీసుకు వెళ్ళు". అని దానిని యిచ్చా డు. వెంటనే హనుమంతుడు సంతో షంగా ఆ మూలికను తీసుకొని యుద్ధరంగంలో చచ్చిపడియున్న పుష్కరుని సమీపించి- "నేను మనసా వాచా, కర్మణా శ్రీరామ చంద్రభగవానునే ఆరాధించి సేవించిన వాడి నైతే, ఆయన ఆజ్ఞలను సర్వదా శిరసావహించి పాటించువాడ నైతే, నా హృదయ మందిరంలో శ్రీరామ చంద్రుడు తప్ప అన్యులెవరూ లేకుంటే యీ దివ్యమైన ఔషధంతో పుష్కరుడు బ్రతుకును గాక!" అం టూ ఓషధిని ప్రయోగించాడు. అంత పుష్కరుడు లేచి మహా దేవునితో యుద్ధానికి పరుగు తీశాడు. ఆ తరువాత హనుమంతుడు శత్రుఘ్నుని దగ్గరకు రాగా అతడు మూర్ఛలో ఉండియే "రామరామ! రఘునందనా!" అంటూ అప్పుడప్పుడు రామలీలను ప్రేలాపనలోనే పలుకుతూన్నాడు.

హనుమంతుడు అతనిపై కూడ ఓషధిని ప్రయోగిస్తూ- రామప్రభు కరుణవల్ల నేను నిత్య బ్రహ్మచారినేని, నా బ్రహ్మచర్యం అఖండమైన దేని శత్రుఘ్నుడు యీ క్షణంలోనే లేచును గాక! అన్నాడు. అంతే శత్రుఘ్నుడు లేచి సాయుధుడై-"శంకరుడెక్కడ"? అంటూ రణరంగంలోకి పరుగుతీశాడు. తరువాత ఆ యిరు సేనలలోనూ మహాయుద్ధం జరిగింది. వీరమణి మూర్ఛ పోయాడు. శంకర శత్రుఘ్నుల మధ్య యుద్ధం కొనసాగుతున్నది. శంకరుడు విడిచిన తీవ్రబాణాలకు శత్రుఘ్నుడు వేదన పడడం చూసి హనుమంతుడు- "శత్రుఘ్నా! శ్రీరామచంద్రుని స్మరించు" అంటాడు. అంత శత్రుఘ్నుడు యెకాగ్ర చిత్తంతో అత్యంత శద్ధాభక్తులతో శ్రీరామచంద్రుని ధ్యానిస్తాడు. వెంటనే రామచంద్రుడు ప్రత్యక్షంకాగా- శంకరుడు శ్రీరామ సన్నిధికి వచ్చి-తన అవరాధాన్ని క్షమించుమన్నాడు. అంత శ్రీరాముడు సమాధానం యిస్తూ- "మహాదేవా! నువ్వు మహత్కార్యం చేశావు. తమ భక్తుల యందు వాత్సల్యం చూపించడం వారిని సంరక్షించడం దేవత లైన వారికి ధర్మమేకదా! నువ్వు నా హృదయంలో ఉన్నావు. నేను నీ హృదయంలో ఉన్నాను. మనయందు భేదభావం కలిగి నడిచే వారు నరకయాతనలకు గురి అవుతారు. నీ భక్తులందరూ నాకు భక్తులుకాగా నా భక్తులందరూ విశేషభక్తితో నీకు ప్రణమిల్లుతారు". అంటూ రామచంద్రుడు హతులై పడివున్న వీరులను స్పృశించే సరికి వారందరూ నిద్రనుంచి లేచిన వారివలె లేచి ఆ ప్రభువునకు సాష్టాంగ నమస్కారాలు చేశారు. అంత వీరమణి శివదేవుని ఆదేశానుసారం తన సమస్తాన్నీ రామచంద్రులకు అర్పించి రామభక్తుడయ్యాడు.

సమస్త వానర భల్లూక సైన్యాలకూ, తమ తమ స్థానాలకు మరలి పోవలసినదిగా రామచంద్రుడు ఆశాదేలిచ్చే సమయం వచ్చింది. అందరూ సీతారాములకు ప్రణమిల్లి వెళ్ళి పోతున్నారు. అప్పుడు హనుమంతుని వంతు కూడ వచ్చింది. అతడు రామచంద్రుని పాదకమలాలపై పడి వినయంగా ప్రార్థిస్తూ "ప్రభూ!నేను మీ శ్రీచరణకమల సన్నిధానం లోనే ఉంటాను. మిమ్మ విడనాడి నేను యెక్కడకూ పోలేను". అనగా రామచంద్రుడు అంగీకరించాడు. హనుమంతుని వంటి మహాభక్తుణ్ణి విడనాడి రామభగవానుడు మాత్రం ఉంటాడా? పరమాత్మ తన అవతారాన్ని చాలించే సమయం సమీపించడం గ్రహించి మారుతిని పిలచి "ఆంజనేయా! నేను నా ధామానికి వెళ్ళిపోతూన్నాను. నువ్వు విచారించకు. నీకు యిష్టం లేకపోయినా నువ్వు యిక్కడే ఉంటూ జ్ఞాన ప్రేమ విషయాలను ప్రచారం చెయ్యి. నా గాథలను గానం చేసే పవిత్ర స్థానాలలోనే నువ్వుండు. నేను నీకు వేరుగా ఉండను. ఇదంతా లీల మాత్రమే". అనగా హనుమంతుడు చేతులు జోడించి. స్వామీ ! మీ నామ సంకీర్తన జరిగేచోట, మీ లీలలు గానం చేయబడే స్థానాలలో నేను తప్పకుండా ఉంటాను. అదే నా జీవితానికి ఆధారం. అనగా విని రామచంద్రుడు సంతోషించాడు. ఇలాంటి ప్రసంగమే మరొక చోట కూడ జరుగగా రామచంద్రుడు–"హనుమా! నాకు నువ్వు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారంగా నా సర్వస్వాన్నీ అర్పించినా నీ ఋణం తీరదు. నేను నీకు ప్రత్యుపకాం చెయ్యలేను కూడ. నీ జీవనంలో యెన్నడూ నీకు ప్రత్యుపకారావశ్యకత రాకుండును గాక! కారణం ? ఆపదలోనే మానవుడు ప్రత్యుపకారాన్ని వాంఛిస్తాడు. "అన్నాడు. అనంతరం రామచంద్రుడు తన అవతారాన్ని

చాలించాడు. కానీ ఆయన భక్తుడైన రుద్రాంశాసంభూతుని లీల పూర్తి కాలేదు.

రామచంద్ర భగవానుడు తన ధామానికి పయనం చేసిన తరువాత హనుమంతుడు ఆ దేవదేవుని కళ్యాణ మయ సద్గుణాలనూ, లీలలనూ సంకీర్తనం చేసుకుంటూ తన జీవితాన్ని అత్యంత పవిత్రంగా గడుపుతూన్నాడు. సత్సంగం యెక్కడ జరిగితే అక్కడ హనుమంతుడు ప్రత్యక్ష మవుతూన్నాడు. కింపురుష దేశంలో ఋషిశ్రేష్ఠుడైన ఆర్షిషేణునితో ఉంటూ విశేషంగా భగవత్ గుణగానం చేస్తూన్నాడు. మూడు లోకాలనూ గంధర్వ మధురగానలహరి తన్మయం చేసే సమయాలలో ఆ రామదూత అమృతమయ సంగీతానికి ముగ్ధుడవుతూ శ్రీరామలీలను నయనానంద దాయకంగా చూడగలుగుతూన్నాడు. యుగాలు కాలచక్ర మహావేగంతో లీనమై పోతూన్నాయి. అయినా భగవంతునిస్మరణ, ధ్యానాదులు లేకుండ అతడు ఒక్క క్షణం కూడ వ్యర్థంగా గడపడం లేదు. వైవస్వత మన్వంతరంలో 28వ ద్వాపరంలో భగవానుడు శ్రీకృష్ణరూపంలో అవతరించాడు. శ్రీకృష్ణ- శ్రీరాములలో భేదం యేముంది? కనుక పరమ ప్రియభక్తుడైన హనుమంతుడు లేకుండా భగవంతుడు యేలా ఉండగలుగుతాడు? హనుమంతుని పిలిపించాలని శ్రీకృష్ణ చంద్రునికి సంకల్పం కలిగింది. తద్వారా కొంత లీల జరగవలసి వున్నది. హనుమంతుని దివ్యప్రభావం ముల్లోకాలలో వ్యాపించాలి. శ్రీకృష్ణ సంకల్పమాత్రంచే మారుతి ద్వారకానగర సమీప వుద్యానవనంలోకి వచ్చాడు, రామనామ సంకీర్తనం చేసుకుంటూ పళ్ళు తినసాగాడు. కొమ్మలను విరుగ గొట్టేస్తున్నాడు. ఆ కాలంలోనే ప్రియసతి అయిన సత్యభామాదేవి కోసం శ్రీ:

చంద్రుడు స్వర్గం నుండి పారిజాత వృక్షాన్ని అపహరించుకు వచ్చాడు.సత్యభామాదేవికి తన సౌందర్యంపై అపారగర్వం. దానితోబాటు నాథుడు అందరికంటె యెక్కువగా తననే ప్రేమిస్తున్నాడన్న భావం, అహంకారం ఆమెలో పెరిగిపోతున్నాయి. ఓ రోజున ఆమె ప్రసంగంలో-"ప్రభూ! సీతాదేవి నా కంటె అందమయినదా? మీరు ఆమె కోసం అడవుల పడి తిరిగారు". అంది. అందుకు శ్రీకృష్ణదేవుడు తాత్కాలికంగా మౌనం వహించాడు. దేవేంద్రుని వజ్రాయుధం కంటె నేను గొప్పవాణ్ణి అనుకుంటూ సుదర్శనచక్రానికి కూడ గర్వం కలిగింది, గురుత్మంతుడు కూడ గర్వపడుతూ-నా వల్లనే కదా శ్రీకృష్ణుడు దేవేంద్రుణ్ణి జయించ గలిగాడు. అని అనుకున్నాడు. ఆ ముగ్గురికీ గర్వభంగం చెయ్యాలని వాసుదేవుడు నిశ్చయించుకున్నాడు. "నా సన్నిధిలో ఉంటూ కూడ వీరు గర్విస్తున్నారే? ఇది నేను సహించలేను". అని పరమాత్మ అనుకున్నాడు, వెంటనే ఆ దేవదేవుడు గరుత్మంతుని పిలిచి "గరుడా! మన వుద్యానవనం లోకి ఓ వానరం వచ్చినదట. నువ్వు వెళ్ళి దానిని తీసుకురా. ధైర్యం చాలకపోతే మన సైన్యాన్ని కూడ తీసుకు వెళ్ళు". అన్నాడు.

"సామాన్యమైన ఓ కోతిని పట్టి తీసుకు రావడానికి-నా శక్తి తెలిసి ఉండీ కూడ స్వామి కూడా సైన్యాన్ని తీసుకు వెళ్ళమంటూన్నాడే! ఇది నాకు యెంతటి అవమానకర విషయం? నేనిప్పుడే ఆ వానరాన్ని చూర్ణం చేసి వేస్తాను". అని అనుకుంటూ గరుత్మంతుడు వొంటరి గానే ఉద్యాన వనంలోకి వెళ్ళాడు. అక్కడ హనుమంతుడు పళ్ళుతింటూ "రామనామ" సంకీర్తనలో సంలగ్నమై ఉన్నాడు.

అతణ్ణి గద్దించి తీసుకు వెళ్ళాలని గరుత్మంతుడు ప్రయత్నించాడు. కానీ హనుమంతుడు కదలలేదు. దానితో గరుత్మంతుడు విరుచుకు పడేసరికి హనుమంతుడు అతణ్ణి తోకతో బంధించి నొక్కి వేయడంతో అతడు గిలగిలలాడుతూ శ్రీకృష్ణప్రభువుల పేరు చెప్పి వారి ఆజ్ఞానుసారం వచ్చాననీ దయచేసి తనతో రావలసినదనీ ప్రార్థించాడు. అంత హనుమంతుడు నవ్వు మా "గరుడా! శ్రీరామ శ్రీకృష్ణులతో భేదం లేక పోయినా నేను సీతాపతి అయిన శ్రీరామచంద్రుని దాసుడను. నా హృదయమందిరంలో సదా సీతారాములే భాసిల్లుతూంటారు. నేను శ్రీకృష్ణసన్నిధికి యెందుకు రావాలి?" అంటూ అతడు దైవలీలలకు సహకరించాడు, అయినా గరుత్మంతుని అహంకారం దూరం కాలేదు. పట్టుబడకపోతే తానతణ్ణి బలాత్కారంగా తీసుకు పోగలవాడనే అనుకుంటూ అహంకారాంధుడై మరల హనుమంతుని మీదకు దండెత్తాడు. శ్రీకృష్ణదేవుని సేవకుడని తెలిసిన హనుమంతుడు అతణ్ణి నెమ్మదిగా పట్టుకుని సముద్రం వైపుకు విసిరేశాడు. సాగరంలో పడిపోవడంతో గరుత్మంతునికి దిగ్భ్రమ కలిగింది. అతడు చాలసేపు అక్కడే గిలగిలాడి తరువాత దైవాన్ని స్మరించడంతో అతనికి ద్వారకానగరం కనిపించింది. ఆపై అతడు శ్రీకృష్ణదేవుని సన్నిధానానికి చేరుకున్నాడు. అంతా విని శ్రీకృష్ణ చంద్రుడు చిరునవ్వు నవ్వాడు. గరుత్మంతునికి– తాను మహావేగంగా యెరగల నన్న గర్వం మిగిలి పోయింది. వాయుదేవుడు కూడ తనతో సమానంగా యెగరలేడని అతడు భావిస్తూన్నాడు, హనుమంతుడు తన కన్న మిన్నయైన బలం కలవాడే అయినా ఆకాశ గమనంలో అతని కన్న తానే ఘనుడ ననుకుంటున్నాడు. ఆ గర్వాన్ని కూడ దూరం చెయ్యాలని

కృష్ణపరమాత్మ–"గరుడా! యీసారి నువ్వు వెళ్ళి హనుమంతునితో – నీ యిష్ట దైవమైన శ్రీరామచంద్రుడు నిన్ను ఆహ్వానిస్తున్నాడని చెప్పు. త్వరగా వెళ్ళు. అతణ్ణి నీతో తీసుకురావాలి సుమా! అతడీ సారి నిన్నేమీ చెయ్యడు సరికదా! అవశ్యం గౌరవిస్తాడు" అని ఆదేశించి పంపాడు.

మరల హనుమంతుని దగ్గరకు వెళ్ళడానికి గరుత్మంతుడు భయపడినా–తన ఆకాశ గమన శక్తిని ప్రదర్శించాలని బయలుదేరాడు. అంత శ్రీకృష్ణచంద్రుడు సత్యభామను పిలిచి–ప్రేయసీ! భక్తశిఖామణి అయిన హనుమంతుడు వస్తున్నాడు, మనం యిద్దరం యిప్పుడు సీతారాముల వేషంలో అతనికి కనిపించాలి. నువ్వు సీత రూపంలో రా" అంటూ సుదర్శనుని పిలిచి–"సుదర్శనా! జాగ్రత్తగా కాపలా కాయి. ద్వారకా నగరంలోకి యెవరూ ప్రవేశించకూడదు" అన్నాడు. సుదర్శనుడు కాపలా కాస్తూన్నాడు, సత్యభామాదేవి చక్కగా అలంకరించుకుని సౌందర్యగర్వంతో వచ్చి కూర్చుంది. శ్రీకృష్ణ చంద్రుడు రామభద్రుని రూపంలో కోదండాన్ని చేబూని సుఖాసీను డయ్యాడు.

ఈ సారి హనుమంతునికి దగ్గరగా వెళ్ళడానికి గరుత్మంతుడికి ధైర్యం చాలలేదు. అతడు దూరంగా ఉండియే–"ఆంజనేయా! రామచంద్రప్రభువులు నిన్ను వెంటనే నాతో తీసుకు రమ్మన్నారు. నువ్వు నా వేగంతో రాలేవు కనుక–నా వీపుమీద కూర్చుంటే నిన్ను నా వెంట సునాయాసంగా తీసుకు వెడతాను" అనగా హనుమంతుడు మహానందంతో–"నా ప్రభువులు నన్ను తీసుకు రమ్మన్నారా? నా అదృష్టం యెంత గొప్పది! నువ్వు వెళ్ళు–నేనిదే వచ్చేస్తున్నాను"

అన్నాడు. తాను ముందుగా మహా వేగంతో వెళ్ళిపోతే యితడెప్పటికి చేరుతాడో? అని అనుకున్నాడే కానీ గరుత్మంతుడు హనుమంతుని యెదుట మాట్లడ లేక పోయాడు, తన మహా వేగాన్ని ప్రదర్శించి తన కృష్ణప్రభువును మెప్పించా లనుకున్నాడు. కానీ గురుత్మంతుని కంటె ముందుగానే హనుమంతుడు ద్వారకా నగరం చేరేశాఢు. హనుమంతుని దృష్టిలో అది ద్వారకా నగరం కాదు. – అది అయోధ్యా నగరమే. సింహ ద్వారం దగ్గర హనుమంతుణ్ణి సుదర్శనుడు ఆటంక పరచగా–దైవదర్శన వేళలో ఆటంకాన్ని కలిగించే నువ్వెవరు? రా! అంటూ హనుమంతుడు అతణ్ణి పట్టి మింగేశాడు. శ్రీ కృష్ణ చంద్రుని మందిరంలోకి ప్రవేశించి దృష్టి సారించగా– అతనికి తన యిష్టదైవమైన శ్రీరామ చంద్రప్రభు సందర్శనం లభించింది. కానీ అతనికి సీతామాత కనిపించ లేదు. అంత అతడు భగవంతుని పాదార విందాలపై పడీ–"ప్రభూ! నా తల్లి సీతాదేవి యెక్కడ? నేడు మీ ద్వారా యింతగా ఆదరింపబడుతూ మీ వామభాగంలో సవిలాసంగా కూర్చున్న యీ దాసీ యెవరు?" అనగా సత్యభామ సిగ్గుపడిపోయింది. దానితో ఆమె సౌందర్యగర్వం మటుమాయమై పోయింది. అప్పుడు వాసుదేవుడు "ఆంజనేయా! దారిలో నిన్నెవరూ ఆపలేదా? నువ్విక్కడకు యేలా రాగలిగావు?" అని అడుగగా– హనుమంతుడు తాను మింగిన సుదర్శనుణ్ణి సురక్షితంగా బయట పడవేశాడు. అంత గర్వం అణగిపోవడంతో సుదర్శనుడు చేతులు కట్టుకుని నిలబడ్డాడు. అంత గరుత్మంతుడు ఆయాసంతో వచ్చి చూసేసరికి హనుమంతుడు తనకన్న ముందే వచ్చి కూర్చోవడం గమనించి అతడు శ్రీకృష్ణ దేవుని పాదాల దగ్గర వాలిపోయాడు. ఇలా హనుమంతుని నిమిత్తంగా చేసి పరమాత్మ వారి ముగ్గురి

గర్వాన్నీ దూరం చేశాడు. తరువాత శ్రీకృష్ణ భగవానుడు హనుమంతుని-ద్వారకానగరం యొక్క తూర్పుద్వారం దగ్గర నగర సంరక్షణార్థం నియమించాడు.

చెప్పుకోవడానికైనా హనుమంతునిలో గర్వం కొంచెం కూడ లేదు. అందుకే పరమాత్మ అతని ద్వారా అన్యులైన భక్తుల గర్వాలను అణచి వేస్తూండే వాడు. తాను మహావీరుడ ననీ, ధనుర్వేదపారంగతుడననీ అర్జునునికి తన శరవిద్యపై మహాగర్వం ఉండేది. ఓ నాటి ప్రసంగంలో అతడు శ్రీకృష్ణ దేవునితో - "మాధవా! రామావతార కాలంలో సేతువు నిర్మించడానికి నువ్వు పెద్ద ప్రణాళికను యెందుకు తయారు చేశావు? వంతెనను బాణాలతో కట్టేస్తే సరిపోయేది కదా? పాపం కపులంతా యేంత కష్టపడ వలసి వచ్చిందో?" అన్నాడు. అందుకు వాసుదేవుడు చిరునవ్వు లొలికిస్తూ-"అర్జునా! నీ బాణాలతో సముద్రం మీద ఓ చిన్న ప్రదేశంలో వంతెన కట్టు. ఆపై యేం జరుగుతుందో చూద్దువు గాని" అన్నాడు. అర్జునుడు వెంటనే బాణాలతో వంతెన కట్టేశాడు. అంత శ్రీకృష్ణభగవానుడు హనుమంతుని స్మరించడంతో అతడు ప్రత్యక్ష మయ్యాడు. దైవాజ్ఞను శిరోధార్యం చేసి అతడు ఆ వంతెన మీద యెక్కాడు, అతడు అడుగు తీసి అడుగు వేయకముందే టపటప లాడుతూ వంతెన కూలిపో సాగింది. దానితో అర్జునుడు తల వంచేశాడు. శ్రీకృష్ణచంద్రుని వీపు మీద నుండి రక్తం కారడం చూసి - అదేమిటని అర్జునుడు ప్రశ్నించగా - " నా వీపును వంతెనకు ఆలంబనంగా ఉంచి ఉండకపోతే వంతెనతో కలిసి హనుమంతుడీపాటికే సముద్రగర్భంలోకి దించుకు పోయేవాడు. దానివల్ల నీకు అపకీర్తి కలిగేది. అర్జునా! ఆంజనేయుని వంటి అతి మహాబలశాలురు యెందరో వంతెన మీద నుండి నడచి వెళ్లాలికదా! వారందరూ యిట్టి బాణాలతో నిర్మించబడిన వంతెన మీద యెలా వెళ్ళగలరు?" అన్నాడు. అంత గర్వభంగం కావడంతో

అర్జునుడు సిగ్గుతో తల వంచుకున్నాడు.

రామ రహస్యోపనిషత్తులో - హనుమంతుడు మహా తత్త్వవేత్త అన్న విషయం వివరింపబడింది. సనక, సనందన, సనత్కుమార సనాతన సోదరులు నలుగురూ హనుమంతుని ద్వారా శ్రీరామ మంత్ర రహస్యాలను తెలుసుకుంటూ ఉండే వారు. అతని దగ్గరే అనేకమంది ఋషులూ, మునులూ, ప్రహ్లాదుడూ కూడ శిష్యరికం చేశారు. హనుమంతునకు స్వయంగా రామచంద్రుడే ఉపనిషతత్త్వాన్ని బోధించి నట్లు ముక్తి కోపనిషత్తులో వివరింపబడి ఉంది. అన్ని పురాణాల లోనూ, విశేషించి పరాశర సంహిత, సుదర్శన సంహిత, హనుమద్గహ్వరం-ఆదిగా గల ప్రామాణిక గ్రంథ రత్నాలలో హనుమల్లీలూ, మహిమలూ, అనుష్ఠాన విధానాలూ వర్ణించ బడ్డాయి. ఆ స్వామి లీలలో కొన్నింటిని మాత్రమే యీ పుస్తకరత్నంలో అంద జేయగలిగాను.

మన మధ్యనే తేజరిల్లుతున్న ఆంజనేయమూర్తిని శ్రద్ధాభక్తులతో, విశేషాసక్తి సాధనల ద్వారా తులసీ దాసాదులు యీ యుగంలోనే ప్రత్యక్షం చేసుకున్నారు. ఇంకా యెందరో భక్తులు ఆ దివ్యమూర్తిని సందర్శించారు కూడ. ఆ దివ్య తేజోవిలసితుని అనుగ్రహాన్ని పొందడానికి శాస్త్రాలలో యెన్నో మంత్రానుష్ఠానాలు, యంత్రా రాధనా విధానాలూ ఉన్నాయి. సద్గురువు ద్వారా వాటిని అనుష్ఠించగలిగిన నాడు శ్రీమదాంజనేయ స్వామి వారిని దర్శించ గలుగుతాము. శ్రీస్వామి! వారి స్మరణమాత్రంచే హృదయం పవిత్రమవుతుంది. ఆ దేవదేవుని దివ్యానుగ్రహం లభించి సమస్త సుఖ శాంతులూ లభిస్తాయి.

॥మంగళం మహత్॥

# హనుమదుపాసన

## శ్రీ ఆంజనేయ స్వామి పూజా విధానము

వైశాఖ బహుళ దశమి హనుమజ్జయంతి, ఆ నాడే గాక నిత్యము లేదా ప్రతి శని మంగళవారములు సర్వ జనులు వ్యక్తిగతముగా గాని, సామూహికముగ గాని, తమకు తాముగా గాని, పురోహిత సహాయ ముతో గాని ఆచరించుటకు అనువైన ఆంజనేయస్వామి పూజా విధాన మిది.

ముందుగా దీపారాధన చేసి నమస్కరించి.........

ఆచమనం – కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా, గోవిందాయ నమః, విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః వామనాయ నమః శ్రీధరాయనమః, హృషీకేశాయనమః, పద్మనాభాయనమః దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః॥

ఉత్తిష్ఠంతు భూతపిశాచాః యేతే భూమి భారకాః
ఏ తేషా మవిరోధేన। బ్రహ్మకర్మ సమారభే॥

(ప్రాణాయామము చేసి)

మమోపాత్త సమస్త దురిత క్షయ ద్వారా, శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే, అద్య బ్రహ్మణః

ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే, భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే, కృష్ణాగోదావర్యోర్మధ్యదేశే, శోభనగృహే సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన, ప్రభవాది సంవత్సరాణాం మధ్యే.... నామ సంవత్సరే.... అయనే..... ఋతౌ..... మాసే.... పక్షే... తిథౌ...... వాసరే శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ, (వ్యక్తిగతమైనచో) అస్మాకం, సహ కుటుంబానాం(సామూహిక మైనచో) సహ సమాజానాం, క్షేమస్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం, సమస్త సన్మంగళ ఫలావాప్త్యర్థం, యథాజ్ఞానం, యథామిలితోప చారైః శ్రీ హనుమద్దేవతా పూజాం కరిష్యే, తదాదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం, శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే, తదంగ కలశారాధనం కరిష్యే.

కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణా స్మృతాః । కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా.

ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః॥
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥
గంగే చ యమునే చైవ కృష్ణే గోదావరి సరస్వతీ॥
నర్మదే సింధు కావేర్యౌ జలేస్మిన్ సన్నిధిం కురు॥

ఆయాంతు శ్రీమహాగణాధిపతి పూజార్థం మమ దురితక్షయ

కారాకాః, కలశోదకేన దేవం ఆత్మానం చ పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య॥

శ్రీ మహాగణాధిపతే స్థిరోభవ, వరదోభవ, సుముఖోభవ, సుప్రసన్నోభవ, స్థిరాసనం కురు ॥ శ్లో ॥ స్వామిన్ సర్వ జగన్నాథ యావత్పూజావసానకం । తావత్త్వం ప్రీతి భావేన బింబేస్మిన్ సన్నిధిం కురు ॥ శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి, ఆవాహయామి, రత్నసింహాసనం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయోః అర్ఘ్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి, స్నానం సమర్పయామి. వస్త్రయుగ్మం సమర్పయామి, యజ్ఞోపవీతం సమర్పయామి, శ్రీగంధం సమర్పయామి. అక్షతాన్ సమర్పయామి, పుష్పైః పూజయామి – సుముఖాయనమః ॥ ఏకదంతాయనమః । కపిలాయనమః । గజకర్ణకాయనమః । లంబోదరాయనమః । వికటాయనమః । విఘ్నరాజాయనమః । గణాధిపాయనమః । ధూమకేతవేనమః । గణాధ్యక్షాయనమః । ఫాలచంద్రాయ నమః । గజాననాయనమః । వక్రతుండాయనమః । శూర్పకర్ణాయనమః । హేరంబాయనమః । స్కందపూర్వజాయనమః । శ్రీ మహాగణాధి పతయేనమః । ధూప మాఘ్రాపయామి, దీపం దర్శయామి, ఆచమనీయం సమర్పయామి, నైవేద్యం సమర్పయామి, నీరాజనం దర్శయామి, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి, ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి శ్లో॥ వక్రతుండం మహాకాయం సూర్యకోటి సమప్రభం, అవిఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥ ఇతి ప్రార్థనాం సమర్పయామి, ధ్యానావాహనాది షోడశో పచార పూజయాచ భగవాన్ సర్వాత్మకః.... శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతస్సు ప్రసన్నో వరదో భవతు శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి.

## శ్రీ హనుమద్దేవతా పూజా ప్రారంభః

# శ్రీరామధ్యానమ్.

శ్లో॥ వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితం
అగ్రే వాచయతి ప్రభంజన సుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాభిః పరివృతం రామం భజే శ్యామలమ్।

# ఆంజనేయ ధ్యానమ్.

శ్లో. అతులిత బలధామం స్వర్ణ శైలాభ దేహం దనుజ వన కృశానుం జ్ఞానినా మగ్రగణ్యం సకల గుణ నిధానం వానరాణా మధీశం రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి.

శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవా ధురంధరాయ నమః ధ్యాయామి, ధ్యానం సమర్పయామి.

శ్లో ॥ఆగచ్ఛ హనుమద్దేవ, త్వం సువర్చలయా సహ
పూజా సమాప్తి పర్యంతం, భవసన్నిహితో ముదా ॥

శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధ రాయనమః ఆవాహయామి ఆవాహనం సమర్పయామి.

శ్లో. భీమాగ్రజ మహాప్రాజ్ఞ, త్వం మమాభిముఖో భవ ।
శ్రీరామసేవక శ్రీమన్ ప్రసీద జగతాం పతే॥
హే స్వామిన్, స్థిరోభవ, వరదోభవ, సుముఖోభవ,
సుప్రసన్నోభవ, స్థిరాసనం కురు ॥

శ్లో. దేవదేవ జగన్నాథ, కేసరి ప్రియనందన ॥
రత్న సింహాసనం తుభ్యం, దాస్యామి హనుమత్ప్రభో ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవా ధురంధరాయ నమః
నవరత్న ఖచిత స్వర్ణసింహాసనం సమర్పయామి.

శ్లో. యోగిధ్యేయాంఘ్రిపద్మాయ, జగతాం పతయే నమః ।
పాద్యం మయార్పితం దేవ, గృహాణ పురుషోత్తమ ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః
పాదయోః పాద్యం సమర్పయామి.

శ్లో. లక్ష్మణ ప్రాణ సంరక్ష, సీతాశోక వినాశనః ।
గృహాణార్ఘ్యం మయాదత్తం, అంజనా ప్రియనందన ॥
శ్రీ సీతా సమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః
హస్తయో ః అర్ఘ్యం సమర్పయామి

శ్లో॥ వాలాగ్రసేతుబంధాయ ! శతానన వధాయ చ !
తుభ్యమాచమనం దత్త ! ప్రతిగృహ్ణీష్వ మారుతే ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః
ముఖే ఆచమనీయం సమర్పయామి.

శ్లో. అర్జునధ్వజ సంవాస । దశానన మదాపహ ।
మధుపర్కం ప్రదాస్యామి, హనుమత్ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధ రాయ నమః
మధుపర్కం సమర్పయామి.

శ్లో. గంగాది సర్వతీర్థేభ్యః । సమానీతైర్నవోదకై ః ।
భవంతం స్నాపయిష్యామి కపినాయక గృహ్యతామ్ ॥

శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః।
శుద్ధోదక స్నానం సమర్పయామి.

శ్లో. పీతాంబర మిదం తుభ్యం । తప్తహాటక సన్నిభం ।
దాస్యామి వానర శ్రేష్ఠ సంగృహాణ నమోఽస్తుతే ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః
వస్త్రయుగ్మం సమర్పయామి.

శ్లో. బ్రహ్మసూత్రమిదం దివ్యం । ముక్తా దామోపశోభితం ।
స్వీకురుష్వాంజనీ పుత్ర । భక్త రక్షణ తత్పర ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః ।
యజ్ఞోపవీతం సమర్పయామి.

శ్లో. ఉత్తరీయం తు దాస్యామి । సంసారోత్తారకారణ ।
గృహాణ రమయాప్రీత్యా । స్తవతోస్మిస్తవపాదయోః ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః ।
ఉత్తరీయం సమర్పయామి.

శ్లో. భూషణాని మహార్హాణి కిరీట ప్రముఖాన్యహం ।
తుభ్యం దాస్యామి సర్వేశ ॥ గృహాణ కపినాయక ॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధరాయ నమః ।
ఆభరణాని సమర్పయామి.

శ్లో. కస్తూరీ కుంకుమాన్మిశ్రం । కర్పూరాగురువాసితం ।
శ్రీచందనంతు దాస్యామి । గృహ్యతాం హనుమత్ప్రభో॥
శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవాధురంధ రాయ నమః
దివ్య శ్రీ చందనం సమర్పయామి.

# హనుమదుత్సాహం

సీతాన్వేషణకై అంగద, జాంబవంత, తారాది మహావానరసైన్య పరివేష్టితుడై దక్షిణ దిశా సర్వస్వాన్నీ గాలించి విఫలురైన హనుమదాదులు సంపాతి ద్వారా జానకీ దేవి లంకా నగరంలో ఉన్నదని తెలిసికొని శత యోజన విస్తీర్ణమౌ సాగరోల్లంఘన విషయమై తమ తమ శక్తి సామర్థ్యాదులను వ్యక్తం చేసి తమ అశక్తతకు చింతిస్తున్న వేళలో జాంబవంతుడు అంగదుని వైపు తిరిగి – "వాలి నందనా! ఈ అన్వేషణ కార్యంలో యెట్టి లోపం రాకుండా చేస్తాను. దీనిని సాధించుకు రాగల సర్వసమర్థుణ్ణి లంకా నగరానికి యిప్పుడే పంపుతాను" అంటూ బల, పరాక్రమాదులకూ యెగిరి పోవడానికీ విశేష ప్రసిద్ధిగాంచిన హనుమంతునికై చూశాడు. మారుతి ఆ సమయంలో యేకాంత స్థానంలో కూర్చున్నాడు. సాగర లంఘనానికి అతణ్ణి ఉత్సాహ పరచాలని సంసిద్ధుడయ్యాడు – జాంబవంతుడు.

తత్సమయంలో జాంబవంతుడు కపి శార్దూలుడైన ఆంజనేయుని సమీపించి "హనుమంతా! నువ్వు వానర మహావీర సర్వ శ్రేష్ఠుడవు. సర్వ శాస్త్ర విశారదుడవై కూడ మౌనంగా యేల కూర్చున్నావు? ఈ విషయమై నీకు సంబంధమే లేనట్లు ఊరుకున్నావే? బల పరాక్రమాల విషయంలో నువ్వు మన రాజుకే కాదు రామ లక్ష్మణులకు సరితూగగలవాడవే. ఖగ శ్రేష్ఠుడైన గరుత్మంతుని వలె నువ్వు సర్వ శక్తిమంతుడవు. బుద్ధిబల, దైహికబల, పరాక్రమాల

విషయంలో ఈ జీవకోటిలో నిన్ను మించినదేదీ లేదు. స్వశక్తిని విస్మరించి కూర్చున్నావేమి? నువ్వు వాయు దేవుని ఔరస పుత్రుడవు. వాయు సమ పరాక్రమశాలివి. వాయు నందనుడవు కావడం వల్ల నీ తండ్రితో సమంగా యెక్కడికైనా యెగిరిపోగలవు. నీవు సామర్థ్య పరాక్రమాలలో అపర గరుడుడవు. మమ్మల్ని అందరినీ నువ్వే రక్షించాలి. ఈ కాలంలో మాలో సర్వశక్తి సంపన్నుడవైన నువ్వు తప్ప మరెవరూ యీ సాగరాన్ని లంఘించి పోజాలరు. యావత్ వానర సైన్యమూ భవదీయ పరాక్రమాన్ని సందర్శించాలని భావిస్తూన్నది. ఓ కపిశార్దూలమా! లే. ఈ మహాసాగరాన్ని లంఘించు. నీకు గల గమన శక్తి యే ప్రాణికీ లేదు. వత్సా! వానరులందరూ నిరుత్సాహంతో ఉన్నారు. ఇక ఉపేక్ష యేల? నువ్వు మహావేగంతో పోగలవు. త్రివిక్రమునివలె యీ మహా సాగరాన్ని పదత్రయంతో దాటిపో" అన్నాడు.

భల్లూకపతి అయిన వృద్ధ జాంబవంతుని పలుకు లాలకించిన హనుమంతుడు – స్వశక్తి సర్వస్వాన్నీ గ్రహించాడు. తోటి వానరు లందరూ మహానందం పొందే విధంగా హనుమంతుడు శరీరాన్ని పెంచి విశాలాకారంతో కనిపించాడు. శతయోజన విస్తీర్ణమైన సాగరోల్లంఘనానికి శీఘ్రంగా వర్ధిల్లుతూన్న ఆ కపి శ్రేష్ఠుని వానరు లందరూ చూశారు. వారందరి విచారమూ దూరమైపోయింది. సంతోషాతిరేకంతో వారందరూ సింహ గర్జనలు చేశారు. ఆ మహాబలశాలిని సర్వులూ ప్రశంసించారు. వామనావతార వేళలో వర్ధిల్లిన శ్రీమన్నారాయణుని వలె హనుమంతుడు పెరిగిపోయాడు. అప్పుడా మహాత్ముణ్ణి నాలుగు దిక్కుల నుండి వానరు లందరూ ఆశ్చర్యానందాలతో స్తోత్రం చెయ్య సాగారు. అది చూసి

మారుతాత్మజుడు వాలాన్ని మహోత్సాహంగా ఆడిస్తూ అపరిమితంగా శరీరాన్ని పెంచి మృగరాజులా విజృంభించాడు. తత్సమయంలో ఆ మహనీయుని వదన మండలం మధ్యాహ్న మార్తాండునిలా, లేశ మాత్ర ధూమ రహిత అగ్నిహోత్రం వలె దివ్యకాంతులతో కనిపించింది. ఆ మహా వానర సమూహం మధ్య లేచి నిలబడి ఉన్న హనుమంతుని శరీరం మీది రోమజాలం ఆనందాతిరేకం వల్ల నిక్కపొడుచుకుంది. తత్సమయంలో అతడు వానర సైన్య సర్వస్వాన్నీ తిలకించి - వానర వృద్ధులందరికీ ప్రణమిల్లి గంభీరంగా పలికాడు.

"కపి శ్రేష్ఠులారా! అగ్ని సఖుడైన వాయుదేవుడు అపార బల సంపన్నుడు, గమన శీలుడు, ఊహాతీత, గణనాతీత శక్తి సంపన్నుడు, ఆకాశంలో విహరిస్తూంటాడు. గిరి శిఖరాలను కూడ కూల్చివేస్తూం టాడు. నేనా వాయునందనుడను, తత్కారణంచే నాతో సమంగా యెగిరి పోగల వాడు లేనే లేడు. అంబరాన్ని చుంబించు నట్టి సుమేరు గిరి అత్యంత విశాలమయింది. నేనా మహాగిరికి ప్రదక్షిణం చేస్తూ సహస్ర పర్యాయాలు తిరిగి రాగలను. నా విశాల బాహువులతో సాగర సలిలాలను తోసి వేసి నదీనద పర్వతారణ్య సరోవరయుతమైన ఈ భూమండలాన్ని మహా సాగరంలో ముంచి వేయగలను. నేను పురోగమించే వేగానికి సాగర సలిలాలు పైకి లేచి పోతాయి. తత్కారణం వల్ల సముద్ర జలాలలో ఉండే మహా మకరాలన్నీ ఆకాశ వీధిలో గోచరమవుతాయి. ఆహారార్థం పాములను పట్టుకోవ డానికి మహా వేగంతో ఆకాశంలోకి తీవ్ర వేగంతో పరిభ్రమించే ఖగరాజైన గరుత్మంతుని వలె సహస్ర పర్యాయాలు తిరిగి వచ్చే శక్తి నాకు ఉంది. ఉదయాద్రి నుండి బయలు దేరిన

సూర్యునితో నేనూ బయలు దేరి అతని కన్న ముందుగా అస్తాద్రి చేరి మరల సూర్యుడు ఆకాశ మధ్య భాగంలో భాసించే సమయానికి అతని కెదురు పడి క్రిందికి దిగి ఈ పృథ్విపై విశ్రాంతి తీసుకోకుండా మరల ప్రచండ వేగంతో సూర్యునికి యెదురు రాగలను. ఆకాశ చారులైన సమస్త జీవుల కంటె మహా వేగంగా నేను పురోగమించగలను. కపి శ్రేష్ఠులారా! సాగరాన్ని నేను కలవరపెట్టగలను. పృథ్విని చీల్చి వేయగలను. ధరాధరాలను పిండీ భూతం చేయగలను. ఎగిరే వేళలో నా జఘన వేగానికి సాగరం నన్ను వెంబడిస్తుంది. ఇప్పుడు నేను అంబరమార్గానికి యెగురగానే యిక్కడి వృక్షాల తాదులూ, పుష్పాలూ నాతో యెగిరి నన్ను వెంబడిస్తాయి. నా వెంబడి అలా వచ్చే పుష్పాల వల్ల నేను పురోగమించే అంబర మార్గం స్వాతీ పథంగా గోచరమవుతుంది. ప్లవగోత్తములారా! ఆకాశానికి నేను యెగరడమూ, ఆ మార్గంలో పురోగ మించడమూ, అంబర వీథి నుండి క్రిందకి దిగడమూ వీటన్నిటినీ సర్వులూ యేక కాలంలోనే జరగడంగా చూస్తారు. మహావిశాల మేఘ సమ శరీరంతో అంబరాన్ని కబళించే వాని వలె నేను మీకు గోచర మవుతాను. తత్సమయంలో నా వేగానికి మేఘ సమూహాలు చెల్లాచెదరై పోతాయి. గిరులన్నీ కంపిస్తాయి. సాగరం అల్లి కల్లోల మవుతుంది. వాయు దేవునికీ, ఖగపతి అయిన గరుత్మంతునికీ వినా నాతో సమంగా ఎగిరే శక్తి ఈ విశ్వంలో మరెవరికీ లేదు. చరాచర జగత్తులో నా వేగాన్ని అను సరించగల వారెవరూ లేరు. ఆధారమే లేని అంబర వీధిలో మెరుపు తీగలా నేను పురోగమించి పోయేవేళలో వామనావతార వేళలోని త్రివిక్రమ భగవానునిలా ఉంటాను. జానకీమాతను చూసినట్లే నా బుద్ధికి విశ్వాస పూర్వకంగా యిప్పడే గోచర మవుతున్నది. మీ

రిక్కడ ప్రసన్నంగా నిశ్చింతగా ఉండండి. దశ సహస్ర యోజనాల దూరం పోగలనని భావిస్తున్నాను. బ్రహ్మేంద్రాదులలో యెవరినైనా సరే సునాయాసంగా జయించి వారి హస్తాల నుండి అమృత భాండాన్ని లాగుకుని మహావేగంతో తీసుకురాగలను. అంతే కాదు, లంకానగరాన్నంతటినీ ఊడబెరికి తీసుకు రాగలనన్న భావం నాలో కలుగుతూన్నది. "అంటూనే ఆ వానరోత్తముడు ఒక్క సారిగా గర్జించాడు.

మహా బల పరాక్రమ సంపన్నుడైన ఆ కపి శ్రేష్ఠుని తిలకించి వానరులందరి కందరూ మహానందం చెందారు. ఆశ్చర్యపడి విచారాన్ని పోగొట్టుకున్న వారైనారు. అంత వారిలో వృద్ధ శ్రేష్ఠుడైన జాంబవంతుడు మహానంద పరవశుడై "వానర వీరాగ్రేసరా! వాయునందనా! నీవీ సమయంలో నీ వారందరి క్లేశాన్ని దూరం చేశావు. వీరందరూ నీకు శుభ విజయ మంగళ పరంపరలు చేకూరాలని ప్రయత్న పూర్వకంగా పరమాత్మను ధ్యానిస్తూంటారు. మహర్షుల, కపి శ్రేష్ఠుల, పెద్దలందరి అనుగ్రహం వల్లా నువ్వు సునాయాసంగా సముద్రాన్ని దాటి పోగలవు. నువ్వు మరలి వచ్చే వరకూ మే మందరమేక పాదం మీద నిలబడి నిరీక్షిస్తూంటాము. నీ హస్తాలలోనే మా అందరి ప్రాణాలూ ఉన్నాయి" అన్నాడు.

"వానర వీరులారా! లంఘన వేళలో నా తీవ్ర వేగానికి పృథ్వి స్థిరంగా ఉండజాలదు. దృఢమైన పాదాలతో ఉన్న యీ మహేంద్ర గిరి ప్రదేశం మాత్రం నా వేగానికి ఆగ గలదు. కనుక యిప్పుడే ఈ గిరి మీదకు వెడుతున్నాను. ఇక్కడ నుండి నేను శత యోజనాలు లంఘించాలి" అంటూ శత్రు మర్దనుడైన వాయునందనుడు,

సర్వ కార్య నిర్ణయ సమర్థుడవూ, నిర్ణయించిన కార్య విషయాలను వివరించి వచించడంలో కుశలుడవూ అయిన నీకు సాటి అయినవాడు వేరొకడు లేడు. ప్రసంగించే శక్తి విషయంలో నిన్ను అధిగమించిన వారెవరూ లేరు. మిగిలిన అమాత్యులు వ్యక్తం చేసిన అభిప్రాయాలు దోషభూయిష్టమని అనడమూ లేదు. అందుకై నేను ప్రసంగించడం లేదు. నీకు నేను బోధించ తగిన వాణ్ణి కాకపోయినా నాకు తోచిన విషయాన్ని చెబుతూన్నాను. నా అంతటి యోచనా శక్తి సంపన్నుడు లేడనీ నేను భాషించడం లేదు. లంకలో ఈ విభీషణుడు నాకు అనుకూలంగా మాట్లాడాడనే భావంతోనూ నేను మాట్లాడడం లేదు. శ్రీరామచంద్ర ప్రభూ! నాకు నీ మీద ఉన్న విశేష గౌరవం వల్ల నాకు సత్యమని తోచిన విషయాన్ని చెబుతూన్నాను ప్రభూ! విభీషణుని మంచి చెడ్డలను గురించి విమర్శించి తెలుసుకుని అతణ్ణి మనలో చేర్చుకోవడమో, మానడమో చెయ్యమని మన అమాత్యులలో కొందరు స్వాభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. ఇందులో స్పష్టంగా ఓ దోషం గోచరమవుతూన్నది. ఏదైనా విశేష రాచకార్యాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తేనే తప్ప ఒకని గుణ దోషాలు తెలియవు. విశేషమైన రాచకార్యంలో వినియోగించిన నాడు కదా ఆ వ్యక్తియొక్క గుణ దోషాలు మనకు తెలిసేది. కనుక ఈ పద్ధతికి పరస్పరాశ్రయ దోషం పట్టింది.

విభీషణుని దగ్గరకు గూఢచారి నెవరినైనా పంపి వాని మంచి చెడ్డలను తెలుసుకోవాలని మన వారిలో ఒకరు స్వాభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. అదీ యుక్తి యుక్తంగా లేదు. బహు దూర ప్రదేశంలో ఉన్న వ్యక్తిని గురించి తెలుసుకోవడానికి గూఢచారిని పంపితే

వాడక్కడకు వెళ్లి అతణ్ణి గురించి సర్వమూ తెలుసుకు రాగలుగుతాడు. అది మాత్రం సమంజసమైన విషయమా? కానీ సమక్షంలో నిలిచి ఉన్నవాణ్ని సమీపించి యేమి తెలుసుకోగలుగుతాడు? మన అమాత్యులలో ఒకడు యీ రావణ సోదరుడు అనుచిత స్థలానికి అకాలంలో వచ్చాడన్నాడు. ఇది మాత్రం యేమి బాగుంది ప్రభూ! విభీషణునికి – తన అన్న అధముడనీ, నువ్వు మహాత్ముడవనీ తెలుసు. ఈ విషయాన్ని నిశ్చయించుకుని మనసా తర్కించుకునియే నీ ఆశ్రయాన్ని అర్థించి వచ్చి ఉంటాడు. జానకీ దేవిని తన అన్న అపహరించడమూ, ఆ విషయమై తాను సదుపదేశం చేసినా అతడు తిరస్కరించడమూ అతనికి అనుభవనీయ విషయమే కదా! ఖరదూషణ త్రిశిర, వాలి – ఆదిగా గల వారి నందరినీ నువ్వు అంతం చెయ్యడమూ, సుగ్రీవుని కిష్కింధాధిపతిగా పట్టాభిషిక్తుని చేయడమూ అతనికి తెలిసిన విషయాలే. నీ పరాక్రమ శక్తి సామర్థ్యాదులను గ్రహించడమే కాదు – అనుల్లంఘనీయమైన మహా సాగరాన్ని దాటి లంకను ముట్టడించడం కోసం నువ్విక్కడకు యీ సమయంలో రావడం కూడ గ్రహించి అతడు నీ సన్నిధానానికి శరణార్థియై వచ్చాడు. విభీషణుడు నిన్నాశ్రయించడానికి సముచిత స్థాన, సమయాలు రెండూ యివే. మన అమాత్యులలో ఒకడు విభీషణుని చెంతకు గూఢచారిగా వెళ్లి అనేకానేకమైన ప్రశ్నలు వేసి ఆ స్థితిలో వాని మంచి చెడ్డలను తెలుసుకోవాలన్నాడు. అదీ జరిగే పని కాదు. ధీశాలి అయిన విభీషణుడు గతంలో తనకు పరిచయం లేని వ్యక్తికి – బదులు పలకడం వల్ల వచ్చే అనర్థాన్ని ముందుగా ఊహించి మౌనంగా ఉండిపోతే మనవారేమి చేయగలరు? బదులు చెప్పలేదు కనుక మనవారు అతణ్ణి దోషిగా భావించవచ్చును.

అడిగారు కదా - అని సర్వ్రులూ స్వ విషయాలను సరళంగా చెయ్యరు. ఆ నియమం యెవరికీ ఉండదు కూడ. శత్రువులలో వైర భావాలను రేకెత్తించి కొందరిని వేరుచేసి మనలో చేర్చుకోవలసి ఉండగా - వారు పరస్పరం భేద భావాలు కల్పించుకుని తమంత తామై రాగా - అట్టి వాళ్ళను ప్రశ్నించడం అవివేకమే అవుతుంది. దాని వల్ల మిత్రలాభాన్ని పోగొట్టుకున్నవార మవుతాము. ఇది నీతి శాస్త్ర సమ్మత విషయమే కాదు. రామ ప్రభూ! ఈ సమాజంలో మనం మనస్సు విప్పి మాట్లాడితేనే యెదుటి వారు కూడ నిష్కపటంగా వ్యవహరించ గలుగుతారు. మన వ్యవహారం కపటంగా ఉంటే వారూ అలానే ప్రవర్తిస్తారు. మనకున్న తెలివి తేటలు పరాయి వారికుండవను కోవడం బుద్ధి తక్కువే కాదా! బుద్ధిమంతులైనవారు కుటిల ప్రశ్నలకు కుటిలంగానే సమాధానం యిస్తారు. కనుక యీ మార్గాన్ని అవలంబించడమూ వ్యర్థమే. రామ ప్రభూ! పరేంగితాన్ని, ఆకార చేష్ట సంభాషణా విధానాన్నీ బట్టి యెదుటివారి అంతరంగాన్ని కొందరు గ్రహిస్తూంటారు, సంభాషణా సన్నివేశంలో యీ విభీషణునిలో యెట్టి దుష్ట స్వభావమూ గోచరం కాలేదు. ఇంగితం ద్వారా దీని ననుసరించి యితడు దుర్మార్గుడు కాడని స్పష్ట మవుతూన్నది. ఎంతమాత్రం వికారం లేకుండ యితని ఆకారం గోచరమవుతూన్నది. ద్రోహి అయితే బహుదూరాన్నుండి యిక్కడకు వచ్చి యింత ధైర్యంగా భాషించ గలడా? కనుక వీని ప్రవర్తనలో లోటు యీ షణ్మాత్రం కాన రావడం లేదు. ఇతని ప్రసంగంలో సంశయం కానీ, ఆతురత కానీ కానరాలేదు. అంటే యితని భాషా శుద్ధిలో లోటు కనిపించలేదు, ఎంతగా దాచి పెట్టాలని ప్రయత్నం చేసినా కపట భావంతో

వచ్చిన వాని అంతరంగం వ్యక్తం కాక మానదు. అది విధిగా బయటపడి తీరుతుంది. ప్రభూ! కార్య సాధకులలో నువ్వు శ్రేష్ఠుడవు. నీ అంత వానికి యీ దాసుడు చెప్పవలసినది లేదు. దేశ కాల జ్ఞానంతో కొనసాగించే కార్యాలు శీఘ్రంగా సత్ఫలితాలను ప్రసాదిస్తాయి.

"రామ ప్రభూ! భవదీయ అసమాన పరాక్రమ ధార్మికత్వాలను గురించి విశేషంగా తెలుసుకున్న ఈ విభీషణుడు - సోదరుడైన దశకంఠుని దుష్ట వ్యాపారాదులను స్వయంగా చూసి గ్రహించిన వాడు. మహా బలశాలి అయిన వాలిని అంతం చేసి నువ్వు కపి శ్రేష్ఠుడైన సుగ్రీవుణ్ణి కిష్కింధాధిపతిగా చేసిన విషయాలను విని లంకా రాజ్యాన్ని తనకు ప్రసాదించుమని అర్థించ వచ్చాడు. శరణాగతుడైన వీనిని నువ్వు నీ వాణ్ణిగా ఆదరించి నీ సన్నిధానంలో ఉంచుకోవాలి. ప్రభూ! ఈ విభీషణుడు దోషి కాడని నాకు తెలిసినంత వరకూ చెప్పాను. శేష కార్యాన్ని పూర్తిచేయ వలసిన వాడవు నువ్వు" అని సార్థకంగా మృదు మధుర మనోహరంగా పలికి మౌనం వహించాడు.

**(వాల్మీకి రామాయణం యుద్ధకాండ నుండి)**

# గూఢచారి సారణుడు మారుతిని పరిచయం చేయడం.

వానర సైన్యాన్ని చూపిస్తూ శక్తి వంచన లేకుండ ఆ వానర వీరులను గురించి రావణాసురునికి సారణుడనే రాక్షస గూఢచారి పరిచయం చేస్తూ హనుమంతుని గురించి యిలా చెబుతున్నాడు:-

ప్రభూ! అలా దృష్టిని పోనీ, మదించిన యేనుగులా నిలబడి ఉన్నవాడు యెవరో కాదు - ఇంతకు పూర్వమే మన నగరానికి వచ్చి జానకీదేవిని సందర్శించి నీతో నిర్భయంగా భాషించి పోయి మరలి వచ్చినాడు. కేసరి పత్ని అయిన అంజనకు ప్రభవించిన యితడు హనుమాన్నామధేయుడు. ప్రపథమంగా సముద్రాన్ని లంఘించిన కపి శ్రేష్ఠుడితడే. కుపితుడైతే స్వబల పరాక్రమాలతో సముద్రాన్నైనా అల్లకల్లోలం చేసివేయగలడు, స్వేచ్ఛారూపధారణా శక్తిసంపన్నుడైన యితడు స్ఫురద్రూపి, మహా బలశాలి. నిరాటంకంగా వాయు సమంగా యితడెక్కడికైనా పోగలడు. ఇతణ్ని గురించి విశేషంగా తెలిసిన నాకు అప్పుడైన వాడు చెప్పిన దానిని నీకు యథాతథంగా చెబుతాను:

మహాబల దర్పాలతో యితడు ప్రభవించాడు. బాల్యావస్థలో ఓ నాడు ఉదయ వేళలో వీనికి తీవ్రమైన ఆకలి వేయడంతో యితడు ఉదయ భానుని అరుణ బింబాన్ని పక్వఫలంగా భావించి దానిని తినాలని మూడువేల యోజనాల దూరం పైకి యెగిరాడు. తత్సమయంలో జరిగిన సంఘటన వల్ల యితడు పర్వతం మీద పడిపోగా వీని హనువు దెబ్బ తినడం వల్ల యితనికి హనుమంతుడన్న

సార్థక నామం యేర్పడింది. అతులనీయ బలశాలీ అనన్యమైన మహోన్నతా కారుడూ. అపార ప్రభావ సంపన్నుడూ, అద్వితీయ వాక్చతురుడూ అయిన యీ వీరుడు ఏకమాత్రుడిగానే మన నగరాన్ని కొట్టాలి - అనుకుంటున్నాడు.

## రామ ప్రశంశ.

(సీతాన్వేషణ కార్యాన్ని శ్రీ సంపన్నం చేసి అక్కడి వృత్తాంతాన్ని శ్రీరామచంద్రులకు సవిస్తరంగా వినిపించి సీతాదేవి ఆనవాలుగా యిచ్చిన చూడామణిని ఆ పురుషోత్తమునకు ప్రసాదించాడు హనుమంతుడు.

తత్సమయంలో హనుమంతుని సంభాషణా సర్వస్వాన్నీ ఆలకించిన శ్రీరామచంద్రుడు పరమ ప్రసన్నుడై - కపులారా! ఈ పృథ్విపై మారుతి అత్యంత దుర్లభమైన మహత్కార్యాన్ని సాధించాడు. అన్యు లెవరూ దీనిని మనసా కూడ చేయజాలరు. ఇంత వరకూ వాయుదేవ, గరుత్మంత, హనుమంతాదులు వినా అన్యులెవరూ మహాసాగరాన్ని లంఘించి ఆవలి తీరం చేరినట్లు విన లేదు. భవిష్యత్తులో యిట్టి వారిని చూడజాలము కూడ. సురాసురాదులకు కన్నెత్తి చూడ నలవి కానట్టి లంకా నగరం చేరి అన్యు లెవరైనా సజీవంగా బయటపడగల రంటారా? మరలి రావడం మాట అలా ఉంచగా కళ్ళెత్తి చూడడానికి వీలు లేకుండా ఉండేటట్లున్న రాక్షస రక్షితమైన లంకా నగరాన్ని మన మారుతి సమ బలశాలి వినా అన్యుడెవడూ ఆకాశచారి అయి పోగలడా? ప్రభువైన సుగ్రీవునికి మారుతి చేసిన సేవా కార్యం మహత్తరమైనదే. కేవలం అసాధ్యకార్యాన్ని

సాధించడమే కాకుండ నిజ పరాక్రమానుగుణంగా నిజ బల సర్వస్వాన్నీ ప్రదర్శించ గలిగాడు. కేవలం చెప్పిన పని ఒక్కటీ చేసుకురావడం కాకుండ శేషించిన ప్రయోజనకరమైన కార్యాల నన్నిటినీ చక్క జేసుకు వచ్చాడు. సేవక శ్రేష్ఠుడుగా యిట్టివాడే పరిగణనకు వస్తాడు. మహోత్సాహియై, సమర్థుడే అయినా కేవలం ప్రభువు ఆదేశించిన కార్యాన్ని మాత్రమే సాధించుకుని - తన స్వామిని ప్రసన్నుణ్ణి చేసుకోదగిన అన్య కార్యాలను సాధించకుండ మరలి వచ్చేవాణ్ణి మధ్యముడంటారు. హెచ్చరిక కలిగి, ఉత్సాహవంతుడై సమర్థుడై కూడ ప్రభు కార్యాన్ని సాధించకుండ మరలి వచ్చే వాణ్ణి- అధముడంటారు. మారుతి - నిర్దేశిత కార్యాన్ని సాధించడమే కాకుండ తన స్వామికి సంతోషాన్ని కలుగ చేసే మహత్వాన్ని ప్రదర్శించాడు. ప్రభు భక్తి పరాయణుడై సీతను దర్శించడం వల్ల నన్నూ మహాబలశాలి అయిన సౌమిత్రినే కాదు రఘువంశ సర్వస్వాన్నీ సంరక్షించాడు. పరమ సంతోషప్రదమైన శుభవార్తను జెప్పిన ఈ మారుతిని ప్రస్తుతం దీన స్థితిలో ఉండడం వల్ల నాకు తగిన స్థాయిలో సత్కరించలేక పోతూన్నాను. ఇందుకు నేను విశేషంగా దుఃఖిస్తూన్నాను. ఈ మహా బలశాలికి యీ స్థితిలో నేనీయ గలిగినది దృఢాలింగనం మాత్రమే. నా సర్వస్వమూ యిదే కూడ" అంటూ ఆనంద పులకాంకితుడయ్యాడు. కృతకృత్యుడైన మహాబల పరాక్రమశాలి అయిన మారుతిని గాఢాలింగనం చేసుకున్నాడు. ఈ ఘట్టం హనుమంతుని జీవితంలో మరపురానిది.

# మహోపదేశం

(అశోకవన విధ్వంస, అక్షయ కుమారాది రాక్షస సంహారానంతరం–ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి బద్ధుడైన వాని వలె నటిస్తూ రజ్జు బంధితుడై సామాన్యునివలె రావణ సభాభవనంలో మహా గజంలా ప్రవేశించాడు హనుమంతుడు.

మహా రత్నాలతో అలంకరింపబడి ఉన్న ఆ మహా సభా మందిరంలో రాక్షసేంద్రుడైన రావణునీ, ఆతని చరణాల వద్ద ఉన్న వృద్ధామాత్యులనూ మారుతి తిలకించినాడు. వికారాకారులైన తన అనుచరులచే యీడ్చుకు రాబడుతున్న మహాతేజస్వి అయిన మారుతాత్మజుణ్ణి లంకాధిపతి చూశాడు. ఆ మారుతాత్మజుడు తత్సమయంలో మధ్యాహ్న మార్తాండ సదృశంగా భాసిల్లి పోతూ న్నాడు. భయంకర పరాక్రమశాలి అయిన హనుమంతుడు క్రోధారుణ నేత్రాలతో రావణుని వైపు చూడ సాగాడు. భయంకర పరాక్రమ వంతులైన రాక్షసులు తనను వేధిస్తూన్నా హనుమంతుడు లంకాధినాథుని మహావైభవానికి నిశ్చేష్టుడై మనసా యోచించ సాగాడు:

"ఆహా! యేమి రూపమీ రాక్షస రాజుది? వీని ధైర్య తేజోబలాదులు ఆశ్చర్యాన్ని కలుగజేస్తున్నాయి. సమస్త శుభ లక్షణ లక్షితుడై ఉన్న వీనిలో పరదారాపహరణ రూపమైన అధర్మం ఒక్కటీ లేకుంటే దేవేంద్ర సమేతంగా అమర లోకానికే యేలిక కాగలిగే వాడే, జనకంటకమై, భయంకర క్రూరమై వీడు చేసిన దుష్టకార్యాలకు సర్వలోక వాసులూ పీడింపబడి భయపడిపోయారు. వీణ్ణి చూస్తూంటే– వీడే కుపితుడై తే ప్రపంచాన్నే సాగర గర్భంలో ముంచి వేయ కలడనిపిస్తూన్నది".

అనంతరం రావణా దేశానుసారం ప్రహస్తుడు ప్రశ్నించగా మారుతి స్వీయ ధోరణిలో పలికిన పలుకులను తిలకించండి. హనుమంతుడు రావణుని వైపుచూస్తూ "ఓ రాక్షసరాజా! యమవరుణ దేవేంద్రాదులలో యెవడినీ కాని నేను వారి దూతను కూడ కాదు. కుబేర మిత్రుడను కాని నేను మహావిష్ణువు పంపగా వచ్చిన వాడను కాదు. వానరుడనైన నేను నిన్ను చూడాలని వచ్చాను. నా వంటి సామాన్య వానరునికి నీ దర్శనము కాదు కనుక అశోక వనం విధ్వంసం చేసి-బలవంతులైన నీ సేవకులు నాతో యుద్ధానికి రాగా ఆత్మ రక్షణార్థం నేను చేసిన ప్రయత్నంలో వారు నా చేతులలో అంతమై పోయారు. సురాసురులే కాదు మరెవరూ కూడ యెట్టి అస్త్రంతోనూ, పాశంతోనూ కూడ బంధించ లేరు. ఈ వరంనాకు బ్రహ్మదేవుని ద్వారా లభించి ఉంది. నీ సేవకులు సామాన్యమైన త్రాళ్ళతో నన్ను బంధించి తెచ్చారు. రాచ కార్యార్థినై నేనిక్కడకు వచ్చాను. అప్రమేయ బలశాలీ, అమిత తేజస్వీ అయిన శ్రీరామచంద్ర ప్రభువు నన్ను దూతగా నీ దగ్గరకు పంపాడు, రాక్షసరాజా! నీ హితాన్ని కోరి నేను పలికే పలుకులను సావధానంగా ఆలకించు" అంటూ అతడు మహాబలశాలి అయిన ఆ రాక్షసరాజును చూస్తూ నిర్భయంగానూ, అర్థవంతంగానూ పలక సాగాడు

"ఓ రాక్షస రాజా! కపి రాజైన సుగ్రీవాజ్ఞానుసారం నేనీ లంకా నగరానికి వచ్చాను. వానరేశ్వరుడైన సుగ్రీవుడు నీకు సోదరసముడు, నీ క్షేమాన్ని విచారించి రమ్మని నాతో చెప్పి ఉన్నాడు. ఇహపర సౌఖ్య ప్రదమూ, ధర్మార్థయుక్తమూ అయిన విషయాలు చెబుతాను విను, అయోధ్యా నగరాన్ని పాలించే దశరథ మహారాజు జ్యేష్ఠ

పుత్రుడైన రాముడే ఆయనకు ప్రియమైన వాడూ కూడ. మహా తేజశ్శాలీ, మహాబాహువూ అయిన ఆతడు తండ్రి ఆదేశానుసారం అర్ధాంగి అయిన సీతా దేవితో సోదరుడైన లక్ష్మణునితో దండ కారణ్యానికి వచ్చాడు. జనకరాజ నందిని అయిన జానకీదేవి అరణ్యాలలో కనపడకుండ పోయింది. భార్యాన్వేషణలో సోదర సమేతంగా శ్రీరాముడు ఋష్యముకాద్రికి వచ్చిసుగ్రీవునితో స్నేహం చేశాడు. సీతాన్వేషణ చేస్తానని రామసన్నిధిలో ప్రమాణం చేయగా-శ్రీరాముడు వాలిని అంతం చేసి సుగ్రీవుని కిష్కింధాధిపతిని చేశాడు. రావణా! ఆ వాలిని గతమందే యెరిగిన వాడవు కదా! ఏకమాత్ర బాణంచే ఆ వాలిని రాముడు నేలకూల్చినాడు. ప్రతిజ్ఞను తప్పని సుగ్రీవుడు సీతాన్వేషణకై వానర సమూహాలను దశదిశలకూ పంపివేశాడు. ఇప్పుడు భూమ్యాకాశ పాతాళాలలో అసంఖ్యాక వానర గణాలు సీతాన్వేషణలో ఉన్నారు. భూమిని స్పృశించ కుండ ఆ వానరులలో పురోగమించి పోగల మహా వేగులున్నారు. గరుడ సమ వేగులు కొందరున్నారు. వాయు వేగంతోనూ పోగలవారున్నారు. వాయు నందనుడనై నన్ను హనుమంతుడంటారు. నేనూ సీతాన్వేషణార్థినై బయలు దేరి శత యోజన విస్తీర్ణమైన సాగరాన్ని లంఘించి నీ యీ నగరం అంతా తిరిగి నీరక్షణలో ఉన్న జనకాత్మజను చూచినాను, రాక్షసరాజా! నువ్వు సర్వ శాస్త్రాలూ చదివి ధర్మ స్వరూపాన్ని గ్రహించిన వాడవు. మహత్తరమైన తపస్సును దీక్షగా చేసిన ప్రాజ్ఞుడవు. నీ వంటి వానికి పరదారాపహరణము సముచితమైనది కాదు. నీ వంటి ధీశాలురు యిట్టి ధర్మ విరుద్ధకార్యాలు ఆచరించరు. నీకీ దుష్కార్యం ద్వారా అనేకమైన అపాయాలు వస్తాయి. అంతేకాదు. ఫలితంగా నీ

సర్వాన్నీ నాశనం చేసి వేస్తుంది. రాజా! రామలక్ష్మణులు కుపితులయితే విడిచే బాణాల కెదురై-సురాసురులలో ఒక్కడు కూడ నిలబడ లేడు. రామునికి అపరాధం చేసి జగత్త్రయంలో యెవ్వరూ క్షేమంగా ఉండలేరు. నువ్వు చేసినది అధర్మమన్న మాటను సుగ్రీవుడు నీకు చెప్పి జానకీ దేవిని శ్రీరామునికి తిరిగి యిచ్చివేయుమని చెప్పమన్నాడు. తద్వారా అధర్మ దూరుడవై నువ్వు సర్వైశ్వర్యాలతోనూ ఉండగలుగుతావు.

"సీతాదేవిని నేను తెచ్చానని నీకెవరు చెప్పారని అడుగుతావేమో? సీతాదేవిని నేను కళ్ళారా చూశాను. సర్వ వానర దుర్లభమైన జానకీదేవి దర్శనం యీ నగరంలో నాకు మాత్రమే అయింది. శేష కార్యాన్ని రాముడే చూసుకుంటాడు. ఇప్పుడామె శోక పరాయణగా ఉంది. ఆమె నీ ఆధీనంలో ఉందనుకొంటూన్నావే కానీ - నీ ప్రాణాలను తీయడానికి తెచ్చుకున్న పంచ శిరస్సులు కల కాల సర్పమని గ్రహించలేకున్నావు. జఠరాగ్ని తేజస్సు యెంతగా ఉన్నా విషమిశ్రితాన్నాన్ని భక్షించి బ్రతికి బయటపడడం అసంభవమేకదా! సురాసురులంతా యేకమై స్వాధీనం చేసుకున్నా ఆ జానకీదేవిని తన దానినిగా చేసుకోవడం అసంభవమే రావణా! నువ్వు అత్యధిక శ్రమకోర్చి మహాతపస్సు చేసినావు. ఆ మహా తపశ్శక్తిని నాశనం చేసుకోరాదు. సురాసురులచే మరణం లేకుండ వరాలను పొందానని అహంకరిస్తూన్నావేమో? సుగ్రీవుడు-సురాసుర యక్షగంధర్వ పన్నగులలోని వాడు కాదు-అతడు వానరుడు. వాని చేత మరణం లేకుండా నువ్వెలా బయటపడతావో చెప్పు. అధర్మాన్నిఅంతం చేసి ధర్మాన్ని సత్ఫలితాలను ప్రసాదిస్తుంది. అధర్మం ఎన్నటికీ

ధర్మాన్ని జయించ లేదు. ఇతః పర్యంతం సత్కర్మల ఫలంగా సంపాదించుకున్న ధర్మ ఫలాన్ని నువ్వు అనుభవించావు. అచిర కాలం లోనే అధర్మ ఫలాన్ని అనుభవిస్తావు. ఏకమాత్ర వీరుడుగా రాముడు జనస్థానీయులను సర్వ రాక్షసులనూ అంతం చేశాడు. ఏకమాత్ర బాణంతోనే వాలిని నేలకూల్చాడు. ఇప్పుడు రామ సుగ్రీవులిద్దరూ మిత్రులయ్యారు. నీకు శ్రేయస్కరమైన దేదో నువ్వే యోచించుకో".

రథాశ్వ గజ సమేతమైన నీలంకా నగరాన్నంతటినీ ఏకమాత్రుడనైన నేనే నాశనం చేసి వేయగలను. కానీ యిందుకు నా కనుమతి లేదు. జానకిని అపహరించుకు పోయిన శత్రువులను తానే అంతం చేస్తానని శ్రీరామచంద్రుడు వానర భల్లూకాల సమక్షంలో శపథం చేశాడు. కనుక ఆ కార్యాన్ని నేను చెయ్యను. రావణా! సాక్షాత్తూ అమరేంద్రుడైనా శ్రీరామునికి అపరాధం చేసి ఉండ లేడు. ఇక నీ వంటి వాని విషయం వేరే వివరించాలా? నీ వనంలో ఉన్న సీతాదేవియే నీ రాజ్య సర్వస్వాన్నీ అంతం చేసి వేశే కాళరాత్రి అని గ్రహించు. ఆమె రూపంలో ఉన్న కాలపాశాన్ని నీ అంత నీవుగా నీ మెడకు తగిలించుకోకు. ఆ మహామాశక్తి ప్రభావం వల్ల యిప్పటికే మంటలు చెలరేగుతున్నాయి. ఇక అద్యతన భావిలో రామచంద్రుని క్రోధాగ్నికి వీధులూ, కోట బురుజులూ సర్వమూ దగ్ధమై పోవడాన్ని నువ్వు చూస్తావు. మంత్రి మిత్ర, సోదర, సుత, హిత, దారాదులనూ నీ నగరాన్నీ సర్వనాశనం చేసుకో వద్దు.

"రావణా! నేను రామదాసుడను కావడం వల్ల ఆ మహాత్ముని ప్రభావం నాకు చక్కగా తెలుసు. దూతగా వచ్చాను కనుక నీకు

హితాన్ని బోధిస్తున్నాను. మానవుడనూ, రాక్షసుడనూ కాని నేను మధ్యస్థుడనైన వానరుడను. సత్యాన్ని యథాతథంగా చెబుతున్నాను శ్రద్ధగా ఆలకించు

మహత్తర యశస్సంపన్నుడైన శ్రీరామచంద్రుడు పంచభూత సమేతంగా చరాచరజగత్తునంతనూ సంహరించనూగలడు, పునః సృష్టించనూ గలడు. త్రివిక్రమ సమ పరాక్రమ సంపన్నుడైన అతనితో-యక్ష గంధర్వ సిద్ధ, కిన్నర, పతగాదు లేకాదు యెవ్వరూ, యెక్కడా యెదురై పోరాడ జాలరు. అట్టి సర్వ జగదీశ్వరునికి నువ్వు మహాపరాధం చేశావు. ఇక నువ్వు సజీవంగా ఉండడం అసంభవం. జగత్రయంలో శ్రీరామునితో పోరాడగల వాడెవడూ లేడు. ఆ రాముడే నిన్ను అంతం చేయవస్తే బ్రహ్మదేవుడు కానీ , పరమేశ్వరుడు కానీ, మహేంద్రుడూ కానీ, ముగ్గురూ కలిసి కూడ నిన్ను రక్షించ లేరని తెలిసికో" అని మౌనం వహించాడు.

**(వాల్మీకి సుందరకాండ ఆధారంగా)**

**వీరాంజనేయ రావయ్యా!**
**సర్వభారమూ నీదేనయ్యా!**

# మన హనుమంతుడు

## శ్రీ శృంగేరీ శారదా పీఠాధీశ్వరులు

శ్లో॥ గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసం
రామాయణ మహామాలారత్నం వందేఽనిలాత్మజం.

ఈ పవిత్ర భారత దేశములో జన్మించిన ధర్మాభిమానులందరూ రామాయణ గ్రంథాన్ని పారాయణ చేస్తూనే యుంటారు. సామాన్యులుకూడ ఆ గ్రంథ ప్రతిపాద్య నాయకుడైన మర్యాదా పురుషోత్తముడగు శ్రీరామచంద్రుని గాథను న్యూనాధిక రూపములో పఠించియో ఆలకించియో యుంటారు. ఈ పవిత్ర గ్రంథము మనకు మార్గదర్శక మయినది. మన ఉత్తమ సంస్కారము లన్నింటి మీద రామాయణ ప్రభావము ఉంది.

తల్లులు మన బాల్యమునందే రామాయణ గాథను మనకు వినిపించే వారు. భజన సంఘాల వారు రామ భజనలను చేస్తూ భక్తజనావళిని ఆనందసాగరమున ముంచెత్తెడి వారు. పౌరాణికులు శ్రీరామ గాథనుపఠించి మనకు వినిపించెడివారు, ఒక్క రామాయణ మహాకావ్యమునందే మాతాపితరుల, సతీపతుల, పితాపుత్రుల, సహోదర బాంధవుల, రాజు ప్రజల, ప్రభు సేవకుల పరస్పర కర్తవ్యాన్ని గురించి నేర్చుకోవలసినవి యెన్నో ఉన్నాయి. రామాయణ గ్రంథ ప్రధాన నాయకుడు శ్రీరామచంద్రుడే అయినా అందులో కిష్కింధాకాండ నుండి ముందుకు శ్రీ

హనుమంతుని మహోన్నత గుణగణాలు మనకు విశేషంగా లభిస్తాయి.

కిష్కింధాకాండలో శ్రీరామచంద్రుడు:-

శ్లో॥ నానృగ్వేద వినీతస్య
నాయజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః
శక్య మేవం ప్రభాషితుమ్ ॥

(వాల్మీకి రామాయణం)

తా॥ ఋగ్వేద, యజుర్వేద, సామవేదాధ్యయన రహితుడు యీ రీతిని భాషింపజాలడు. ఇంత శ్రేష్ఠ సంభాషణా కుశలత్వము పొందజాలడు. (అనగా హనుమంతుడు సర్వశాస్త్ర పారంగతుడని యర్థము.)

ఈ విధంగా కిష్కింధాకాండ నుండి శ్రీరామ పట్టాభిషేక ఘట్ట పర్యంతము ప్రతీ ప్రకరణమునందు హనుమంతుడు ప్రధానరూపమున విరాజిల్లినాడు. ఇతడు లేనిచో రామాయణము అసంపూర్ణముగనే యుంటుంది. ఇతనిని మనం రుద్రావతారునిగ భావించి "రుద్రమూర్తయే నమః" యని పూజిస్తూ యున్నాము. ఈ మహాత్ముని స్మరణ మాత్రమున బుద్ధిబలము, యశోధైర్యాలు, ఆరోగ్య నిర్భయత్వాలు, సుదృఢత్వ వాక్పటుత్వాలు కూడ లభిస్తాయి.

శ్లో॥ బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
సుదార్ఢ్యం వాక్పటుత్వం హనుమత్స్మరణాద్భవేత్.

(ఆనందరామాయణం)

భగవదవతారమూర్తియైన హనుమంతుని ఉపాసించుటకు స్వతంత్ర పద్ధతులున్నాయి. తదనుసారం శ్రద్ధాభక్తి విశ్వాసములతో ఆరాధింపగల్గిన నాడు, అభీష్టసిద్ధితో బాటు ఆత్మోద్ధరణ కూడ జరుగుతుంది. శ్రీరామభక్త హనుమన్మందిరములు లేని గ్రామములు మనభారతదేశమునందు లేవనియే చెప్పాలి. అపార దయాసముద్రుడయిన హనుమంతుని స్మరించీ ఆరాధించీ మీ రందరూ కృతకృత్యులగుదురుగాక!

# "హనుమత్తత్త్వము"

## శ్రీ ద్వారకా శారదా పీఠాధీశులు

శ్లో॥ ఉల్లంఘ్యసింధోః సలిలం సలీలం
యః శోకవహ్నిం జనకాత్మ జాయాః
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయం॥

మన సనాతన ధర్మమునందు అనేకములైన ఉపాస్య దేవతలున్నారు. స్మార్తోపాసనయందు పంచదేవోపాసన ప్రసిద్ధ మైనది. కాని, యీ ఉపాస్య దేవతలందరిలోను సాకార బ్రహ్మచర్య రూపాన్ని గురించి వివరించాలంటే హనుమంతుడు మాత్రమే అగ్రాసనాన్ని అలంకరించ దగినవాడు. సమ్యగ్బ్రహ్మ చర్య పాలన, శత్రునిగ్రహము, కామవిజయం, కార్యసిద్ధి మున్నగు విషయముల దృష్ట్యా రుద్రావతారమూర్తి యగు హనుమంతుడు అత్యధిక ప్రసిద్ధి చెందెను. ఉపాసనాపద్ధతిని గ్రహించాలంటే రామాయణాంతర్గత

శ్రీహనుమచ్చరిత్రావలోకనము పరమావశ్యకము. దాస్యభక్తికి హనుమంతుడు మాత్రమే ప్రముఖమైన ఉదాహరణ–

శ్లో॥ శ్రీ విష్ణోః శ్రవణేపరీక్షి దభవ ద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదః స్మరణే తదంఘ్రి భజనేలక్ష్మీ పృథుఃపూజనే
అక్రూరత్వభివందనే కపిపతిర్దాస్యేత సఖ్యేఽర్జునః
సర్వస్యాత్మనివేదనే బలి రభూత్కృష్ణాప్తి తేషాం పరం ॥

హనుమంతుడు తాను వానరుడై దాస్య భక్తి ప్రభావముతో రామదాసుడై కూడ దేవత కాగలిగినవాడు. ఇట్టి స్థితిని యే కపీ పొందలేక పోయాడు. హనుమంతుని ఆజన్మ బ్రహ్మ చర్య పాలనా ధర్మము సర్వదా అద్వితీయమైనది. ఇట్టి శ్రేష్ఠో దాహరణ సృష్టి యందు మరెందునూ కానరాదు. అష్టాంగ బ్రహ్మచర్యము విషయములో శాస్త్ర వర్ణన లభిస్తుంది. కాని, యోగ వేదాంగాది స్వాధ్యాయము ద్వారా దివ్యజ్ఞానాభ్యాసాలుకూడఅవసరమైయున్నవి. జన్మాంతరీయ స్థితి కూడ చూడబడుచున్నది. ఈ దృష్టి సర్వస్వ సాధనా సంపన్నుడు, రుద్రమూర్తి యగు హనుమంతుడు ఆజన్మ బ్రహ్మచర్య పరిపాలనా ద్వారా అపరిమిత శక్తి శాలియై శ్రీరామ గాథను అమర మొనర్చినాడు.

అయిననూ హనుమదుపాసన ఉగ్రమని చెప్పబడు చున్నది. కావున, సాధకుడు తత్సంబంధమగు ఆభిచారిక (మారణ, మోహన) వుపాసనలు చేయరాదు. ఆ మహనీయునకు సాదర ప్రణామము లందజేయుచు ముగించుచున్నాము.

**శ్లో॥ మనోజవం మారుత తుల్య వేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం**
**వాతాత్మజం వానరయూథ ముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి॥**

# మహాబలిశాలి హనుమంతుడు

## శ్రీ పూరీ గోవర్ధన పీఠాధీశ్వరులు

అంజనీపుత్రుడు, పవనసుతుడు, రుద్రావతారమూర్తి, కేసరీనందనుడు, సాధుశిరోమణి, కపిశిరోమణి, భక్తశిరోమణి, పావనావతారుడు అని అనేక నామములచే ప్రసిద్ధినందిన హనుమంతుని గూర్చి యిందరికి యితడు యెలాపుత్రుడు కాగలిగాడనే సందేహము కలుగుతుంది. కాని, వాస్తవనాన్ని విమర్శించి అర్థం చేసుకోగలిగిననాడు అన్నింటికి చక్కని సమాధానము లభిస్తుంది. రుద్రావతారుడు కావడంచే శంకర నందనుడైనాడు. "ఆత్మావై జాయతే పుత్రః" అను శాస్త్ర వచనానుసారము వానర రాజగు కేసరికి ఔరస పుత్రుడగుటచే "కేసరీనందను" డనడం సుసంగతము, "పుంజికస్థలి" అనే అప్సరస శాపగ్రస్థయై కామరూపముగల దివ్యాతిదివ్య వస్త్రాభిభూషితయై పర్వతముమీద విహరించుచున్నది. వాయు దేవుడు ఆమె వైపు పురోగమించాడు. ఆమె వెంటనే "ప్రతి వ్రత నగున స్పృశించి తన సర్వనాశనాన్ని కోరువాడెవడు?" అని గద్దిస్తూ పలికెను. అంతట సర్వ ప్రాణస్వరూపుడగు వాయుదేవుడు బదులుగా "దేవీ! అటువంటి దేమీ లేదు. అనంతకోటి బ్రహ్మాండ నాయకుడు, అనాథనాథుడు, కరుణావరుణాలయుడు, నిర్గుణ నిరాకారుడూ అయిన భగవానుడు భూభార హరణార్థం మానవ రూపమున అవతరింప నున్నాడు. ఆ పరమాత్మ సేవకై నీ గర్భము నుంచి పుత్రరూపమున అవతరించదలచెను. దయతో నన్ను క్షమింతువు గాక?" అన్నాడు. అంతే.పవనసుత అంజనీపుత్ర అను నామాలు హనుమంతుడికి విఖ్యాత మయినాయి.

ఈ విషయసర్వస్వాన్నీ విశ్వసింప లేనివారికి కూడ హనుమ ద్రూపమునందు అనన్య సామన్యమైన వ్యక్తిత్వము గోచరమవు తూంటుంది. పదునాలుగు లోకాలనూ జయించిన రావణునివంటి జగజ్జెట్టి యొక్క నగరమందు యేకాకిగా నిర్భయముగా ప్రవేశించి వాని యెదుట నిలచి తన ప్రభువునకు జయజయ కారాలు పలుకుతూ "రావణా! సావధానుడవై! యుందువు గాక! నన్నె దురొక్కనవలయునని నీవు చేయు ప్రయత్నము నీ సర్వనాశ నానికే దారి తీనస్తుంది. మహా బలపరాక్రమశాలురైన రామలక్ష్మణులకునేను సేవకుడను. అమేయ బలపరాక్రమశాలీ, వానర రాజూ అయిన సుగ్రీవుడు సేనా పరివారములతో వారిని సేవించుచున్నాడు. ఈ విశాల ప్రపంచము నందు యెంతటి కఠినమైన కార్యమునైనా సాధించడము నందు యీషణ్మాత్ర క్లేశాన్నీ పొందని శ్రీరామ దూతను. మహేంద్రుని వజ్రాఘాతముకూడ నా దేహమును స్పృశించి వ్యర్థమయినది. ఈ ప్రపంచమంతా నా కెదురు నిలచిననూ దానిని నాశనం చేసి తీరుతాను. వాయునందనుడను కావడంవలన నేను కూడ అంతటి బలశాలిననియే తెలిసికొను" మనెను.

"వానరా! ఇది రావణునిలంక" అనేవిషయాన్ని విస్మరించి ప్రగల్భాలు పల్కుతున్నావు. దేవ దాన వాదు లందరూ యెవరి నామము విన్నంతమాత్రాన భయకంపితు లగుదురో అట్టి రావణ చక్రవర్తిముందా నీ వాగాడంబరం?" అనగా "ఏకమాత్ర రావణుడొక లెక్కా నాకు? వేలాదిరావణులు కలసి వచ్చినా నా ముందు నిలువజాలరు" అని సమాధానమిచ్చాడు. "రావణుని వద్ద అనేకమైన శస్త్రాస్త్రములున్నవి. వాటిని వర్ణింపజాల" మని వారుపలుక మీ ఆయుధములన్నీ భూమియందే యుంటాయి. నేను పర్వతాల

-తో, మహావృక్షాలతో ప్రహారమారంభించిన యీ సృష్టియే తలక్రిందులై పోతుంది. మీరు చేయగలిగింది చేయండి. నేనీ లంకను నాశనం చేసి యిచ్చటకు వచ్చిన పనియగు జానకీసం దర్శనము గావించి మీరు చూస్తుండగనే మరలిపోతుంటే చేతులు నలుపుకుంటూ పశ్చాత్తాపము చెంది తీరుతారు" మహాబలశాలి యగు హనుమంతుడు బుద్ధిబల, బాహుశక్తులతో తన ప్రతిజ్ఞలన్నింటినీ పూర్తిచేశాడు. ఈ "సంకటసమయమునందు ప్రతి వ్యక్తి యందు హనుద్భావన కార్యక్షమత్వము, జాగృతమగును గాక!" అని విమలాంబా చంద్రమౌళీశ్వర్గులను ప్రార్థించు చున్నాను.

# వర్తమానకాలమందు హనుమదుపాసనావశ్యకత

### శ్రీ బదరీ పీఠాధీశ్వరులు

నేటి భారతదేశంలో అర్థకామాలపై ధర్మశాసనం లేక పోవడం చేత అమర్యాదితమైన ఏషణలు పల్లవించి, పుష్పించి ఫలిస్తున్నాయి. బాల, వృద్ధ, స్త్రీ, పురుష బేధరహితముగా కామాచార, అభక్ష, భక్షణాదిగాగల ప్రవృత్తులలో చిక్కుకుని విమోహితులై వ్యక్తి సామాజిక, రాష్ట్ర దేశాల విషయరహితంగా భ్రష్టులగుచున్నారు. ఒక వేళయెచ్చటనైనా న్యూనాధిక రూపమునందు ధార్మికత్వముగానీ, అధ్యాత్మ చింతన కాని ఉంటే అక్కడ కూడ వాటి ఆవరణలో దంభ, పాషండాది దుష్ట వృత్తులు పనిచేయు చున్నవి. ఈ విషయ

విమోహక దుస్థితిలో హనుమదుపాసన పరమావశ్యక మయి యున్నది. అతని చరిత్ర వలన మనకు బ్రహ్మచర్య వ్రతపాలన, శీలరక్షణ, బలబుద్ధుల వికాసము శ్రీరాముని యందు అభిమానరహితమైన దాస్య భావము మున్నగు మహత్తర గుణోపదేశము లభించును.

"దేవో భూత్వా దేవంయజేత్" అనునది ఉపాసనాముఖ్య సిద్ధాంతము. ఉప=సమీపము, ఆసన= ఉండుట ( సమీపమందుండుట) అని అర్థము. ఏ ఉపాసనాద్వారా యిష్టదేవత యందలి గుణరూప శక్తుల యందు సామీప్య సంబంధం యేర్పడుతుందో? సాకారత్వమేర్పడుతుందో, అదియే ఉపాసనా తాత్పర్యోద్దేశ్యమై యున్నది.

నేటి యీ విషమ స్థితిలో మానవమాత్రులకు విశేషించి బాల్యకు యువకులకు హనుమదుపాసన అత్యంతావశ్యక మైనది. బుద్ధి, వీర్య బలాదులను ప్రసాదించి హనుమంతుడు తన భక్తులను సంరక్షిస్తూ వుంటాడు. భూత, ప్రేత, రాక్షసాదులు ఆ మహాత్ముని నామోచ్చారణమాత్రము చేతనే పారిపోతాయి. స్మరణమాత్రము చేత అనేక రోగాలు శాంతిస్తాయి. మానసిక దౌర్బల్య సంఘర్షణలో ఆ స్వామి సహకారం లభిస్తుంది. ఆయన సహకారము వలననే శ్రీ తులసీదాస మహాకవికి శ్రీరామదర్శన మహద్భాగ్యం లభించింది. నేడు కూడ చాలామంది భక్తులకు ఆ మహనీయుని అనుగ్రహ ప్రసాదం లభిస్తూనే వుంది, కావున హనుమత్కృపను సంపాదించుట కొరకు శాస్త్ర ప్రతిపాదిత వుపాసనా పద్ధతులుగలవు. వాటి ననుసరించి వుపాసనలో సంలగ్నులు కాగలిగిన నాడు అనేక లౌకికాలౌకిక సిద్ధులు లభిస్తాయి. దేశ ఔన్నత్యానికి అనేక కార్యకలాపాలు

కొనసాగుతున్నాయి. కాని ఆధ్యాత్మిక రంగంలో జరుగవలసినంత కృషి జరగడము లేదు. తత్ఫలితంగా భౌతిక సమృద్ధి మానవునికి వరదానముకాక అభిశాపముగా నున్నది. ఇట్టి స్థితిలో దేశమునకు కావలసిన ఆదర్శము మనకు హనుమచ్చరిత్రయందు లభ్యమగు చున్నది. భగవత్తత్త్వవిజ్ఞానమునకు, భక్తి సేవలకు, హనుమంతుడు మనకు వుజ్జ్వలమగు వుదాహరణ. మహోత్తమ భావాలతో భగవదను రక్తి సేవలకు, వ్యక్తిత్వ పూర్ణవికాసాలకు వుదాహరణలు హనుమ చ్చరిత్రయందే లభిస్తాయి.

హనుమంతుడు బాలబ్రహ్మచారి. ఆ మహనీయుని ధ్యాన బ్రహ్మ చర్యానుష్ఠానము వలన నిర్మలాంతఃకరణయందు సమగ్రమగు భక్తి కలుగుతుంది. హనుమచ్చరిత్రలో శక్తింసంచయ, సదుపయోగములు, భగవద్భక్తి నిరహంకారము మున్నగునవి సంపూర్ణముగా యుండుటవలన అతనిని ఆరాధించడము వలన ఆ సద్గుణములన్నీ సాధకులు, భక్తులు అయిన యువకులకు, బాలురకూ కూడ లభించును.

| వీరాంజనేయా! రావయ్యా!<br>సర్వభారమూ నీదేనయ్యా! |
|---|

# "సదా రక్షకుడు హనుమంతుడు"

శ్లో॥ యదివా త్రిద శేశానాం సదక్ష్యాన్కృతశ్రమః
బద్ధ్వా రాక్షస రాజా౽మానయినాష్యామి రావణ॥

తా॥ స్వర్గంలో కూడ సీతాదేవి లభించనిచో నేను త్రైలోక్య విజేత అయిన రాక్షసరాజగు రావణాసురునే బంధించి తీసుకు వస్తానన్నది- శ్రీ రామభక్తుడగు హనుమంతుని సత్యోక్తి.

అందువలననే శ్రీరామచంద్రుడు హనుమంతుని యశస్సును గానంచేస్తూ...యుద్ధమందు మారుతి చూపిన పరాక్రమాన్ని యమ యింద్రోపేంద్ర కుబేరాది లోకపాలుర యందు కూడ జూడజాలము అనెను.

శ్లో॥ న కాలస్య న శక్రస్య నవిష్ణో ర్విత్తపశ్యచ
కర్మాని తాని శ్రూయంతే యాని యుద్ధే హనూమతః.॥

హనుమంతుని వలె పరాక్రమ శాలియై నిష్కాముడైన వాడే ధర్మాన్ని రక్షించగలడు. సమర్పణ, త్యాగం, కర్తవ్య పూర్తియందు నిష్ఠ లేని వాడు – సత్యమగు సేవకుడుగా గాని, ధర్మ రక్షకుడుగా గానీ కాజాలడు. ఆసక్తిరహితమయిన కర్మ సాధనను గీతాచార్యులు సిద్ధి సోపానముగ వ్యక్త పరచెను. హనుమంతునివంటి నిష్కామ పరాక్రమవంతుడగు సేవకుడు లేనిచో శ్రీరామచంద్రుని సత్పక్ష మునకు విజయలక్ష్మి లభించి యుండెడిది కాదు. యుద్ధ కాండమందు జాంబంతుడు హనుమంతుడు జీవించియున్నచో మనమందరము

లేకపోయిననూ శ్రీరామచంద్రునకు విజయము నిశ్చయముగ లభించి తీరుతుంది. ఆ మాట వాస్తవమేగదా! సేవకునకు నిష్కామభావమే కాకుండా సత్యబ్రహ్మచర్యము అవశ్యము. అత్యంత ఆవశ్యకమై యున్నది. శారీరిక సప్తధాతుసారమగు శుక్రనామక ధాతువును సంరక్షించుటయే బ్రహ్మచర్యమునకు అర్థము. సత్యమనగా మనోవాక్కర్మల యేకత్వము. ఈ రెండింటికినీ ఆదర్శ మూర్తి హనుమంతుడు. అతని శరీరము అఖండ బ్రహ్మచర్యమునకు ప్రసిద్ధి నొందినది. ఆ యీ కారణమువలననే వజ్రాంగుడని పిలువబడ్డాడు. ఆయన బలపరాక్రమాలకు హద్దులు లేవు. సత్యమునకు హనుమచ్చరిత్ర అద్వితీయ మైనది. వాక్కు చేత అతడు శ్రీరామచంద్రునకు వందన మందజేస్తూ అతనిని హృదయమారా అభిలషిస్తున్నాడు కూడ.

శ్రీరామభక్తి, సద్గుణముల కారణంగానే హనుమంతుని స్మరణ మమోఘమై ఫలప్రదమైనది. లౌకిక సమస్య లెదురయినపుడు కార్యసాధనకై భక్తులు శ్రీరామసమేతుడైన హనుమత్ స్మరణ చేయవలెను. భక్తజన వశంకరుడగు హనుమంతుడు తన సేవకునకు అభీష్టమును సర్వదా నెరవేర్చుటకు సంసిద్ధుడగు చుండును.

రామరహస్యోఽ పనిషత్తుయం దితడిట్లా అన్నాడు.

శ్లో॥ "లౌకికే సమను ప్రాప్తే మాం స్మరేద్రామసేవకం"

**శ్రీ రామ నామ రసికుడు – హనుమంతుడు.**

**హనుమంతుడు తన విశేషకాలాన్ని రామనామ సంకీర్తనయందే** లగ్నం చేస్తాడు. నామసంకీర్తన మాత్రంచేత ప్రేమోన్మత్తుడవు తూంటాడు. అతని నేత్ర కమలాల నుంచి ప్రేమాశ్రువులు జలజల

రాలుతుంటాయి. సుదీప్తరూపంలో అతని శరీరము రోమాం చిత మౌతుంది. శ్రీహనుమత్సంహితోక్తనిమ్నలిఖిత శ్లోకము లందు హనుమంతుడు తన రసనేంద్రియమున కీవిధంగా ఆదేశించు చున్నాడు.

శ్లో॥ హే జిహ్వే జానకీ జానేనామ్నా రామ మాధుర్య మండితం
భజస్వ సతతం ప్రేమ్నా చ ద్వాంఛా సహితం స్వతం
జిహ్వే శ్రీరామసంస్మరణే విలంబం కురుషేలాపే కథం
వృథాయాసాది తే కించి ద్వినా శ్రీరామసుందరం॥

తా॥ ఓ రసనేంద్రియమా! నీవు శుభములు కోరుచున్న యెడల శ్రీజానకీజీవనుని మధురాతిమధుర శ్రీరామనామమును సతతము ప్రేమపురస్సరముగ స్మరించు చుండుము. ఓ రసనేంద్రియమా! రామనామోచ్చారణకై యెందులకు ఆలసించు చున్నావు? మధుర మనోహర శ్రీరామనామోచ్చారణ రహితముగ క్షణకాలము కూడ వ్యర్థము చేయరాదు. పరున్నా, నిలబడియున్నా యేదశయందైనా శ్రీరామనామస్మరణ చేయువాడు పరమపదాన్ని పొందుతాడు.

శ్లో॥ ఆసీనోవా శయానోవా త్విష్ఠన్వా యత్రకుత్రవా
శ్రీ రామనామ సంస్మృత్య యాతి తస్మరణం పదం.

శ్రీరామనామమును హనుమంతుడు తన జీవన సర్వస్వముగ భావించాడు.

శ్లో॥ కేవలం రామనామైవ సదా మజ్జీవనం మునే
సత్యం వదామి సర్వస్వ మిదమేకం సదా మమ!

మునే! ఏకమాత్ర మయిన శ్రీరామనామమే నాజీవనము. సదా

శ్రీరామనామమే నాకు ఏకమాత్రసర్వస్వమై యున్నది. హనుమంతుడు విశ్వసనీయమగు తన హృదయమందు రామనామమునే పరమతత్త్వముగ స్వీకరించెను. ఇతరేతరములయిన సాధనలు అతని దృష్టిలో అత్యల్పములు. ఆదిరామాయణమందలి సేతుబంధన ప్రకరణమందు హనుమంతుడు నల నీలురకు శ్రీరామనామము నుపదేశించుచు...

శ్లో॥ ఏకతః సకలామంత్రా ఏకతో జ్ఞానకోటయః
ఏకతో రామనామస్యా తదపిశ్యాన్న వై సమం
దేశకాల క్రియాజ్ఞానాదన పేష్య స్వరూపతః
అనంతకోటి ఫలదో రామమంత్రో జగత్పతే ।

త్రాసుయందలి ఒక సిబ్బెయందు సమస్త మహామంత్ర ములనూ అనంతకోటి జ్ఞానధ్యానాది సాధన ఫలములనుంచి రెండవదాని యందు కేవలం శ్రీరామనామమును మాత్ర ముంచిన అవన్నీ కలసియు సరితూగవు. శ్రీ రామ నామ ఆరాధనయందు దేశకాలాది పవిత్రతలు అనుష్ఠానాది క్రియలు, జ్ఞానాదులు అవసరం లేదు. శ్రీరామనామ మంత్రోచ్చారణమాత్రము చేత అనంతకోటి ఫలములు లభించును.

శ్రీరామనామ భజనమందలి విలక్షణమేమన 'తుమిరి పవనసుత పావన నామ, అపనే బసకరి రాకేవు రామో'.

సర్వతంత్ర స్వతంత్రుడు, సర్వేశ్వరుడయిన పరమ ప్రభువును కూడ స్వవశము చేసి కొన గల శ్రీరామ కీర్తనతో సమమైన అన్యసాధన మరేమి గలదు?

స్నేహపూర్వకముగ శ్రీరామనామమును జపించువారి యెడల హనుమంతుడు ప్రసన్నత గలిగియుండును. అట్టి వారికి తాను కల్పవృక్షమై సమస్త మనోరథములను సఫల మొనర్చును.

శ్లో॥ యే జపంతి సదాస్నేహాన్నామం మాంగల్య కారణం
శ్రీ మతో రామచంద్రశ్య కృపాలేశో మమస్వామినః
తేషామర్థే సదా విప్ర ప్రదాతారం ప్రయత్నతః
దదామి వాంఛితం నిత్యం సర్వదా సౌఖ్యముత్తమం॥

విప్రవర్యా! నా స్వామియు, దయాసాగరుడు, శ్రీమంతుడు నయిన శ్రీరామచంద్రుని మంగళకర నామమును యే మానవులు సదా ప్రేమ పూర్వకముగ జపింతురో వారికి నేను అనుక్షణము ప్రయత్న పూర్వకముగ ప్రదాతనై యుందును. నిత్యము నేను వారి కోరికలను నెరవేర్చుచు ఉత్తమ సుఖములను ప్రసాదింతును.

ఈ రీతిగ హనుమంతుడు నామకీర్తన యందు సదా జాగరూకుడై యుండును, కీర్తన ప్రియులనందరినీ సదా రక్షించుచు అతడు సహకరించు చుండును.

**ఓం హం**

**హనుమతే నమః**

# "హనుమచ్చరిత్రపై సింహావలోకనం"

ధర్మమే ప్రాణస్వరూపంగా గల భారతావనియందు హనుమంతుని చిన్న లేక పెద్ద దేవాలయము గాని, మందిరము గాని, విగ్రహముగాని లేని నగరముకానీ, గ్రామముకానీ, జనపదముగానీ లేవు. వ్యాయామ కళాశాలయందు కూడ విగ్రహాలు లేనిచోట కనీసం మట్టిబొమ్మనైనా పెట్టుకొని పూజించుచున్నారు. తను - మన- ప్రాణాలలో అననేల! వీరహనుమత్త్వ భావములేని ప్రదేశము యీ భారతావనియందే లేదని చెప్పవచ్చును. మనకు శక్తినీ, భక్తినీ, సమర్పణనూ నిష్కపట సేవనూ, త్యాగ, బలిదాన భావాదులను అతడు సదా ప్రసాదిస్తూనే యుంటాడు. పరమ ఆదర్శమూర్తియగు పవన తనయుని గాథ జ్యోతిర్మయ స్తంభసదృశంగా మనకు కళ్యాణ మార్గాన్ని, నిశ్చితమగు దిశను నిర్దేశిస్తూంటుంది. శ్రీ సీతారాముల అనన్యభక్తుడైన హనుమంతుడు అఖండ బ్రహ్మచర్య వ్రత పాలకుడు, వీరత్వ, శూరత్వ, బుద్ధిమత్వ, దక్షత్వాది సద్గుణములకు అతడు నిధి. వజ్రాంగుడు, అత్యంత శక్తి సంపన్నుడు, పరమపరాక్రమధీశాలి, శాస్త్ర పారంగతవిద్వాంసుడు, పరమ నీతిజ్ఞుడు, సరళస్వరూపుడు, జీవిత సర్వస్వాన్నీ రామాంకిత మొనర్చిన వాడు, అతని రోమరోమము రామ మయము. ఒకానొకసారి అతడు శ్రీరామునితో-

**శ్లో॥ దేహదృష్ట్యాతు దాసోఽహం జీవదృష్ట్యా త్వదంశకః**
**వస్తుతస్తు త్వమేవాఽహం ఇతి నిశ్చితా మతా ।**

అనగా - ప్రభూ! దేహదృష్ట్యా దాసుడనగు నేను జీవ రూపేణ మీ అంశను. పరమార్థదృష్టితో చూడ?నే నేనూ మీరూ ఒకటే. ఇది నిశ్చితాభిప్రాయము.

హనుమంతుడు ప్రసన్నుడగుటకు ఆలస్యము గాదు. "రామ రామ సీతారామ" అని జపిస్తే చాలు, ఆ రామభక్తుడు ప్రసన్నుడవుతాడు. మానవుడెలాగయినా భగవదోన్ముఖుడు కావాలనీ, జన్మ - జరా - మరణాదుల నుంచి ముక్తి నందాలనీ దయామయు డయిన ప్రభునివైపు పురోగమించాలనీ స్వామికి సర్వస్వాన్నీ సమర్పించి తానునిశ్చిత మంగళ ప్రదముల నందవలయు నని నిరంతరము ప్రయత్నించవలయును. ఇందులకు కృపామయమూర్తి అయిన శ్రీ హనుమంతుడు సదా ప్రయత్నిస్తాడు. ఏదో వంకతో ప్రేరణ ప్రోత్సాహములను ప్రసాదిస్తూంటాడు. అతడు భక్తులను ప్రాణాధికంగా ప్రేమిస్తుంటాడు కూడ.

అమంగళముల నంతము చేసి సన్మంగళములను చేకూర్చునట్టి భక్తవరుడు హనుమంతుడు. భక్త శ్రేష్ఠుడు, భక్తజన సంరక్షకుడు అయిన పావని చరిత్ర పరమ పవిత్రమై, పరమ మధురమై, పరమాదర్శమై అత్యద్భుతమునై యున్నది. పావని జనని పుణ్య శీలిని యగు అంజనాదేవి, కాని రుద్రవీర్య సముద్భవునిగ, వాయుపుత్రునిగ, కేసరీ నందనునిగ ఆయనకు నామాంతరములు గలవు. అనగా శివ, వాయు, కేసరు లీతని జనకులు, ఈ విషయాలను స్పష్టీకరించు గాథ లనేకములు గలవు. వివిధ పురాణ వర్ణిత, కల్పాంతర భేదగత గాథలను సమన్వయ పరచుకొనగల సంప్రదాయ సిద్ధమైన ఆధ్యాత్మిక దృష్టి. శ్రద్ధ, విశ్వాసము లత్యవసరములయి యున్నవి. ఈ విషయ సర్వస్వముపై పురాణాలలో కూలంకషచర్చ జరిగి యున్నది.

**"మంగళం - మహత్"**

# శ్రీ మదేకాదశముఖ హనుమత్కవచమ్

## శ్రీ దేవ్యువాచ

శ్లో॥ శైవాని గాణ పత్యాని శాక్తాని వైష్ణవాని చ ।
కవచాని చ సౌరాణి యాని చాన్యాని తాని చ ॥

శ్లో॥ శృతాని దేవ దేవేశ త్వద్వక్త్రాన్ని ః సృతాని చ ।
కించిదన్యత్తు దేవానాం కవచం యతి కథ్యతే ॥

## ఈశ్వర ఉవాచ

శ్లో॥ శృణుదేవి ప్రవక్ష్యామి సావధానావధారయ ।
హనుమత్కవచం పుణ్యం మహాపాతక నాశనం ॥

శ్లో॥ ఏతద్గుహ్యతమం లోకే శీఘ్రసిద్ధికరం పరం ।
జయో యస్య ప్రసాదేన లోకత్రయ జితోభవేత్ ॥

ఓం అస్య శ్రీ ఏకాదశ వక్త్ర హనుమత్కవచ మాలా మంత్రస్య వీరరామచంద్ర ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ మహావీరహనుమాన్ రుద్రో దేవతా, హ్రౌంబీజం, స్ఫ్రేంశక్తిః, స్ఫ్రేంకీలకం, సర్వదూతస్తంభనార్థం, జిహ్వా కీలనార్థం, మోహనార్థం, రాజముఖీ దేవతా వశ్యార్థం, బ్రహ్మరాక్షస, శాకినీ, డాకినీ, భూత, ప్రేతాది బాధాపరిహారార్థం, శ్రీహనుమద్దివ్యకవచాఖ్య మాలా మంత్ర జపే వినియోగః.

## కరన్యాసం

1. ఓం హ్రౌం ఆంజనేయాయ అంగుష్ఠాభ్యాం నమః 2. ఓం స్ఫ్రేం రుద్రమూర్తయే తర్జనీభ్యాం నమః 3. ఓం స్ఫ్రేం వాయుపుత్రాయ మధ్యమాభ్యాం నమః 4. ఓం హ్రౌం ఆంజనేయాయ అనామికాభ్యాం నమః 5. ఓం స్ఫ్రేం రామదూతాయ కనిష్ఠికాభ్యాం నమః 6. ఓం హ్రౌం బ్రహ్మాస్త్ర వినివారణాయ కరతల కరపృష్ఠాభ్యాం నమః.

## అంగన్యాసం:

1. ఓం హ్రౌం ఆంజనేయాయ హృదయాయ నమః 2. ఓం స్ఫ్రేం రుద్రమూర్తయే శిరసే స్వాహా. 3. ఓం స్ఫ్రేం వాయు పుత్రాయ శిఖాయై వషట్. 4. ఓం హ్రౌం అంజనీ గర్భాయ కవచాయ హుం. 5. ఓం స్ఫ్రేం రామ దూతాయ నేత్ర త్రయాయ వౌషట్. 6. ఓం హ్రౌం బ్రహ్మాస్త్ర వినివారకాయ అస్త్రాయ ఫట్.

## ధ్యానం

ధ్యాయే ద్రణే హనూమంతం ఏకాదశ ముఖాంబుజం
ధ్యాయే త్తం రావణోపేతం దశబాహుం త్రిలోచనం।
హాహాకారైస్స దర్పైశ్చ కంపయంతం జగత్రయం
బ్రహ్మాది వందితం దేవం కపికోటి సమన్వితం॥
ఏవం ధ్యాత్వా జపే ద్దేవి కవచం పరమాద్భుతం.

1. ఓం ఇంద్రదిగ్భాగే గజారూఢ హనుమతే బ్రహ్మాస్త్ర శక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ బ్రహ్మరాక్షస శాకినీ డాకినీ బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

2. ఓం అగ్ని దిగ్భాగే మేషారూఢ హనుమతే అగ్న్యస్త్ర శక్తి సహితాయ చోర వ్యాఘ్రపిశాచ బ్రహ్మరాక్షస శాకినీ డాకినీ బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా,

3. ఓం యమ దిగ్భాగే మహిషారూఢ హనుమతే దండ శక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ బ్రహ్మరాక్షస శాకినీ డాకినీ బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

4. ఓం నైరృతి దిగ్భాగే నరారూఢ హనుమతే ఖడ్గ శక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ బ్రహ్మరాక్షస శాకినీ డాకినీ బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

5. ఓం వరుణ దిగ్భాగే మకరారూఢ హనుమతే ప్రాణ శక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ బ్రహ్మరాక్షస శాకినీ డాకినీ భేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా

6. ఓం వాయవ్యదిగ్భాగే మృగారూఢ హనుమతే అంకుశ శక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ బ్రహ్మరాక్షస శాకినీ డాకినీ బేతాళ సమూహహూచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

7. ఓం కుబేర దిగ్భాగే అశ్వారూఢ హనుమతే గదా శక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ శాకినీ డాకినీ బ్రహ్మరాక్షస బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

8. ఓం ఈశాన్య దిగ్భాగే రాక్షసారూఢ హనుమతే పర్వతశక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ బ్రహ్మరాక్షస శాకినీ డాకినీ బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్షస్వాహా.

9. ఓం అంతరిక్ష దిగ్భాగే వర్తుల హనుమతే ముద్గర శక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ శాకినీ డాకినీ బ్రహ్మరాక్షస బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

10. ఓం భూమి దిగ్భాగే వృశ్చికారూఢ హనుమతే ముద్గర క్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ శాకినీ డాకినీ బ్రహ్మరాక్షస భేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

11. ఓం వజ్రమండలే హంసారూఢ హనుమతే పరశుశక్తి సహితాయ చోర వ్యాఘ్ర పిశాచ శాకినీ డాకినీ బ్రహ్మరాక్షస బేతాళ సమూహోచ్చాటనాయ మాం రక్ష రక్ష స్వాహా.

## ఇతి దిగ్బంధః

ఓం హ్రీం యీుం యం ప్రచండ మహాపరాక్రమాయ ఏకాదశ ముఖ హనుమతే హంసగతిబంధ - మతిబంధ - వాగ్బంధ - సర్పబంధ-చోరబంధ - వృశ్చికబంధ - దుష్టబంధ - మృగబంధ -వ్యాఘ్రబంధ - గజబంధ - శార్దూలబంధ - భైరుండబంధ - భూత బంధ - ప్రేతబంధ - పిశాచబంధ - జ్వరబంధ - శూలబంధ - సర్వ దేవతాబంధ - రాజబంధ - ముఖబంధ - రాజసభాబంధ - ఘోరవీర ప్రతాప రౌద్ర భీషణ హనుమద్వజ్ర దంష్ట్రానానాయ వజ్రమండలే కౌపీన తులసీ వనమాలా ధరాయ - సర్వగ్ర హోచ్చాటనాయ - బ్రహ్మ రాక్షస సమూహోచ్చాటనాయ - జ్వరసమూహోచ్చాటనయ - రాజసమూహోచ్చటనాయ - చోరసమూహోచ్చాటనాయ - శతృసమూహోచ్చాటనాయ - దుష్ట సమూహోచ్చాటనాయ - మాం రక్ష రక్ష స్వాహా.

# శ్రీ వీరహనుమతే నమః

ఓం నమో భగవతే వీరహనుమతే పీతాంబరధరాయ కర్ణ కుండలాద్యాభరణా య - కృతభూషణాయ - కిరీట - బిల్వ - వనమాలా విభూషితాయ - కనకయజ్ఞోపవీతాయ-కౌపీన - కటిసూత్ర - విరాజితాయ శ్రీ వీరరామచంద్ర మనోభిలషితాయ -లంకాదహనకారణాయ - ఘనకులగిరి వజ్రదండాయ - అక్షయ కుమార సంహారకారణాయ - ఓం యం ఓం నమో భగవతే రామదూతాయ హుం ఫట్ స్వాహా.

1. ఓం ఐం హ్రీం హ్రౌం హనుమతే సీతారామ దూతాయ సహస్రముఖ రావణ విధ్వంసనాయ కిలకిల చుః చుః కారేణ విభీషణాయ వీరహనుమద్దేవాయ ఓం శ్రీం హ్రీం శ్రీం హ్రీం హ్రాం ఫట్ స్వాహా.
2. ఓం వీరహనుమతే హ్రౌం హుం ఫట్ స్వాహా.
3. ఓం శ్రీ వీరహనుమతే స్ఫ్రేం హుం ఫట్స్వాహా.
4. ఓం శ్రీ వీరహనుమతే హ్రౌం హుం ఫట్ స్వాహా.
5. ఓం శ్రీ వీరహనుమతే స్ఫ్రేం హుం ఫట్ స్వాహా.
6. ఓం శ్రీ వీరహనుమతే హ్రౌం హుంఫట్ స్వాహా.

1. ఓం హ్రాం పూర్వముఖే వానరముఖ హనుమతే లం సకల శత్రు సంహారకాయ హుంఫట్ స్వాహా.
2. ఓం ఆగ్నేయముఖే మత్స్యముఖ హనుమతే రం సకల శత్రుసంహారకాయ హుం ఫట్ స్వాహా.

3. ఓం దక్షిణముఖే కూర్మముఖ హనుమతే మం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

4. ఓం నైరృతిముఖే వరాహముఖ హనుమతే క్షం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

5. ఓం పశ్చిమ ముఖే నారసింహముఖ హనుమతే హ్రాం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

6. ఓం వాయవ్యముఖే గరుడముఖ హనుమతే యం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

7. ఓం ఉత్తరముఖే శరభముఖ హనుమతే సం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా

8. ఓం ఈశాన్యముఖే వృషభముఖ హనుమతే హుం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

9. ఓం ఊర్ధ్వముఖే జ్వాలాముఖ హనుమతే ఆం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

10. ఓం అధోముఖ హనుమతే మార్జాలముఖాయ హ్రీం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

11. ఓం సర్వత్ర జగన్ముఖ హనుమతే హ్స్ఫ్రేం సకల శత్రు సంహారకాయ హుం ఫట్ స్వాహా.

ఓం శ్రీరామ పాదుకాధరాయ మహా వీరాయ వాయు పుత్రాయ కనిష్ఠాయ బ్రహ్మనిష్ఠాయ ఏకాదశ రుద్రమూర్తయే మహాబలపరాక్రమాయ భానుమండల గ్రసన గ్రహాయ చతుర్ముఖ

వరప్రసాదాయ మహాభయ రక్షకాయ "యం హ్రౌం ఓం హం స్రేం హం స్రేం హం స్రేం హం స్రేం" ఓం వీర

హనుమతే నమః ఏకాదశ వీరహనుమన్మాం రక్ష రక్ష శాంతిం కురుకురు తుష్టిం కురుకురు పుష్టిం కురుకురు మహారోగ్యం కురుకురు అభయం కురుకురు అవిఘ్నం కురుకురు మహావిజయం కురుకురు సౌభాగ్యం కురుకురు సర్వత్ర విజయం కురుకురు మహాలక్ష్మీం దేహి దేహి హుం ఫట్ స్వాహా.

ఇత్యే తత్కవచం దివ్యం శివేన పరికీర్తితం
యః పఠేత్ప్రయతో భూత్వా సర్వాన్కామా నవాప్నుయాత్,
ద్వికాలం ఏకకాలం వా త్రివారం యః పఠేన్నరః
రోగాన్పునః క్షణం జిత్వా స పుమాన్లభతే శ్రియం.
మధ్యాహ్నే చ జలే స్థిత్వా చతుర్వారం పఠేద్యది
క్షయాపస్మారకుష్ఠాది తాపత్రయ నివారణం.
యః పఠేత్కవచం దివ్యం హనుమద్ధ్యాన తత్పరః
త్రిః స కృత్వా యథాజ్ఞానం సోపి పుణ్యవతాం నరః
దేవమభ్యర్చ్య విధివత్పురశ్చర్యాం సమారభేత్
ఏకాదశ శతం జాప్యం దశాంశ హవనాదికం.
యః కరోతి నరో భక్త్యా కవచస్య సమాదరం
తతః సిద్ధిర్భ వేత్తస్య పరిచర్యా విధానతః.
గద్య పద్యమయీ వాణీ తస్య వక్త్రే ప్రజాయతే
బ్రహ్మ హత్యాది పాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః.

**ఇది శ్రీ రుద్రయామలే ఉమామహేశ్వర సంవాదే ఏకాదశముఖ హనుమద్దివ్య కవచ మాలా మంత్రస్తోత్రం సంపూర్ణమ్.**

అమ్మదయఉంటే - అన్నీ ఉన్నట్లే

ఓం ఐం హ్రీం శ్రీం - ఐం క్లీం సౌః

ఐం - క్లీం - సౌః - సౌః - క్లీం - ఐం

కఏఈల హ్రీం - హసకహల హ్రీం - సకల హ్రీం

కళ్యాణ కారక మన్త్రము

ఓం - ఐం - హ్రీం - శ్రీం - కామేశబద్ధ- మాంగళ్య సూత్రశోభిత - కంథరాయై - నమః

1. ఓం ఐం హ్రీం శ్రీం త్రైలోక్య మోహనచక్ర స్వామిన్యై నమః
2. ఓం ఐం హ్రీం శ్రీం సర్వాశా పరిపూరక చక్రస్వామిన్యై నమః
3. ఓం ఐం హ్రీం శ్రీం సర్వసంక్షోభణ చక్రస్వామిన్యై నమః
4. ఓం ఐం హ్రీం శ్రీం సర్వసౌభాగ్యదాయక చక్రస్వామిన్యై నమః
5. ఓం ఐం హ్రీం శ్రీం సర్వార్థసాధక చక్రస్వామిన్యై నమః
6. ఓం ఐం హ్రీం శ్రీం సర్వరక్షాకర చక్రస్వామిన్యై నమః
7. ఓం ఐం హ్రీం శ్రీం సర్వరోగహర చక్రస్వామిన్యై నమః
8. ఓం ఐం హ్రీం శ్రీం సర్వసిద్ధిప్రద చక్రస్వామిన్యై నమః
9. ఓం ఐం హ్రీం శ్రీం సర్వానందమయ చక్రస్వామిన్యై నమః

# అమ్మదయ ఉంటే - అన్నీ ఉన్నట్లే

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ చక్రరాజ నిలయాయై నమః
శ్రీ చక్రయంత్ర దర్శన మాత్రంచే సమస్త సత్ఫలాలూ లభిస్తాయి
(వామకేశ్వర తంత్రం)

## శ్రీ రాజరాజేశ్వరీ సహిత శ్రీ మారుతీ సీతారామ మందిరం ద్వారా సిద్ధి చేయబడి అందజేయబడు శ్రీచక్ర యంత్రాలు

| | | |
|---|---|---|
| శ్రీచక్రధారణాయంత్రం - రాగిపై (వెండిపూత) | రు | 60-00 |
| శ్రీచక్రధారణాయంత్రం - వెండిపై | రు | 150-00 |
| శ్రీచక్రధారణాయంత్రం - త్రిలోహాలపై | రు | 300-00 |
| శ్రీచక్రధారణాయంత్రం - బంగారంపై | రు | 3,500-00 |

| | | |
|---|---|---|
| మణిద్వీపవర్ణన కేసెట్ | రు | 50-00 |

## శ్రీ చక్రపూజా యంత్రాలు

| | | |
|---|---|---|
| శ్రీచక్రపూజాయంత్రం - రాగిపై వెండిపూత | రు | 400-00 |
| శ్రీచక్రపూజాయంత్రం - వెండిపై బంగారం పూతతో | రు | 2,000-00 |
| శ్రీచక్రపూజాయంత్రం - రాగిపై బంగారం పూత | రు | 500-00 |

తమ గోత్రనామాలపై పై యంత్రాలలో ఏ యంత్రం కావాలో వివరంగా వ్రాసి పూర్తిగా ద్రవ్యాన్ని ముందుగా అందజెయ్యాలి. తరువాత యంత్రాన్ని చెక్కించి విధి విధానానుసారం పూజచేసి సిద్ధిచేసి పంపగలము. వి.పి. పద్ధతి లేదు.

ఈ చిరునామాకే ద్రవ్యం పంపాలి

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

రాజమండ్రి - 4

"దేనికైనా విశ్వాసం ప్రధానంగా కావాలి"